ARGEST
LATED
GU MONTHLY

# చతుర

జనవరి 1999
రూ.7/-



హోతా పద్మినీదేవి **బాధ్యత**



# చతుర ప్రపంచం

## నాలుగు ముఖాలు

ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది సందర్శకులు అమెరికాలోని బ్లాక్‌హిల్స్‌కెళ్ళి అక్కడి కొండలమీద కళ్ళు చెదిరేలా బ్రహ్మాండమైన సైజులో చెక్కిన నలుగురు అమెరికన్ అధ్యక్షుల ముఖాకృతులను చూసి అబ్బురపడు తూంటారు.

1927 ఆగస్ట్ 10వ తారీకున అప్పటి అమెరికన్ అధ్యక్షుడు కూలిడ్జ్ సౌత్‌డకోటా రాష్ట్రంలోని ఈ బ్లాక్ హిల్స్ దగ్గర జరిగిన ప్రారంభోత్సవ సభలో ఇలా అన్నారు. 'అమెరికా స్వాతంత్ర్యానికి ప్రజాస్వామ్యానికి, స్వేచ్ఛకి, ఆర్థిక న్యాయానికి ఓటువేసే అమెరికన్స్ అందరూ భవిష్యత్తులో ఇక్కడికి వస్తారు' అని. అది నిజమయింది.

అలా ఆ కొండను తొలిచి అధ్యక్షుల ముఖాకృతులు చెక్కాలన్న ఆలోచన మొదట డోన్ రాబిన్సన్ అనే చరిత్రకారుడికి కలిగింది. జాన్ గట్జిన్ బోర్గ్లం అనే శిల్పిని ఆహ్వానించి అమెరికా చరిత్రలో ఆదర్శవంతమైన పాత్ర నిర్వహించిన నలుగురు దేశాధ్యక్షుల ముఖాలని చెక్కాలని నిర్ణయించాడు.

ఆ నలుగురులో జార్జి వాషింగ్టన్ అమెరికన్ ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసిన ఘనుడు. థామస్ జెఫర్సన్ 'డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్' రాసిన రచయిత. అమెరికన్ ప్రభుత్వానికి స్థిరత్వం చేకూర్చినదిట్ట. ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ నుంచి లూజియానా భూభాగాన్ని కొని అమెరికాలో కలిపిన వ్యక్తి. అబ్రహాంలింకన్ జాతి బానిసలకు స్వేచ్ఛనిచ్చి అంతర్యుద్ధంలో యూనియన్ ప్రభుత్వాన్ని కాపాడిన మహానుభావుడు. రూజ్వెల్ట్ పనామా కాలువను తెరచిన వ్యక్తి రాజనీతివేత్తగా ప్రసిద్ధుడు.






ముందుగా ఆ నలుగురు అధ్యక్షుల మోడల్స్ తయారుచేసుకున్నాడు బోర్గ్లం. వాటి ఒక్కోదాని ఎత్తు అయిదడుగులు. వాటి ఆధారంగా కొండను తొలిచి చెక్కిన ఒక్కో తల ఎత్తు అరవై అడుగులు. అంటే మోడల్స్ పరిమాణానికి పన్నెండు రెట్లు పెద్దవిగా ముఖాలను చెక్కారు. ఈ ఎత్తు మన ఆరంతస్థుల మేడకు సమానం.

బోర్గ్లం బక్కెట్లో కూర్చుంటే ఆయన్ను పైకి లాగేవారు. అతను కొండమీద అక్కడక్కడా పెయింట్‌తో మార్క్ చేసేవాడు. పనివాళ్ళు ఆ పద్ధతిలో చెక్కిన తర్వాత కొండకు ఎడంగా నిలబడి చూసి మళ్ళీ కొన్ని మార్పులు చేసేవాడు. ఆ రకంగా ముఖాకృతులను నిశితంగా పరిశీలిస్తూ అభివృద్ధి చేసినందువల్లే మోడల్స్‌కన్నా పూర్తయిన అరవై అడుగుల ముఖాలు అందంగా కనిపిస్తాయి. ఆ రోజుల్లో పనివాళ్ళకి గంటకి ఏభై సెంట్లు ఇచ్చేవారు. ఆ నాలుగు ముఖాలు చెక్కడానికి అయిన మొత్తం ఖర్చు 9,82,992 డాలర్ల 32 సెంట్లు. ఇందులో అమెరికన్ ప్రభుత్వం ఇచ్చింది 8,36,000 డాలర్లు. మిగిలిన సొమ్మును ప్రైవేట్ వ్యక్తులనించి చందాలుగా తీసుకున్నారు. మొత్తం పధ్నాలుగు సంవత్సరాలపాటు 360 మంది కార్మికులు పనిచేయగా ఈ శిల్పాలు పూర్తయ్యాయి.

వీటిలో వాషింగ్టన్ ముఖం ముందుకి వచ్చివుంటే జెఫర్సన్, రూజ్వెల్ట్ ముఖాలు కొద్దిగా లోపలకి వుంటాయి. చివర్లో లింకన్ మొహం వుంటుంది. జెఫర్సన్ రూజ్వెల్ట్‌ల మొహాలు లోపలకి చెక్కడానికి ఓ కారణం వుంది. 1933లో జెఫర్సన్ జుట్టుని, ముక్కు, కళ్లని చెక్కాక, చెక్కడానికి అనువుగా వుండే మంచిరాయి అయిపోయింది. పైగా కొండలో పెద్ద పగులు కనపడటంతో సగం తయారైన జెఫర్సన్ మొహాన్ని డైనమేట్‌తో పేల్చేసి వాషింగ్టన్‌కి ఈ వైపు కాక మరో వైపు మళ్ళీ జెఫర్సన్ ముఖాన్ని చెక్కాడు.

బోర్గ్లం 1867లో ఇదాహో రాష్ట్రంలో పుట్టాడు. 1890లో పారిస్ వెళ్ళి ప్రపంచ ప్రఖ్యాత శిల్పి ఆగస్ట్ రోడిన్ దగ్గర శిల్పకళ నేర్చుకున్నాడు. రోడిన్ దగ్గర నేర్చుకున్న టెక్నిక్‌ని ఉపయోగించి ఆ నలుగురు ప్రెసిడెంట్స్ కనుగుడ్ల స్థానంలో రెండడుగుల పొడవుగల నల్లటి గ్రానైట్ రాయిని పొదిగాడు. మధ్యాహ్న సూర్యకాంతి ఆ కనుగుడ్ల మీద పడ్డప్పుడు నిజం కనుగుడ్లలా అవి మెరుస్తూ కింద సందర్శకులు ఎక్కడ నిలబడ్డా సరే వాళ్ళవంకే చూస్తున్న భ్రాంతిని కలిగిస్తాయి.

ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ సినిమా 'నార్త్‌బైనార్త్ వెస్ట్'లో కేరీగ్రాంట్ ఓ ప్రెసిడెంట్ గడ్డాన్ని చేతులతో పట్టుకుని వేలాడే దృశ్యం ఇక్కడ చిత్రీకరించిందే.

ప్రతీరాత్రి ఓ 20 నిముషాల సినిమాని ఆ పర్వతం కింద ప్రదర్శిస్తారు. అందులో ఆ నలుగురు ప్రెసిడెంట్స్ ప్రాముఖ్యాన్ని వివరిస్తారు. ఆ సినిమా అవగానే సరిగ్గా రాత్రి తొమ్మిదిన్నరకి అకస్మాత్తుగా దూరంనించి లైట్లు ఆ ప్రెసిడెంట్ల మొహాలమీద పడతాయి. ఆ దృశ్యం ఎంతో అద్భుతంగా వుంటుంది.

---

## అతిపెద్ద సొరంగ నిర్మాణం

స్విట్జర్లాండ్‌లో ఆల్ప్స్ పర్వతాన్ని తొలిచి సొరంగాలని తయారుచేసి రహదారిని నిర్మించారు. ఫ్రెంచి, ఇటాలియన్ కంపెనీలు ఈ పనిని 1957లో మొదలుపెట్టి సమర్థవంతంగా నిర్వహించాయి. దీనిలో భాగంగా కొండలోని గ్రెనేట్‌రాతిని తొలిచి, మంచు కురుస్తున్నా వాహనాలు వెళ్లడానికి అనువుగా, 15,766 అడుగుల సొరంగాన్ని తవ్వారు. ఒకవైపు ఫ్రెంచి కంపెనీవారు, ఇంకోవైపు ఇటాలియన్ కంపెనీవారు ఈ







పనిని నిర్వర్తిస్తూ మధ్యలో కలుసుకున్నారు. 7 మైళ్ల పొడవుగల ఈ సొరంగం ప్రపంచంలోని అతిపెద్ద సొరంగం.

దీనివల్ల ఆల్ప్స్ పర్వతాలచుట్టూ తిరిగే రోడ్డుని వెయ్యాల్సిన అవసరం తప్పింది. దాంతో 125 మైళ్ల దూరం రోడ్డు తగ్గింది. ఈ సొరంగం పేరు మోంట్‌బ్లాంక్. 1963లో తెరచిన ఈ సొరంగంవల్ల రోమ్‌కి, ప్యారిస్‌కీ ప్రయాణకాలం గంట తగ్గింది కూడా. ఈ సొరంగం ఆధునిక ఇంజనీరింగ్ నైపుణ్యానికి తార్కాణంగా చెప్పుకోవాలి. సొరంగం తవ్వుతుంటే ఎన్నో అడ్డంకులు, నీటి ఊటలు, అనుకోని విధంగా పైకప్పు కూలడంలాంటి ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది.

377 మైళ్ల పొడవుగల ఆల్ప్స్ పర్వతాల్లో వ్యాపార లావాదేవీలకోసం రోడ్డువేయాలన్నది కొన్ని శతాబ్దాలకల.

1957లో ఫ్రెంచి, ఇటాలియన్ ప్రభుత్వాలు కలిసి ఈ సొరంగాల్ని ప్రైవేట్ వ్యాపార సంస్థలకిచ్చి, అవి సొరంగాల్ని తొలిచి 70 ఏళ్లపాటు వాటిమీద వచ్చే టోల్‌టాక్స్‌ని అనుభవించవచ్చునని ప్రతిపాదించాయి. 70 ఏళ్ల అనంతరం ఈ ఆస్తి రెండు దేశాలకీ చెందుతుంది. 1958, డిసెంబర్ 6న ఎంట్రీవ్స్ అనేచోట ఇటాలియన్ కంపెనీ డ్రిల్లింగ్‌పని మొదలుపెట్టింది. 1959 మేలో చమోనిక్స్ అనేచోట ఫ్రెంచ్ కంపెనీ పని మొదలుపెట్టింది. 24 గంటలూ మూడు షిఫ్ట్‌ల్లో పనిచేసి రోజుకి 2,000 టన్నుల రాతిని ఫ్రాన్స్ వైపు తొలిచేవారు. అలా సగటున రోజుకు 33 అడుగుల సొరంగం ఏర్పడేది. ఆలస్యంగా మొదలుపెట్టినా ఫ్రెంచ్ వారిపని ముందుగా పూర్తయింది. ఎందుకంటే వారికెలాంటి ఆటంకం రాలేదు.

కానీ ఇటాలియన్స్‌కి నీటి ఊటలు, గ్రెనైట్ కాక రాలిపడే తేలికరాళ్లు ఎదురయ్యాయి. ఈరెండు కంపెనీలు కలిసి తొలిచిన రాయి మొత్తం 31 కోట్ల క్యూబిక్ ఫీట్. దాంతో అడుగులోతు, వెడల్పుగల రోడ్డుని న్యూయార్క్‌నుంచి కైరోదాకా వేయచ్చు 23 అడుగుల వెడల్పుగల ఈ సొరంగంలో గంటకి 250 వాహనాలు ప్రయాణిస్తాయి.

సముద్రమట్టానికి 4278 అడుగుల ఎత్తుకి **తొలిచిన ఈ సొరంగం నిర్మాణానికి 3 కోట్ల, 30 లక్షల డాలర్లు ఖర్చు అయింది.**



# చతుర

సంపుటి: 21
సంచిక: 12
జనవరి 1999

పెళ్ళిమాటలు జరుగుతున్నాయి.

"ఇలా అడుగుతున్నానని మరోలా అనుకోకండి. మీకు మీ అమ్మాయి ఒక్కర్తే సంతానంకదా! భవిష్యత్తులో మీ బాధ్యత ఎవరు తీసుకుంటారు?" అని అడిగాడు పెళ్లికొడుకు తండ్రి పెళ్లి తల్లిని. ఆమెకు భర్తలేడు.

"అయితే మీకూ మీ అబ్బాయి ఒక్కడేకదా! వృద్ధాప్యంలో మీ బాధ్యత ఎవరిదీ?" అని అడిగింది పెళ్లికూతురు హటాత్తుగా తలెత్తి.

"అదేం ప్రశ్న? నేను మా అబ్బాయి దగ్గరే వుంటాను" అన్నాడు సీరియస్‌గా.

"మా అమ్మా అంతే! నా వద్దనే వుంటుంది"అంది ఆ అమ్మాయి స్థిరంగా.

అంతే... చరాలునలేచి పెళ్లికొడుకు చెయ్యి పట్టుకుని లేవదీసి కోపంగా గడపదాటాడా తండ్రి. అటుపైన ఆ అమ్మాయి వివాహం ఎవరితో...? ఎలా...? జరిగింది? కన్నకొడుకులే పట్టించుకోని ఈ రోజుల్లో... కూతుళ్లు మాత్రమేవున్న తల్లితండ్రులయందు అల్లుళ్ల బాధ్యత ఏమిటి? అల్లుళ్లు అత్తమామలను కొడుకుల్లా చూసుకోగల అవకాశం ఎంత?

మానవత్వం మరిచిన మనుషుల మనస్తత్వాలను అక్షర రూపంలో ఆవిష్కరించిన

హోతా పద్మినీదేవి

# బాధ్యత

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

'ఉమ ఇంకా ఇంటికి రాలేదేమా!' అనుకుంది పార్వతమ్మ పదోసారి. ఉమ స్కూలు నుంచి ఠంచనుగా అయిదు గంటలకి వస్తుందని తెలిసినా ఇవాళ నాలుగు గంటల నుంచే కూతురికోసం ఎదురు చూస్తూ వుందామె! కూతురిని చూసుకోడానికి పెళ్ళివారు వస్తున్నారనే ఆతృతతో ఆవిడ అస్థిమితంగా వుంది. వున్న రెండు గదులని పొద్దుటనుంచీ సర్దుతూనే వుంది. సర్దడానికి ఆ ఇంట్లో పెద్దగా సామాన్లేమీ లేవు. అయినా ఆ సర్దడంలో తమ లేమిని దాచుకోవాలనే తపన, వున్నంతలో శుభ్రంగా కనిపించాలనే తాపత్రయం కనిపిస్తున్నాయి.

సరిగ్గా అయిదు గంటలకి ఉమ ఇంట్లో అడుగుపెట్టింది.

"త్వరగా స్నానం చేసిరా! నేనీలోగా కాఫీ కలుపుతాను'' అంది కూతురుని తొందరచేస్తూ.

ఉమ చేతిలోని పర్సుని, టిఫిన్ డబ్బాని వంటగదిలో పెట్టి స్నానానికి వెళ్ళింది. తల్లి ఆతృత అర్థమై ఆమె మనసు ఆర్ద్రమయింది.

'పెళ్ళిచూపులకి ఎవరో వస్తున్నారనగానే ఈ సంబంధమేదో నిశ్చయమయినట్లే ఎంత సంతోషిస్తోంది అమ్మ! ఆవిడ ఆనందానికి కారణం తనకి తెలుసు. గత ఆరు నెలలుగా ఆవిడ తన పెళ్ళికోసం చేసిన ప్రయత్నాలు కనీసం పెళ్ళిచూపులవరకూ రాకుండానే విఫలమయ్యాయి. ఇవాళ తన మొదటి పెళ్ళిచూపులు. తన ఫోటో అబ్బాయికి నచ్చిందని మధ్యవర్తిద్వారా వింది. ఏ అబ్బాయికైనా తను నచ్చుతుంది. నిరాకరించడానికి తను అనాకారేమీ కాదు. కాని, తనని తిరస్కరించడానికి బోలెడు కారణాలున్నా వాటిలో ముఖ్యమైనది తమ ఆర్థికపరిస్థితి...! రెండు...'

"ఎంతసేపమ్మా స్నానం! అవతల వాళ్ళొచ్చేవేళయింది''

తల్లి బిగ్గరగా పిలవడంతో ఆమె ఆలోచనలలోనుంచి తేరుకుని త్వరగా స్నానం ముగించి బయటకి వచ్చింది.

కూతురి జడలో కనకాంబరాల మాల తురుముతూ "ఈ సంబంధం స్థిరపడుతుంది'' అనే ఆశాభావంతో వున్న పార్వతమ్మ అలా జరిగితే కూతుర్ని, అల్లుడిని పసుపు బట్టలతోనే తిరుపతి పంపిస్తానని మొక్కుకుంది కూడా.

వాకిట్లో రిక్షాలు ఆగాయి.

పెళ్ళివారిని ఆహ్వానించడానికీ, కాఫీ ఫలహారాలు అందించడానికీ పక్కింటి సుశీలమ్మని తోడుగా వుంచుకుంది పార్వతమ్మ. ఆవిడ అందరినీ ఆహ్వానించి కాఫీ ఫలహారాలు అందించింది.

మధ్యలో ఒకసారి వంటగదిలోకి వచ్చి గోళ్ళు కొరుకుతూ కూర్చున్న ఉమతో అందావిడ.

"అబ్బాయి అందగాడు కాదు గానీ చూడ్డానికి ఫర్వాలేదు. బాగానే వున్నాడు. అయినా మగవాడికి అందమేమిటి!"

మరో సమయంలో అయితే ఉమ "అందం ఆడదానికి మాత్రమే ముఖ్యమైన అర్హతా?" అని వాదించేది. కాని ఇప్పుడామెకి టెన్షన్‌గా వుంది. ఇదే మొదటి పెళ్ళిచూపులవడంవలన సహజంగానే కంగారుగావుంది.

ఉమని చూసిన వరుడి కళ్లలో ప్రశంసతో కూడిన మెరుపు కనిపించింది. కొడుకు కళ్లలోని మెప్పుదలని గమనించినా సుందరరామయ్య ఆనందించలేదు. కారణం ఈ ఇల్లు ఇలా ఉండటం. తమకి ఏమాత్రం సరితూగని పార్వతమ్మతో వియ్యం ఆయనకి ఇష్టంలేదు. పిల్ల అందచందాలు, కుటుంబ సాంప్రదాయం నచ్చినా ఓ సందేహం ఆయన్ని పీడిస్తోంది.

ఆయన ఒకసారి దగ్గి గొంతు సవరించుకుని అడిగాడు.

"మీ స్వస్థలం ఏది? మీ బంధువులంతా ఎక్కడున్నారు?"





"మాది అమలాపురం. మాకు బంధువులని చెప్పుకోదగిన వాళ్ళెవరూ లేరు. మావారు మా అత్తమామలకి ఒకరే సంతానం..." చిన్నగా చెప్పింది పార్వతమ్మ.

"ఇలా అడుగుతున్నానని మరొకలా అనుకోకండి. మీకు అమ్మాయి ఒకర్తే సంతానం కదా! భవిష్యత్తులో మీ బాధ్యత ఎవరు తీసుకుంటారు?"

ఆయన అలా అడుగుతాడని వూహించని ఆవిడ అవాక్కయింది.

పార్వతమ్మే కాదు మధ్యవర్తిగా వచ్చిన పెళ్ళిళ్ళ పేరయ్య, సుశీలమ్మలు కూడా నోటమాట రానట్టయ్యారు.

ఉమ ముఖంలో రంగులు మారుతున్నాయి. ఆవేశంతో, అసహ్యంతో ఒళ్ళు వణికిపోతోంది. అతి ప్రయత్నంమీద తనని తాను నిగ్రహించుకుంటూ ప్రశాంతంగా సుందరరామయ్యవైపు చూసింది.

"మీరు మరోలా భావించకపోతే నేను ఒక ప్రశ్న అడగవచ్చా?"

"ఏమిటది''?

"మీకూ మీ అబ్బాయి ఒక్కరే సంతానం కదా! రేపు మీ కాలు, చెయ్యి వంగాక మీ బాధ్యత ఎవరిది?"

సుందర్రామయ్య ఎదురుచూడని ఈ ప్రశ్నతో ఖంగుతిన్నాడు. ఆయన ముఖం జేవురించింది.

"అదేం ప్రశ్న, నేను మా అబ్బాయి దగ్గరే వుంటాను''

"అలాగే మా అమ్మ కూడా నా దగ్గరే వుంటుంది'' అదే ప్రశాంతతతో అంది ఉమ.

సుందర్రామయ్యకి ఇది మరో షాక్! "లేవరా, అబ్బాయ్!" ఉమ వైపు కళ్ళప్పగించి చూస్తున్న కొడుకుని మండిపడుతూ పిలిచాడు.

తండ్రి వెనుకనే బుద్ధిమంతుడిలా లేచాడు అబ్బాయి.

కనీసం "వెళ్ళొస్తాం" అని కూడా చెప్పకుండా వెళ్ళిపోతున్న వాళ్ళని చూసి కోపంగా అంది పార్వతమ్మ.

"ఏమిటే నువ్వు చేసిన పని?"

"నేనేం చేశానమ్మా?" అర్థంకానట్టు అడిగింది ఉమ.

"ఆయనేదో చాదస్తంగా అడిగితే మాటకి మాట జవాబిస్తావా? పైగా 'మా అమ్మ నాతోనే వుంటుందని చెబుతావా?' నీతోబాటు నన్ను కూడా నీ అత్తవారింటికి తీసుకెళ్దామనుకుంటున్నావా?"

"ఆయనది చాదస్తం కాదమ్మా! భయం! నువ్వు వృద్ధాప్యంలో వాళ్ళింటికి వస్తావేమో, నీ పోషణ భారం వహించవలసి వస్తుందనే భయం!"

"ఆయన ఏ ఉద్దేశంతో అడిగినా నువ్వలాగేనా జవాబివ్వడం! ఆయన అడిగినది నన్ను. జవాబివ్వవలసినదాన్ని నేను. మంచి, మర్యాద లేకుండా తగుదునమ్మా అని ఎదురు ప్రశ్న వేస్తావా? ఈ విషయం పదిమందికీ తెలిస్తే అసలు నీకు పెళ్ళవుతుందా?"

"ఏ విషయం? నేను ఆయనకు జవాబిచ్చిన విషయమా? లేక నువ్వు నాతోనే మా అత్తవారింట్లో వుంటావని చెప్పిన విషయమా?"

"రెండూను''

"నేనలా సమాధానం ఇవ్వడంలో తప్పు లేదమ్మా! తప్పంతా ఆయనది. పెళ్ళి చూపులకి వచ్చి కనీసం నా పేరయినా అడగకుండా ఆ చచ్చుప్రశ్న వెయ్యడంలోనే అర్థమవుతోంది ఆయన సంస్కారమెలాంటిదో"

"నువ్వు తొందరపడ్డావు ఉమా!" సుశీలమ్మ కూడా అంది.

ఉమకి ఒళ్ళు మండిపోతోంది. తల్లేకాదు పొరుగువాళ్ళు కూడా తనదే తప్పంటున్నారు. ఆమె విసురుగా లోపలికి వెళ్ళి చీర మార్చుకుని పెరట్లో కూర్చుంది.



తల్లి పెళ్ళివారు ఖాళీచేసిన టిఫిన్ ప్లేట్లు కడుగుతున్నా సాయం చెయ్యలేదు.

తల్లీ కూతుళ్ళిద్దరూ మౌనంగా భోజ నంచేసి పడుకున్నారు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండిపోయి ఆ ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు.

పార్వతమ్మని ఒకే ప్రశ్న భూతంలా భయపెడుతోంది.

'తను ఉమ పెళ్ళి చెయ్యగలదా? ఇన్నా ళ్ళూ కూతురి పెళ్ళికి తన ఆర్థికస్థితి ఒక్కటే ప్రతిబంధకం అవుతుందనుకుంది. కాని తండ్రి లేకపోవడం కూతురికి ఒక పెద్ద అనర్హత అవుతుందనుకోలేదు.

"భవిష్యత్తులో మీ బాధ్యత ఎవరు తీసు కుంటారు?" అనే సుందర్రామయ్య ప్రశ్న వెయ్యి స్వరాలుగా మారి ఆవిడ చెవులలో ప్రతిధ్వనిస్తోంది.

నిజమే! వృద్ధాప్యంలో తనకి ఎవరు ఆసరా అవుతారు? తనకి ఉమ ఒక్కర్తే సంతానం! అల్లుడు తనని ఆదరిస్తాడా? ఆడ పిల్ల పుట్టడం తన దురదృష్టం. మగపిల్లవా డు పుట్టివుంటే కొడుకు దగ్గర నిశ్చింతగా చివరి రోజులు గడిపేది'

ఆవిడ ఆలోచనలు అలా సాగిపోతు న్నాయి.

ఉమకీ నిద్రపట్టడంలేదు. సుందర్రామ య్య ప్రశ్న గుర్తొచ్చినప్పుడల్లా ఆమెకి ఒళ్ళు తెలియని ఆవేశం వస్తోంది.

"అమ్మ వాళ్ళ నెత్తిమీద కూర్చుంటుందే మోనని కదూ వాళ్ళ భయం! ఛ! సంస్కారం లేనిమనిషి'' ఆమె కసిగా ఆ సంఘటనని మనసులో నుంచి చెరిపెయ్యడా నికి ప్రయత్నిస్తూ కళ్ళు మూసుకుంది.

'తను పెళ్ళిచేసుకుని అత్తవారింటికి వెళ్తే అమ్మ ఒంటరిగా ఎలా బతుకుతుంది? ఆవి డని తన భర్త ఆదరిస్తాడా?' అశాంతిగా వుంది ఆమెకి.

'అలా వీల్లేదు. అమ్మని ఆదరించగలిగే సహృదయుడు దొరికేవరకు తనసలు పెళ్ళే చేసుకోదు' ఆమె మనసులోనే నిర్ణయించు కుంది.



పార్వతమ్మ బెల్ నొక్కిన కొన్ని క్షణాల తర్వాత తలుపు తెరుచుకుంది.

"రండి పార్వతమ్మగారూ!" తలుపు తీసిన అరుంధతి చిరునవ్వుతో ఆహ్వా నించింది.

పచ్చని శరీరచ్ఛాయతో వున్న ఆవిడ అందంగా హుందాగా వుంది. ఆవిడ మెడలో ను చేతులకి వున్న ఆభరణాలు ఆవిడ ఎంత ధనవంతురాలో చెప్పకనే చెబుతున్నాయి. అన్నింటికీ మించి ఆవిడ ముఖంలోని చిరున వ్వు వెలకట్టలేని సిరిలా వుంది.

పార్వతమ్మ లోపలకి అడుగుపెట్టింది. కూర్చున్నాక ఓ సంగీతం పుస్తకం తెరచి చూస్తూనే అరుంధతి వున్నట్టుండి ఏదో గుర్తు వచ్చినట్టు అడిగింది.

"అవునూ, ఉమకి నిన్న పెళ్ళిచూపుల య్యాయా?"

"అయ్యాయి'' క్లుప్తంగా అంది.

"అబ్బాయి బాగున్నాడా? పెళ్ళి వారు

సుముఖంగానే వున్నారా?"

"ఈ సంబంధం ఫెయిలయినట్టేనండి'' అంటూ క్లుప్తంగా నిన్న జరిగినదంతా చెప్పింది.

అరుంధతి ఆశ్చర్యంగా వింది. "పెళ్ళి చూపులలోనే ఆ ప్రశ్న అడిగారూ అంటే వాళ్ళ సంస్కారమెలాంటిదో అర్థమవుతూనే వుంది. పోనిద్దురూ, ఇంతోటి సంబంధం. ఉమకేం చక్కగా వుంటుంది. ఉద్యోగం కూడా చేస్తోంది. చిన్న ఉద్యోగం చేసుకుంటున్న అబ్బాయైనా ఫర్వాలేదు. మంచివాడికి ఇచ్చి చెయ్యండి'' అంది.

పార్వతమ్మ శుష్కహాసం చేసింది. ఉమ పెళ్ళి తనకో సమస్యేనని తెలుసు. కాని ఈ కోణంనుంచి సమస్య మరింత జటిలమవుతుందని ఆవిడ ఎప్పుడూ ఊహించలేదు.

యాంత్రికంగా పాడుతోందే కాని అరుంధతి మనసులో ఒకే ప్రశ్న సుడితిరుగుతోంది.

"మగపిల్లలు లేని తల్లిదండ్రులంతా ఇదే పరిస్థితిని ఎదుర్కొంటున్నారా?"

పార్వతమ్మ వెళ్ళాక ఆవిడ భర్త గదిలోకి వచ్చింది. ఆవిడ ముఖంలోని ఉద్విగ్నతని గమనిస్తూ ఆశ్చర్యంగా అడిగేడాయన.

"ఏమిటి... అరుంధతీ''

"ఉమకి పెళ్ళి నిశ్చయం కాలేదుటండీ!"

"ఎందుకని?" మురళీధరరావు మామూలుగా అడిగాడు. ఆవిడ విషయం చెప్పింది.

"ఛ! సంస్కారహీనులు! పార్వతమ్మగారు ఎంత ఆత్మాభిమానం కలిగిన మనిషి అయినా ఆవిడ కూతురి పెళ్ళయినవెంటనే ఆమెతోబాటు తనూ ఆ అత్తవారింటికి వెళ్తుందని ఎలా వూహించారువాళ్ళు?"

"కొడుకులు లేనివాళ్ళకి ఇలాంటి సమస్య ఎదురవకతప్పదా? మనకి పల్లవి ఒకర్తే అమ్మాయి. మనకీ ఇలాంటి పరిస్థితే ఎదురయితే?" ఆవిడ కళ్లలో నీళ్లూరుతున్నాయి.

"నీకేమయినా మతిపోయిందా? ఎప్పుడో జరగబోయే దాన్ని గురించి ఇప్పటినుంచీ బెంగపెట్టుకుంటున్నావా? అయినా, పార్వతమ్మగారికీ మనకీ తేడా లేదూ? ఆవిడ నాలుగిళ్లలో సంగీతం చెప్పుకుని బతుకుతోంది. వెనకాల ఆస్తి పాస్తులూ లేవు. వెనకేసిందీ లేదు. మనకి నాలుగు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తి వుంది. డబ్బుకోసమైనా మనని నెత్తిన పెట్టుకుని పూజచేస్తాడే మన అల్లుడు'' మురళీధరరావుగారి స్వరం ధీమాగా ధ్వనించింది.

అరుంధతి కళ్ళు తుడుచుకుంది. వైద్యశాస్త్రం అంతగా అభివృద్ధి చెందని ఆ రోజులలో ఆవిడ సంతానం కోసం చెయ్యని వ్రతంలేదు. మొక్కని దేముడు లేడు. పెళ్ళయిన పదేళ్ళ తరువాత ఇంక పిల్లలు పుట్టరని నిరాశ చేసుకుంటున్న తరుణంలో పల్లవి పుట్టింది. తరువాత ఆవిడకి మళ్ళీ కాన్పే రాలేదు. లేకలేక పుట్టిన బిడ్డపై పంచప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నారు ఆ దంపతులు.

ఆ రాత్రి భోజనం చేస్తూ అంది ఆవిడ. "పల్లవి ఇంజనీరింగ్ ఈ సంవత్సరంతో పూర్తవుతుంది. ఇంక మెల్లిగా పెళ్ళి సంబంధాలు చూడడం మొదలుపెట్టవచ్చు''

"చూద్దాం... అమ్మాయి అభిప్రాయం కూడా కనుక్కోవాలిగా'' అన్నాడాయన.

"పల్లవి అభిప్రాయం అలావుంచి, మీ అభిప్రాయమేమిటో చెప్పండి ముందు''

"చదువుకున్నవాడు, ఆస్తి హోదాలలో మనతో సరితూగేవాడు, మంచివాడు అయితే చాలు''

"నాకు మాత్రం పెద్దపెద్ద ఆశలేవీ లేవు. మన అల్లుడు మన వృద్ధాప్యంలో మనని ఆదరించే వాడయితే చాలు''

"నీకు పార్వతమ్మగారి అనుభవం విన్న దగ్గరనుంచి ఈ భయం పట్టుకున్నట్లుందే'' నవ్వేడాయన.

  



"లాభంలేదమ్మా!" పెదవి విరిచాడు పేరిశాస్త్రి. "ఉమని చేసుకోడానికి వాళ్ళు సుముఖంగా లేరు''

"ఎందుకని? నేనిచ్చే కట్నకానుకలు చాలకనా?"

"అసలు అంతవరకు వస్తేకదా! మీకు అమ్మాయి ఒక్కర్తే సంతానం అని తెలియగానే పెదవి విరిచారు.

పార్వతమ్మ ముఖంలో రంగులు మారుతున్నాయి.

వాళ్ళు ఉమని తిరస్కరించడానికి కారణం తనకి ఆమె ఒక్కర్తే సంతానం అని మాత్రమే కాదు. తన లేమి కూడా కారణమే

"మీరు పెద్దగా కట్నం ఇచ్చుకోలేరు. అలాగని చూస్తూచూస్తూ ఏ తలమాసినవాడికో పిల్లనిచ్చి చేతులు దులుపుకోలేరు. అందుకని మధ్యేమార్గంగా నేనొకటి చెబుతాను. వింటారా?"

"చెప్పండి''

"రెండవపెళ్ళి వాడయితే కట్నం బాధ వుండదు. మీరు ఊఁ అంటే లక్షణమైన సంబంధం రెడీగా వుంది. అతనికి తల్లిలేదు కాబట్టి మీరు అమ్మాయి పెళ్ళయ్యాక వాళ్ళ దగ్గరే వున్నా అతనికి అంత అభ్యంతరం వుండకపోవచ్చు''

"రెండవ పెళ్ళివాడా?" పార్వతమ్మ గుండెపిండినట్టవుతోంది.

"రెండవ పెళ్ళి వాడైతేనేమిటమ్మా? లక్షణమైన సంబంధం! గవర్నమెంటు ఉద్యోగి''

"నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి శాస్త్రిగారూ'' అందావిడ.

పదిరోజుల తరువాత పేరిశాస్త్రి ఆ సంబంధం విషయం అడిగినప్పుడు ఆవిడ సున్నితంగానే తిరస్కరించింది.

"ఉమ పెళ్ళి విషయంలో నేను తొందరపడదలచుకోలేదు శాస్త్రిగారూ! చూద్దాం. ఏ సంబంధమూ కుదరకపోతే అప్పుడు మీ దారికే వస్తాను'' అంది.

★ ★ ★

"డియర్ పల్లవీ,

నీ ఉత్తరం అంది చాలా రోజులయినా, నీకు వెంటనే జవాబివ్వలేకపోయాను. ఏమీ అనుకోవుకదూ? అంత తీరుబడి లేకుండా ఏం చేస్తున్నావే అంటావేమో? నేను నీకు ఉత్తరం రాయకపోవడానికి కారణం తీరికలేక కాదు. ఈమధ్య జరిగిన ఒకసంఘటన నా మనసుపై బలంగా దెబ్బతీసింది.

కొన్ని నెలలుగా అమ్మ నాపెళ్ళికోసం చేస్తున్న ప్రయత్నాలు పెళ్ళి చూపులవరకు వచ్చాయి. పెళ్ళికొడుకు తండ్రి కనీసం నా పేరయినా అడగకుండా మా అమ్మని ఒక చెత్త ప్రశ్న వేశాడు. "మీకు మీ అమ్మాయి ఒకర్తే సంతానంకదా! భవిష్యత్తులో మీ బాధ్యత ఎవరిది?" అని. ఎంత సంస్కారహీనుడో చూడు ఆ పెద్దమనిషి. నా పెళ్ళయ్యాక మా అమ్మకూడా నాతోబాటు వాళ్ళింటికి వస్తుందని ఆయన భయం! నాకు ఒళ్ళు మండిపోయి "మీకూ అబ్బాయి ఒక్కడే కదా. వృద్ధాప్యంలో మీ బాధ్యత ఎవరిది?" అని అడిగాను. అంతేకాదు "మా అమ్మ నాతోబాటే ఉంటుంది'' అని చెప్పేశాను. దానితో బుర్ర తిరిగినట్టుంది. ముఖం గంటుపెట్టుకుని లేచి చక్కాపోయాడు. మా అమ్మ పెద్ద గొడవ చేసింది. అలా మాట్లాడకూడదంటుంది. ఈ విషయం తెలిస్తే ఇంకెవరూ నన్ను పెళ్ళిచేసుకోవడానికి ముందుకి రారంటుంది.

నేను తప్పుచేశానా పల్లవీ? ఆడ, మగల మధ్య అంత వ్యత్యాసమెందుకు? తల్లిదండ్రుల బాధ్యత అనేది కేవలం మగపిల్లలకేనా? ఆడపిల్లలకి లేదా? వృద్ధాప్యంలో తల్లిదండ్రులకి అన్నం పెట్టకుండా వృద్ధ శరణాలయాల పాల్జేస్తున్న ఎందరో దౌర్భాగ్యుల గురించి మనం వింటున్నాం, చూస్తున్నాం. అమ్మానాన్నలను ఆదరించే ఆడపిల్లల గు




రించీ వింటున్నాం. అలాంటిది ఎవరూలేని అమ్మని నా దగ్గర వుంచుకోవాలనుకోవడం తప్పంటావా? నాకు మాత్రం అమ్మని గౌర వించే సంస్కారవంతుడిని తప్ప పెళ్ళి చేసుకోవాలని లేదు. అలాంటి వ్యక్తి దొరక్క పోతే పెళ్ళే చేసుకోను. నాది దురాశేనంటా వా? చూద్దాం.

సరేగానీ, మరో రెండునెలల్లో నీ పరీక్షలు మొదలవుతాయని మీ అమ్మగారు చెప్పారు. పరీక్షలు కాగానే వచ్చేస్తావుగా?

-నీ ఉమ''

"ఏమిటోయ్. అంత దీక్షగా చదువుతు న్నావ్. ఎవరు రాశారా ఉత్తరం? లవ్ లెటరే నా?" నీరజ భుజంమీద చరిచేవరకు పల్లవి తల ఎత్తలేదు.

"పోవే నీకెప్పుడూ అదే ధ్యాస! నా ఫ్రెండ్ రాజమండ్రి నుంచి వ్రాసింది''

"ఎవరు, ఉమేనా?"

"అవును''.

"మీ ఇద్దరి ఫ్రెండ్‌షిప్‌ని చూస్తే నాకు జెలసీగా వుంది పల్లవీ! మీ ఇద్దరూ ఎంత మంచి స్నేహితులు!"

"ఉమ చాలా తెలివైనది నీరజా! బాగా చిన్నతనంలోనే తండ్రి పోయాడు. పసితనంలోనే తండ్రిని కోల్పోయిన పిల్లలు ఎన్ని కష్టాలు పడతారో ఉమ అన్ని కష్టాలూ అనుభవించింది. చదువులో క్లాస్ ఫస్ట్ వచ్చే ఉమ చదువుకోవాలని వున్నా, అందుకు తమ ఆర్థికపరిస్థితి సహకరించక ఇంటర్‌తోనే చదువు ఆపేసింది''

"పల్లవీ! నీకోసం గౌతమ్ వచ్చాడు'' సరిత రూమ్‌లోకి వస్తూ చెప్పింది.

గౌతమ్ పేరు వినగానే పల్లవి నిటారుగా అయింది.

"నేను ఇప్పుడే వస్తాను. నువ్వీలోగా ఈ ఉత్తరం చదువు'' అంటూ ఉమ వ్రాసిన ఉత్తరాన్ని నీరజకి అందించబోయింది.

"ఈ ఉత్తరం నీకు వ్రాసినది'' అంది నీరజ ఆ ఉత్తరాన్ని అందుకోకుండా.

"ఏమీ ఫర్వాలేదు. ఇందులో రహస్యాలే వీలేవు. పైగా మనలా తల్లిదండ్రులకి ఒకర్తే ఆడపిల్ల అయిన అమ్మాయిలు ఎదుర్కొనబో యే సమస్య వుంది. చదువు..." అంటూ ఆ ఉత్తరాన్ని నీరజకి ఇచ్చింది.

గౌతమ్ వడివడిగా నడుస్తూ వచ్చిన పల్లవిని చిరునవ్వుతో చూస్తూ అన్నాడు.

"యు ఆర్ లుకింగ్ సింప్లీ స్మార్ట్ టుడే''

తనని చూడగానే అతని ముఖంలో ఎగిరి వచ్చిన కాంతి ఆమెకి వేరే అర్థాలను చెప్పింది.

ఈ మధ్యకాలంలో అతను తనపై కనబరుస్తున్న చనువు, తనని చూడగానే అతని కళ్ళలోని మెరుపు ఆమె గమనించకపోలేదు.

"థ్యాంక్‌యూ'' నిర్లిప్తంగా అంది.

"నిన్ను ఇవ్వాళ మా ఇంటికి తీసుకువస్తానని అమ్మతో చెప్పాను''

"దేనికి?"

"అమ్మ నిన్ను చూడాలని తెగ ఉబలాట పడుతోంది''

"దేనికి?" వింతగా అడిగింది.

"షో! ఏమీ తెలియనట్టు'' కినుకగా అన్నాడతను.

"ఓ.కే. నేను నీతో మీ ఇంటికి రావాలి. అంతేగా! ఒక్క నిముషం! ఇప్పుడే వస్తాను'' పల్లవి రూమ్‌కి తిరిగి వచ్చి బ్యాగ్ తీసుకుంటూ చెప్పింది నీరజతో.

"నేను గౌతమ్‌తో వాళ్ళింటికి వెళ్తున్నాను''

ఉమ రాసిన ఉత్తరాన్ని చదువుతున్న నీరజ తల ఎత్తకుండానే "ఒ.కె. విష్ యు గుడ్ లక్' అంది.

నీరజ గౌతమ్ గురించి, తన గురించి ఏమనుకుంటోందో అర్థమైన పల్లవి ముఖం కందిపోయింది. ఆమె మౌనంగా ముందుకి నడిచింది.



సచిత్ర విచిత్రం

# కొత్త ఆల్బం



మైఖేల్ జాక్సన్ థ్రిల్లర్ ఆల్బమ్ ఎంత హిట్టయిందో అందరికీ తెలుసు. ఇప్పుడు అతను తెస్తున్న ఇంకో ఆల్బం 'ఘోస్ట్' దాన్ని అధిగమించింది. 40 నిమిషాల సేపు సాగే ఈ వీడియో కేసెట్ ఆల్బం యూరప్, ఆస్ట్రేలియా, అమెరికాలలో రిలీజ్ అయింది. అందు లోని ఓ దృశ్యంలో మైఖేల్ నాలుక ఇలా ఇంత పెద్దదిగా కనిపిస్తుంది.

"ఇలాగే వస్తావా?" డ్రెస్ మార్చుకోవా?" అడిగాడు గౌతమ్.

"ఇప్పుడేగా నేను చాలా బాగున్నానని నాకు కితాబు ఇచ్చావ్!" సీరియస్‌గా అడిగింది.

"అవుననుకో! కాని, మొదటిసారిగా మా అమ్మ నిన్ను చూడబోతోంది కదా అని..."

"నన్ను మీ ఇంటికి తీసుకెళ్తావా, లేకపోతే నన్ను రూమ్‌కి వెళ్ళి చదువుకోమంటావా?"

"ఎంత కోపం! నీ పని ఇప్పుడు కాదు! తర్వాత చెబుతాను'' పళ్ళ బిగువున అంటూ స్టీరింగ్ ముందు కూర్చున్నాడు.

"పరీక్షలయ్యాక ఏం చెయ్యాలనుకుంటున్నావ్?"

"పెట్టే, బుట్టా సర్దుకుని మా అమ్మ దగ్గరికి ప్రయాణమవ్వాలనుకుంటున్నాను''

"అది సరే. నీ ఫ్యూచర్ ప్లాన్స్ ఏమిటి?"

అతని ప్రశ్నలోని అంతరార్థాన్ని వూహిస్తూనే "పరీక్షలయితేనేగానీ ఆలోచించేదేమీ లేదు'' అంది.

గౌతమ్ ఇంటిముందు కారాపుతూ అభ్యర్థిస్తున్నట్టు అన్నాడు.

"మా అమ్మతో కూడా నువ్విలాగే మాట్లాడతావా?"

"అంటే?"

"కొంచెం నవ్వుతూ మాట్లాడు ప్లీజ్!"

"ఏమిటి గౌతమ్ మరీ చిన్నపిల్లకి చెప్పినట్టు! సర్లే పద" పల్లవిని చూస్తూనే విప్పారిన ముఖంతో ఎదురొచ్చి ఆహ్వానించింది గౌతమ్ తల్లి అమరేశ్వరి.

"అమ్మా! మన ఇంటికి ఎవరొచ్చారో చెప్పుకో చూద్దాం!" గౌతమ్ ఉత్సాహంగా అన్నాడు.

"పల్లవిని నాకు కొత్తగా పరిచయం చేస్తావేమిటిరా!" నవ్విందావిడ. "రామ్మా! లోపలికి రా!"

పల్లవి నిర్లిప్తంగా లోపలికి అడుగుపెట్టింది. ఆ ఇంట్లో అణువణువునా వెల్లివిరుస్తున్న అంతులేని ఐశ్వర్యాన్ని ఆమె చూడడం లేదు. ఎదురుగా అందంగా, హుందాగా తనవైపు ఆరాధనగా చూస్తున్న గౌతమ్ ఆమె కన్నెమనసులో గులాబీలు పూయించడంలేదు.

ఆమె ఆలోచిస్తోంది. "ఎందుకిలా జరిగింది? తన ప్రవర్తనలో లోపం వుందా?"

"కాఫీ తీసుకుంటావా, టీనా?" అమరేశ్వరి అడుగుతోంది.

"ఏదైనా ఫర్వాలేదు ఆంటీ!" పరధ్యానంగానే జవాబిచ్చింది.

గౌతమ్‌కి అసహనంగా వుంది.

"అమ్మతో పల్లవి గురించి ఎంత గొప్పగా చెప్పాడు! ఇప్పుడు ఆమె ముక్తసరిగా మాట్లాడుతుంటే ఆవిడ ఏమనుకుంటుంది?" అమరేశ్వరి కాఫీ ఫలహారాలు అందిస్తూ అంది.

"ఏమీ మొహమాటపడకు. ఇది నీ ఇల్లేననుకో!"

పల్లవి నవ్వి వూరుకుంది.

"మీ నాన్నగారేం చేస్తారు?"

"లాయర్''

"అవునవును. మరిచిపోయాను. గౌతమ్ నీ గురించి చెప్పాడు. నీ గురించే కాదు. మీ కుటుంబం గురించి కూడా చెప్పాడు''

ఆమె ఆశ్చర్యంగా అడిగింది. "నా గురించా? ఏం చెప్పాడు?"

"నువ్వు మీ అమ్మానాన్నలకి ఒక్కగానొక్క అమ్మాయివని, చాలా అందంగా వుంటావని, చాలా తెలివైన దానివని, అసలు గౌతమ్ నాతో మాట్లాడే మాటలలో సగం నీ గురించే చెబుతాడు''

పల్లవి గుండె క్షణకాలం లయతప్పింది. ఆమె నుదుట చిరుచెమటలలుముకున్నాయి. గౌతమ్ మనసేమిటో అర్థమయిన ఆమె కంపించిపోతోంది.

అమరేశ్వరి సైగని అర్థంచేసుకుని గౌతమ్ లోపలికి వెళ్ళిపోయాడు.

"రామ్మా మా ఇల్లు చూద్దువుగాని'' అందా విడ లేస్తూ. పల్లవి యాంత్రికంగా అనుస రించింది.

ఆవిడ ఒక్కొక్క గదిని చూపిస్తూ ఆ ఇంటిని కట్టించడానికి తనెంత శ్రమపడిందీ వివరించింది.

తన బెడ్‌రూమ్‌లో పల్లవిని కూర్చోబెట్టి అక్కడున్న ఇనప్పెట్టె తాళం తెరుస్తూ చెబు తోంది ఆవిడ.

"మావారు పోయేసరికి గౌతమ్ పదేళ్లవా డు. వాడికి తండ్రి లేనిలోటు తెలియనివ్వ కుండా పెంచి ఇంత వాడిని చేశాను. ఈ ఆస్తి కంతటికీ ఏకైక వారసుడైన గౌతమ్‌ని తమ అల్లుడిగా చేసుకోవాలని చాలామంది పోటీ పడుతున్నారు. నాకుమాత్రం నీలాంటి అంద మైన, తెలివైన అమ్మాయిని కోడలిగా తెచ్చు కోవాలని ఉంది. డబ్బుదేం వుంది? ఇవాళ వస్తుంది. రేపు పోతుంది. అయినా కట్న మెందుకు? నాలుగు తరాలపాటు కూర్చుని తిన్నా తరగని ఆస్తి వుంది. గౌతమ్‌కి నచ్చిన అమ్మాయి వాడికి భార్య కావాలి! నాకు కాబోయే కోడలికోసం ఎన్ని నగలు చే యించానో చూస్తావా?" ఆవిడ నగలపెట్టెల ను తెరిచి పల్లవి ముందుపెట్టింది.

కెంపులు, పచ్చలు, రవ్వలు పొదిగిన ఆ ఆభరణాలని నిరాసక్తంగా చూస్తోంది పల్లవి.

"మంచి రోజు చూసి మీ వాళ్ళని రమ్మని ఉత్తరం వ్రాయి. పరీక్షలు కాగానే పెళ్ళి జరిగిపోతే బాగుంటుంది''

ఆవిడ ముఖంలోకి రెప్ప వాల్చకుండా చూస్తున్న పల్లవికి "గౌతమ్ పట్ల తన ప్రవ ర్తన ఏనాడైనా హద్దులు మీరిందా అనే అనుమానం వచ్చింది. లేకపోతే అతను తల్లితో తనని పెళ్ళి చేసుకోబోతున్న విషయా న్ని అంత ధీమాగా ఎలా చెప్పి వుంటాడు? అతనితో పెళ్ళికి తను అంగీకరించినట్టే, అన్నీ నిర్ణయమయినట్టే ఆవిడమాత్రం ఎలా మాట్లాడగలుగుతోంది?

లేదు. తనేనాడూ గౌతమ్‌తో హద్దుమీరి ప్రవర్తించలేదు. కనీసం అతను ఆశలు పెంచుకునేలా ప్రవర్తించలేదు. అతను తనప ట్ల ఆశలు అల్లుకుంటే అది తన తప్పుకాదు స్థిరంగా అనుకున్న పల్లవి మనసులో భారం దింపుకున్నట్టయింది

"మీరు కట్నకానుకలు వద్దంటున్నారు కనుక అందమైన, తెలివైన అమ్మాయి కోడలి గా రావాలనుకుంటున్నారు కనుక నేనొక మాట చెప్పనా ఆంటీ?"

"ఏమిటది, చెప్పు"

"మరి మీరేమీ అనుకోకూడదు."

పల్లవి చేతిని తన చేతిలోకి తీసుకుని మృదువుగా నొక్కుతూ అంది అమరేశ్వరి నవ్వుతూ.

"భలేపిల్లవి. ఇందులో అనుకోవడానికి ఏముంది చెప్పు"

"ఉమ అని నాకో స్నేహితురాలు వుంది. నాకంటే అందగత్తె. చాలా బుద్ధిమంతురా లు. పాపం! తండ్రి చిన్నతనంలోనే పోయా డు. తల్లే కష్టపడి దాన్ని పెంచి పెద్ద చేసింది. ఆర్థిక పరిస్థితి బాగా లేక దాని చదువు ఇంటర్మీడియెట్‌తో ఆగిపోయింది. ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ తల్లికి భారం తగ్గిస్తోంది. మీరు కోడలికి కావాలనుకున్న లక్షణాలన్నీ ఉమలో వున్నాయి. అత్తలా కాదు. మిమ్మల్ని అమ్మలా అభిమానించగలదు''

అమరేశ్వరి ఎంత షాక్‌కి లోనయిందంటే తన చేతిలో వున్న పల్లవి చేతిని వదిలేసి అప్రయత్నంగానే లేచి నిలబడింది.

గౌతమ్ మాటలు ఆవిడ చెవులలో గింగు రుమంటున్నాయి.

"అమ్మా! పల్లవి అంటే నాకు ప్రాణం! పల్లవి అంటే నాకు ఇష్టం! పెళ్లంటూ చేసు కుంటే పల్లవినే చేసుకుంటాను''





వివర్ణమైన ఆవిడ ముఖాన్ని చూస్తున్న పల్లవికి జాలి, నవ్వు సమపాళ్లలో కలిగాయి.

ఆవిడ ఆ షాక్‌లో వుండగానే గౌతమ్ లోపలికి వచ్చాడు. "అమ్మా! పైన నా గదిలో ఫోన్ డెడ్ అయింది. ఒకసారి నీ గదిలో ఫోన్ చేసుకుంటాను''

అతను ఫోన్‌కోసం తన గదిలోకి రావడం ఒక వంక అని ఆవిడకి తెలుసు. పరీక్షా ఫలితాలకోసం ఎదురుచూస్తున్న విద్యార్థిలా వుందతని ముఖం.

"ఇంక నేను వెళ్తాను ఆంటీ!" పల్లవికి అక్కడ వుండడం ఇబ్బందిగా వుంది.

"వెళ్దువుగానిలే. తొందరేం? పైన నా గదికూడా చూద్దువుగాని, గౌతమ్‌కి, ఆమెతో ఏకాంతంగా మాట్లాడాలని, ఆమె మనసేమిటో తెలుసుకోవాలని వుంది.

"గౌతమ్! పల్లవిని హాస్టల్‌లో దించిరా!" అంది అమరేశ్వరి.

తల్లి స్వరం మామూలుగా లేదు. ఏమై వుంటుంది? గౌతమ్‌కి అప్పటికప్పుడు తల్లిని అవతలికి పిల్చి అడిగెయ్యాలని వుంది.

"వస్తానాంటీ!" పల్లవి ఆవిడకి మర్యాదగా నమస్కరించింది.

గౌతమ్ కారు స్టార్ట్ చేస్తూ అడిగాడు. "ఇప్పుడు చెప్పు. మా అమ్మ నిన్ను ఇంటర్వ్యూ చేసిందా, లేక నువ్వే ఆవిడని ఇంటర్వ్యూ చేశావా? మా అమ్మ ముఖం చూస్తే నువ్వే ఆవిడని నీ ప్రశ్నలతో తికమక పెట్టినట్టనిపిస్తోంది నాకు''

పల్లవి మాట్లాడలేదు.

"అయినా కాబోయే అత్త..."

"స్టాప్''. పల్లవి స్వరంలోని సీరియస్‌నెస్‌కి అదిరిపడి కారాపాడు.

"నాకు బజారులో కొంచెం పని వుంది. అది చూసుకుని ఆటోలో వెళ్తాను. నువ్వు వెళ్లిపో' గభాల్న డోర్ తెరిచి దిగుతూ అంది.

"ఆటోలో వెళ్లడమెందుకు? నా కారులో వెళ్దాం"

"అవసరం లేదు. నేను వెళ్లగలను'' నిష్కర్షగా అనేసి అతని జవాబుకోసం ఆశించకుండా ముందుకి నడిచింది.

"మొండి!" పళ్ళు కొరుక్కున్నాడు గౌతమ్ తిరిగి కారు స్టార్ట్ చేస్తూ.

★ ★ ★

పల్లవి రూమ్‌లోకి అడుగుపెడుతూండగానే చదువుకుంటున్న నీరజ తలెత్తి చూసి అడిగింది.

"అప్పుడే వచ్చాశావేమిటి?"

"రాక, అక్కడే కాపురం వుంటాననుకున్నావా?" చిరాగ్గా అనబోయి 'కాపురం' అనే మాట తన నోట్లోంచి రాగానే పెళ్ళి విషయం తప్పక అడుగుతుందనే భయంతో ఆమె అడిగినదానికి జవాబివ్వకుండా "ఉత్తరం చదివావా?" అంది.

"చదివాను. ఉమ చిన్న సమస్యని భూతద్దంలోనుంచి చూస్తోందనిపించింది''

"చిన్న సమస్యా? తను తప్ప 'నా' అనే వాళ్ళెవరూలేని తన తల్లిని వృద్ధాప్యంలో ఎవరు ఆదరిస్తారని ఆలోచించడం తప్పా?"

"ఆలోచించడం తప్పుకాదు. కాని, అదేదో పెద్ద అంతర్జాతీయ సమస్య అయినట్టుగా పెళ్ళి చూపులలోనే అబ్బాయి తరపువాళ్ళ ముందు ఆ విషయాన్ని అంత నిష్కర్షగా చెప్పడం ఎందుకు? ఆ ముసలాయన చాదస్తంగా ఏదో అడిగాడే అనుకో తిరిగి ఆ ప్రశ్నే ఆయన్ని అడిగి తలబిరుసు పిల్లగా ముద్రపడడం ఎందుకు? పెళ్లయ్యాక మంచితనంతో భర్తని ఒప్పించి తల్లిని తెచ్చి తన దగ్గర వుంచుకోవచ్చుగా''

"పెళ్ళయ్యాక భర్త అంగీకరించకపోతే?"

"పెళ్ళికిముందు ఒప్పుకుని పెళ్ళయ్యాక ఒప్పుకోకపోతే?" ఎదురు ప్రశ్న వేసింది నీరజ. "ఇది ఆడపిల్లలున్న తల్లిదండ్రుల సమస్యేకాదు పల్లవీ! ప్రతీ తల్లీ, తండ్రీ

ఎదుర్కొంటున్నదే! మగపిల్లలు మహా ఉద్ధరిస్తున్నారేమిటి? వృద్ధాప్యంలో తల్లిదండ్రులకి గుప్పెడన్నం పెట్టడానికి మొహం చూసుకుని వృద్ధ శరణాలయాలలో వదిలి పెడుతున్న పుత్రరత్నాల గురించి వినడం లేదా, చదవడంలేదా?''

"ఒకటిమాత్రం నిజం నీరజా! ఉమా వాళ్ళ పేదరికాన్ని అలుసుగా తీసుకుని ఆ పెద్దమనిషి ఆ మాట అనగలిగాడు కానీ అదే ఉమా వాళ్ళు ఆస్తిపరులైతే ఉమని చేసుకోవడానికి పెళ్ళి కొడుకులు పోటీ పడేవాళ్ళే''

"నిజమే! డబ్బున్న తల్లిదండ్రులకి ఒక్కగానొక్క కూతురవడం పెద్ద అర్హత కదా మరి! నీ సంగతేమిటి? పెళ్ళిచూపులు అయ్యాయా? గౌతమ్ వాళ్ళమ్మగారేమంటారు?" గౌతమ్ ప్రస్తావనతో పల్లవి ముఖం రక్తం చిందినంత ఎర్రగా అయిపోయింది.

"గౌతమ్‌కి నాపై అలాంటి అభిప్రాయం వుందని నేను కలలో కూడా ఊహించలేదు నీరజా! ఊహించివుంటే అతని స్నేహానికి ఎప్పుడో గుడ్‌బై చెప్పేదాన్ని. అయినా, అతనంత ఫూలిష్‌గా బిహేవ్ చేస్తాడనుకోలేదు. నా అభిప్రాయమేమిటో తెలుసుకోకుండా వాళ్ళమ్మగారికి నన్ను చూపించి.... ఛ''

"ఏమిటీ!" నిటారుగా అయింది నీరజ. "గౌతమ్‌పై నీకు అలాంటి అభిప్రాయం లేదూ? మరి ఇన్నాళ్ళూ అతనికీ, నీకు మధ్య వున్నది..."

"కేవలం స్నేహం!" నొక్కి పలుకుతూ అంది. "కాని అతను ఆ స్నేహానికి ప్రేమ అని నిర్వచనం ఇచ్చుకుంటాడని, పెళ్ళిదాకా తీసుకెళ్తాడని కలలో కూడా అనుకోలేదు నేను''

నీరజ షాకింగ్‌గా అలాగే చూస్తూండిపోయింది.

"స్త్రీ పురుషులమధ్య స్నేహం చివరికి ఆకర్షణగానో, ప్రేమగానో మారుతుందని చెప్పే వాళ్ళతో వాళ్ళ అభిప్రాయం తప్పు అని ఖండించేదాన్ని... కానీ, నా విషయంలో అదే నిజమైంది''

"ఈమధ్య నీపట్ల గౌతమ్ ప్రవర్తనలో వచ్చినమార్పు అతను నీ ఎడల చూపిస్తున్న చనువు చూశాక అయినా నీకు అతను నిన్ను ప్రేమిస్తున్నాడేమో అనే అనుమానం రాలేదా?"

"వచ్చింది. కానీ, అతనిపట్ల నాకా అభిప్రాయం లేదు అని చెప్పేలోగా ఈ ఉపద్రవం ముంచుకొచ్చింది''

"గౌతమ్ నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పలేదా?"

"లేదు. అలా చెప్పినా మర్యాదగా తిరస్కరించి వుండేదాన్ని. వాళ్ళమ్మగారి చేత అడిగించాడు'' అంటూ పల్లవి అమరేశ్వరికి, తనకి మధ్య జరిగిన సంభాషణ అంతా చెప్పింది.

"ఏమిటీ!" నివ్వెరపోయింది నీరజ.

"ఆవిడ నిన్ను కోడలిగా చేసుకోవాలనే అభిలాషని వ్యక్తం చేస్తే అవుననో, కాదనో సమాధానం ఇవ్వకుండా ఉమని చేసుకోమని పెళ్లిపెద్దలా వ్యవహరించావా?"

"తప్పేం వుంది? ఆవిడ తెలివైన, అందమైన అమ్మాయి కోడలిగా కావాలనుకుంది. ఉమ నా కంటే అందమైనది. డబ్బు లేక చదువుకోలేకపోయిందిగానీ, లేకపోతే ఈపాటికి నాలాగ అది కూడా ఇంజనీరింగ్ చదువుతూండేది. కట్నకానుకల ఆశలేదని ఆవిడే స్పష్టంగా చెబుతోంది. అందుకే ఉమని కోడలిగా తెచ్చుకోమని చెప్పివచ్చాను. అంటే పరోక్షంగా గౌతమ్‌ని పెళ్లి చేసుకోనని చెప్పినట్టేకదా!"

"ఇంతకీ నీకు గౌతమ్‌ని చేసుకోవాలని లేదా, అసలు పెళ్ళే చేసుకోవాలని లేదా?"

"అప్పుడే పెళ్ళేమిటే! ముందు పరీక్షలు అవ్వాలి. తర్వాత ఇంకా చదవడమో, లేక ఉద్యోగం చెయ్యడమో ఏదో ఒకటి చెయ్యాలి. సరేగాని, నడు భోజనం చేసివ





ద్దాం" అంది లేస్తూ.



"పల్లవీ! నీకోసం గౌతమ్ వచ్చాడు'' నీరజ చెప్పింది.

పల్లవికి అతనికి ఎదురుగా వెళ్ళడానికి మొదటిసారిగా ఏదో సంకోచం కలిగింది. అంతలోనే తనకి తనే ధైర్యం చెప్పుకుంది.

'తనేం తప్పు చేసిందని పిరికిదానిలా ముఖం చాటేయడానికి? అతను తన ప్రవర్త నకి వేరే అర్థాలు చెప్పుకుంటే తనందుకు బాధ్యురాలు కాదు'

పల్లవి రాగానే అంతవరకు దూరంగా ఎటో చూస్తున్న గౌతమ్ ఆమెవైపు తిరిగాడు.

"మా అమ్మతో ఏమన్నావు?"

పల్లవి క్షణకాలం అతన్నే చూస్తుండిపో యింది. అతని కళ్లు ఎర్రగా నిద్రలేమిని సూచిస్తున్నాయి. అతని వాలకం చూస్తుంటే రాత్రంతా అతను నిద్రపోలేదేమో అనే అను మానం వచ్చిందామెకి.

"మా అమ్మతో నువ్వేమన్నావు?" రె ట్టించాడతను.

"ఉమని కోడలిగా చేసుకోమన్నాను'' తొణక్కుండా అంది.

"జోక్ చెయ్యడానికి సమయం సంద ర్భం ఏవీ లేవా? అయినా మా అమ్మతోనా వేళాకోళం? నేను మన పెళ్ళి విషయం అమ్మతో మాట్లాడగానే ఆవిడ ఎంత సంతో షించిందో తెలుసా? నిన్ను చూడాలని ఉవ్వి ళ్ళూరింది. అసలు నిన్ను చూడకుండానే మన పెళ్లికి అంగీకరించింది. కాని, నువ్వు మా అమ్మని కలుసుకున్న మొదటిసారే ఆవిడతో దారుణంగా జోక్ చేశావు. నిన్ను బజారులో దింపివెళ్ళాక అమ్మ నాతో ఏమందో తెలుసా? "పల్లవికి నిన్ను పెళ్లి చేసుకునే అభిప్రాయం లేదేమో. నువ్వసలు ఆ అమ్మాయి అభిప్రాయం కనుక్కునే ఇంత వరకు వచ్చావా?" అని. అసలు రాత్రే మీ హాస్టల్‌కి వచ్చి నిన్ను నిలదీద్దామనుకున్నా ను.''

"నన్ను నిలదియ్యడానికి నేనేం తప్పు చేశాను?"

"తప్పు చెయ్యలేదూ? నా పెళ్ళి నీతో నిశ్చయమయినట్టే అని సంతోషిస్తున్న మా అమ్మకి మనశ్శాంతి లేకుండా చేశావు. నాకు రాత్రంతా నిద్రలేకుండా చేశావు''

"గౌతమ్! ప్లీజ్..." అసహనంగా వుంది పల్లవి స్వరం. "మీ అమ్మగారితో నేను జోక్ చెయ్యలేదు. సీరియస్‌గానే ఆ మాట చెప్పా ను''

"పల్లవీ!" షాకింగ్‌గా ధ్వనించింది అతని స్వరం. "ఏమిటి... ఏమంటున్నావు ను వ్వు?"

"నిజం గౌతమ్! నీ ఎడల నాకెప్పుడూ అలాంటి అభిప్రాయం లేదు''

"మరి ఇన్నాళ్ళూ నువ్వు నాతో కలిసి తిరిగినదానికి అర్థం?"

"కాస్త నీ భాషని సంస్కరించుకో గౌతమ్! తిరగడం అనే పదం చాలా అసహ్యంగా వుంది. దయవుంచి ఆ పదాన్ని మరెక్కడా ప్రయోగించకు!"

"ఐయామ్ సారీ! ఇన్నాళ్లూ నీకు నాపై వున్న ఇష్టం. మనమధ్య వున్న..." మాటల కోసం వెతుక్కుంటున్నాడు.

"స్నేహం! నువ్వు మంచి స్నేహితుడివి! ఇప్పుడూ ఎప్పుడూ మంచి స్నేహితుడివే!"

గౌతమ్ ముఖం రంగులు మారింది.

"ఏం ఆడవాళ్ళు మీరు! మగవాళ్ళని మీ చుట్టూ తిప్పుకుని పిచ్చివాళ్ళని చేసి తీరా పెళ్లిప్రసక్తి తేగానే స్నేహాన్ని అడ్డుపెట్టుకుని నిర్దాక్షిణ్యంగా తరిమికొడతారు. స్నేహం అనే పదానికే కళంకం తెచ్చే నయవంచకులు మీరు! స్నేహానికో మగవాడు. తాళి కట్టించుకోడానికో మగవాడు. ఇలా ఎంతో మంది కావాలేం?"

అతను అన్న ఈ మాటలకి పల్లవికి రోషావేశాలతో ఒళ్లు తెలియని ఆగ్రహం కలిగింది. అతిప్రయత్నం మీద తనని తాను నిగ్రహించుకుంటూ అంది.

"నన్నింత దారుణంగా అవమానించినందుకు నీ చెంప పగలగొట్టవలసిందే! కాని మన మధ్య ఒకప్పుడున్న స్నేహం నన్నా పని చెయ్యకుండా ఆపుతోంది. థ్యాంక్ యూ వెరీమచ్! ఇప్పటికైనా నీ మనసులో నా ఎడల నీకు వున్న భావాన్ని తెలియచెప్పావు! గుడ్‌బై. గుడ్‌బై ఫరెవర్!"

పల్లవి అక్కడనుంచి వచ్చేసింది. ఆమెకి పరధ్యానంగా వున్నప్పుడు తననెవరో చాచి చెంపపై కొట్టినట్టుంది.

ఆ రాత్రి నీరజ అడిగింది. "ఏమంటున్నాడు గౌతమ్?"

"నాకు అతన్ని పెళ్లి చేసుకునే ఉద్దేశంలేదని తెలిసి చాలా తీవ్రంగా రియాక్టయ్యాడు"

"ఏమంటాడు?"

"ఏమైనా అంటాడు. అతని ఆస్తి అందం చూసి చచ్చినట్టు నేను పెళ్ళికి ఒప్పుకుని తీరతాననే అతని నమ్మకాన్ని నా తిరస్కారం చావుదెబ్బ తీసింది. పాపం! తట్టుకోలేకపోయాడు. తప్పు తను చేసినా, నన్ను దోషిగా నిలబెట్టాలని చూశాడు. నేను అతన్ని పిచ్చివాడిని చేసి నా చుట్టూ తిప్పుకున్నానుట. ఛీ...ఛీ! అతనంత నీచంగా మాట్లాడతాడని, అతనిలో అంత కుత్సితమైన ఆలోచనలు వుంటాయని నేనెప్పుడూ ఊహించలేదు"

నీరజ ఏం జవాబివ్వాలో తెలియక మౌనంగా చూస్తోంది.

"అతను నన్ను ఇష్టపడి వుండవచ్చు. పెళ్ళి చేసుకోవాలనుకోవచ్చు. కాని ఆ విషయంలో నా అభిప్రాయమేమిటో తెలుసుకోకుండా వాళ్ళమ్మగారితో నేను పెళ్లికి అంగీకరించినట్టే అని చెప్పడం తప్పు కదూ? ఆవిడ నేను కాబోయే కోడలిననే భావంతో అవసరమైన దానికంటే ఎక్కువ మర్యాదచేసి తను చేయించి వుంచిన ఆభరణాలని చూపించి ముహూర్తాల గురించి మాట్లాడింది. అతను నా గురించి ఏమనుకుంటున్నాడు? అతని ఆస్తి, హోదా, సిరిసంపదలను చూసి ఎగిరి గంతేసి అతన్ని పెళ్ళి చేసుకుంటాననుకున్నాడా?"

"గౌతమ్‌ని తిరస్కరించడంలో నువ్వు తప్పు చేశావేమో పల్లవీ! అతను మంచివాడు! పైగా నిన్ను ఇష్టపడినవాడు. జీవితంలో ఎప్పటికైనా పెళ్ళి చేసుకోవలసిందే. అలాంటప్పుడు గౌతమ్‌ని చేసుకుంటేనేం?"

"నా ధ్యేయం చదువు! అది పూర్తయ్యేవరకు పెళ్ళిమాట తలపెట్టను. అసలు మనం ఇంజనీరింగ్ కాలేజీలో అడుగుపెట్టినరోజు ఏమనుకున్నాం? చదువు తప్ప మరే విషయంమీదకి దృష్టి పోనివ్వకూడదనుకోలేదూ? పెళ్లి సంబంధం కోసమే అయితే అమ్మా నాన్నలని వదిలి ఇంత డబ్బు ఖర్చుపెట్టి ఇంతదూరం రావడమెందుకు?"

"నువ్వు పుస్తకాల పురుగువి. స్టూడెంట్ లైఫ్‌లోని థ్రిల్ నీకు చెప్పినా అర్థం కాదులే! మనని ఆరాధనగా చూసే అబ్బాయిలు, కొత్త ఫ్రెండ్స్, కొత్త పరిచయాలు... ఓహ్! అనుభ





విస్తేగాని తెలియదు''

"అవును. అనుభవిస్తేగాని తెలియదు. మనమేదో చదివి ఉద్ధరిస్తున్నామనుకుని వేల కివేలు ఖర్చు పెడుతున్న మన అమ్మానాన్న లు అప్పుల పాలయి అఘోరిస్తున్నప్పుడు కాని తెలియదు'' గొణుక్కుంది పల్లవి.

"పోవే! ఇంకెప్పుడు ఎంజాయ్ చేస్తాం! చిన్నప్పుడంతా అమ్మ చదువుకో చదువుకో అని ఇలాగే సతాయించేది. పెళ్ళయ్యాక మొగుడి అధికారంకింద మన స్వేచ్ఛకి సంకెళ్ళు తగిలించుకోవలసిందే'' నిర్ల క్ష్యంగా అంది నీరజ.

పల్లవికి నీరజ తల్లిని తలచుకుంటే జాలి అనిపించింది. తండ్రి చనిపోయినా వున్న భూమిని కాపాడుకుంటూ స్వంత సేద్యం చేయిస్తూ తనని చదివిస్తున్న తల్లి గురించి ఆరాధనా భావంతో చెప్పే నీరజ ఈ మధ్యకా లంలో అది ఆమె బాధ్యత అన్నట్టు మాట్లా డుతోంది.

★ ★ ★

కూలీలు ధాన్యం బస్తాలలోకి ఎత్తి సంచుల మూతులు కుడుతున్నారు. అన్నపూ ర్ణమ్మకి కాళ్ళు నెప్పులు పుడుతున్నాయి. పొద్దుటనగా ఆదరాబాదరగా కాస్త అన్నంతిని వచ్చిందేమో ఆకలికి పేగులు రొదపెడుతు న్నాయి. అన్నింటికంటే ఈ సంవత్సరం వ్యవసాయం గిట్టుబాటు కాలేదు అనేదే ఆమెను విపరీతంగా బాధిస్తోంది.

ఆ సంవత్సరం వర్షాలు సరిగ్గా పడక రైతులంతా నీరుగారిపోయారు. ఆ చుట్టుప క్కలంతా వర్షాధార భూములవడంవలన నీటిపారుదలకి చెరువులపై ఆధారపడవల సిందే. ప్రతి ఏడాదీ ఎకరానికి ముప్పై బస్తాలయ్యేది. ఈ సంవత్సరం ఇరవై బస్తా లవడం గగనమయిపోయింది. పెరుగుతు న్న జీవన వ్యయంతోబాటు పెరిగిన కూలిరే ట్లు, ఎరువుల బస్తాల ధరలు, తగ్గిపోయిన దిగుబడితో బేలన్స్ చేస్తే మిగిలినదేమీ కనప డడం లేదు.

"నువ్వింక ఇంటికి వెళ్ళిపో చెల్లెమ్మా! నేను బస్తాలు ట్రాక్టర్‌లో లోడ్ చేయిస్తాను'' అన్నాడు పరంధామయ్య గట్టు దాటివస్తూ. ఆయన పొలానికి, అన్నపూర్ణమ్మ పొలానికి మధ్య చిన్నకాలువ మాత్రమే అడ్డం. ఆ ఇద్దరివీ పక్కపక్క ఇళ్ళే. ఎలాంటి బంధు త్వం లేకపోయినా ఆయనకి అన్నపూర్ణ మ్మంటే అభిమానం.

"మీరింకా ఇంటికి వెళ్ళలేదా అన్న య్యా?" అడిగింది.

"ఇవాళ కాలేజీకి సెలవేకదా, కాస్త పొలా నికి వచ్చి నాకు సాయంగా వుండరా అని చెప్పినా మా హరి వినలేదు. మధ్యాహ్నా మంతా స్నేహితులతో బలాదూర్ తిరిగి ఇదుగో ఇప్పుడొచ్చాడు. వచ్చినవాడు కాస్త కాఫీ అయినా తేకుండా చేతులూపుకుంటూ వచ్చాడు. ఆ పెద్దవాడేమో వ్యవసాయం చెయ్యనంటూ ఉద్యోగం చేస్తున్నాడు. మధ్యన ఈ వ్యవసాయం నా చావుకొ చ్చింది'' ఆయన మాటలలో ధ్వనిస్తున్న బాధావేదనలు, వడలిన ముఖంలో అలసట, ఆకలి ఆవిడ మనసుని ద్రవింపచేశాయి.

"ఇద్దరం కలిసే వెళ్దాం అన్నయ్యా! అయి పోవచ్చిందిగా!"

"నువ్వదృష్టవంతురాలివమ్మా! చాలా మంది మగపిల్లలు లేరని బాధపడతారుకాని, మన నీరజలాంటి ఆడపిల్ల ఒకర్తె చాలదూ? కష్టం, సుఖం తెలిసిన పిల్ల. అసలు నన్నడిగి తే ఒక్క ఆడపిల్ల అయినా వుండాలమ్మా! ఆడపిల్లలకి కన్నవాళ్ళపట్ల అభిమానం వుంటుంది. మగపిల్లలకేముంది? ఎంత సేపూ మాకేమిటిచ్చావ్ అని అడగడమే''

నవ్వి వూరుకుందావిడ.

"ఈ ఏడాదితో నీరజ చదువు పూర్తవు తుంది కదా! పెళ్ళి చేసేస్తావా?"

"దాని చదువు పూర్తయి ఇంటికి వచ్చేదా కా ఏమీ ఆలోచించదలచుకోలేదు''

మాటలలోపడి ఆకలిని, అలసటని మరచి పోయారిద్దరూ.



ముందుగా పరంధామయ్య ట్రాక్టర్, ఆ వెనుకనే అన్నపూర్ణమ్మ కిరాయికి తీసుకున్న ట్రాక్టర్ నిండుగా వున్న ధాన్యం బస్తాలతో కదిలాయి.

ధాన్యం బస్తాలు కొట్లో వేస్తున్న కూలీల దగ్గర నిలబడిన అన్నపూర్ణమ్మతో అంది పరంధామయ్య భార్య వరలక్ష్మి.

"నేను చూస్తానుగా వదినా! ఇదిగో కాఫీ తాగేసి స్నానం చెయ్యండి. వంట ప్రయత్నం ఏమీ చెయ్యకండి. ఈ పూట మీ భోజనం మా ఇంట్లోనే''

"నీకెందుకమ్మా శ్రమ"

"మీరు పడుతున్న శ్రమముందు నా శ్రమ ఏపాటిది వదినా? పొద్దుటనగా నాలుగు మెతుకులు తిని పొలానికి వెళ్ళారు. మీకిద్దరికీ పంపుదామని ఫ్లాస్కులో కాఫీపోసి టిఫిన్ డబ్బాలో పెట్టాను. మా హరి వూరంతా బలాదూరు తిరిగి వచ్చి నేను పిలుస్తున్నా వినకుండా పెద్ద పని వున్నవాడిలా సైకిల్ మీద జోరుగా వెళ్ళిపోయాడు. ఏం పిల్లలో ఏమో! అసలు బాధ్యత లేదు?" విసుగ్గా అంది.

అన్నపూర్ణమ్మ నవ్వేసి అంది.

"ఇప్పుడు ఏమయింది? కాస్సేపాగి భోజనం చేస్తానుగా?"

స్నానానికి వెళ్తూ, అలాంటి నిర్మల హృదయులు, ఆపేక్షగల మనుషుల మధ్య తను వుండడం తన అదృష్టం అనుకుంది.

★ ★ ★

"మా ఉమకేదైనా సంబంధం చెబుదురూ?" అడిగింది పార్వతమ్మ. పంచాంగం చూస్తున్న పేరిశాస్త్రి నవ్వాడు.

"సంబంధానికేం? భేషైన సంబంధం రెడీగా వుంది. కట్నమేపాటి ఇస్తారేమిటి?"

కట్నం మాట వినగానే ఆవిడ ముఖం వెలవెలపోయింది.

"ఈ ప్రశ్న నేనడగడం లేదమ్మా! పిల్లని స్తామని వెళ్ళగానే మగపిల్లాడి తల్లిదండ్రులు అడిగే మొదటిప్రశ్న ఇదే''

"శాస్త్రిగారూ! మీకు నా పరిస్థితి తెలియనిదేమీకాదు. మగదిక్కు లేని సంసారం. అయినా వున్నంతలో పెళ్ళి బాగానే చేస్తాను. మగపెళ్ళి వారి మర్యాదకేమీ లోటు రానివ్వను. నా తాహతుకి తగిన ఎంత చిన్న ఉద్యోగం చేసే అబ్బాయి అయినా ఫర్వాలేదు. మా అమ్మాయి కూడా ఉద్యోగం చేస్తోంది. ఏదో నాలుగురాళ్ళు తెచ్చిపడేస్తుంది''

ఆ కోణంలో ఆవిడ ముఖంలోని దైన్యం, మాటలలోని అర్థింపుకి కరిగిపోయిన ఆయన "అలాగేనమ్మా చూస్తాను. ఉమ పెళ్ళి బాధ్యత నాది'' అన్నాడు.

పార్వతమ్మకి మాట ఇచ్చిన పేరిశాస్త్రి పదిహేను రోజులవరకు ఆవిడకి కనబడలేదు.

ఆరోజు ఆయన వస్తూనే చెప్పాడు.

"అమ్మా! పార్వతమ్మగారూ! అమ్మాయికి భేషైన సంబంధం తెచ్చాను. అబ్బాయి బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. తల్లిదండ్రులిద్దరూ లేరు. ఒక అక్క మాత్రం వుందతనికి. ఈ ఊళ్ళోనే ఉద్యోగం"

"బ్యాంక్ ఉద్యోగమా? మరి కట్నం..." ఆవిడ గుండె గొంతులోకి వచ్చినట్టయింది.

"అమ్మాయి నచ్చితే కట్నం పట్టింపు లేదన్నారు''

పార్వతమ్మ ముఖం వికసించింది.

"మీ రుణం తీర్చుకోలేను శాస్త్రిగారూ?" అంది.

"అమ్మాయికీ సంబంధం స్థిరపడనివ్వమ్మా! అది చాలు నాకు. ఎల్లుండి దశమీ శుక్రవారం. సాయంకాలం నాలుగు గంటలకి దివ్యంగా వుంది. వాళ్ళు ఆరోజు పెళ్ళిచూపులకి వస్తారు'' అని చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం ఉమ స్కూలునుంచి





వచ్చేప్పటికి పార్వతమ్మ గదుల బూజు దులపడంలో బిజీగా వుంది.

"ఏమిటమ్మా! మొన్న పండగకే కదా, బూజులు దులిపావు. మళ్లీ ఎందుకు?" తల్లి చేతులలో నుంచి చీపురు, బూజుల కర్ర లాక్కుంటూ అంది.

"ఎల్లుండి నిన్ను చూసుకోడానికి పెళ్ళివారు వస్తున్నారు"

ఉమ నిర్లిప్తంగా అంది, "అందుకనా రెక్కలు ముక్కలు చేసుకుని ఈ చాకిరీ అంతా చేశావు. అయినా పెళ్ళివారికి నచ్చవలసినది మన ఇల్లు కాదు నేనూ కాదు. మనం ఇచ్చే కట్నం"

"అతనికి అమ్మాయి నచ్చడం ముఖ్యం. కట్నకానుకల పట్టింపు లేదుట"

"ఎవరు చెప్పారు? పేరిశాస్త్రిగారా?"

"అవును"

"వాళ్ళకి మనస్థితిగతులు తెలుసా?"

"తెలుసు"

"నేను నీకొక్కర్తినే సంతానాన్ని అని, మనకి బంధువులనే వాళ్ళు ఎవరూ లేరని కూడా తెలుసా?"

"ఉమా!" అసహనంగా వుంది పార్వతమ్మ స్వరం.

"నువ్వు పెళ్ళి చూపులలో వాళ్ళడిగిన దానికి సమాధానం చెప్పు. అనవసరంగా మరోమాట మాట్లాడితే నాపై ఒట్టే"

తల్లి స్వరంలోని సీరియస్‌నెస్‌కి ఉమ మామూలుగా అయింది.

"అది కాదమ్మా! అన్నీ తెలిసీ నన్ను చూసుకోవడానికి ముందుకొస్తున్నాడంటే అతనెంత ఉదారహృదయుడని? పేరిశాస్త్రిగారు మనకి లక్షల ఆస్తి కలిసి రాబోతోందని అబద్ధం చెప్పలేదుకదా!"

"అతను వస్తున్నది పెళ్లిచూపులకి. పెళ్ళి నిశ్చయం చేసుకోవడానికి కాదు"

"ఆ విషయం నీకు తెలిసీ ఎందుకమ్మా ఆశలు పెంచుకుంటావ్? అనవసరం కదూ?"

"నువ్వు నా స్థానంలో నిలబడితే తప్ప నా బాధ నీకు అర్థంకాదు" పార్వతమ్మ అన్నం దింపి, చారు గిన్నె స్టవ్‌మీద పెడుతూ అంది.

"నువ్వు మాత్రం పెళ్ళిచూపులలో కాస్త మర్యాదగా ప్రవర్తించు. ఆ సుందర్రామయ్య గారికి చెప్పినట్టు..." మధ్యలోనే అడ్డు తగిలింది ఉమ.

"నిజం చెప్పమ్మా! ఆయన అలా అడిగితే నీకు కోపం రాలేదూ?"

"కోపం వస్తే మాత్రం ఏం చెయ్యగలం? పేదవానికోపం పెదవికి చేటన్నారు"

"ఏమీ చెయ్యలేమని నాకూ తెలుసమ్మా! కానీ, ఆయన సంస్కారహీనంగా అడిగిన ఆ ప్రశ్న మనని బాధించిందని ఆయనకీ తెలియాలి కదా! మరే ఆడపిల్ల గలవాళ్ళనీ ఆ ప్రశ్న వెయ్యకుండా జాగ్రత్త పడతాడు!"

పార్వతమ్మ కంచాలు పెడుతూ అంది. "ఆ సంబంధం చాలా మంచిది ఉమా! అబ్బాయికి బ్యాంక్‌లో ఉద్యోగం!"

"త్వరగా అన్నం పెట్టమ్మా! ఆకలేస్తోంది" సంభాషణ త్రుంచేస్తూ అంది ఉమ. కూతురు ఆ సంబంధం పట్ల పెద్దగా ఆసక్తి కనబరచకపోవడం ఆమెకి పెళ్ళిపట్ల నిరాసక్తత కాదని ఆవిడకి తెలుసు.

* * *

"ఏం చదువుకున్నావ్?"

వరుని అక్క రుక్మిణి ప్రశ్నతో తల ఎత్తిందామె. ఆమె సమాధానం చెప్పేలోగా పార్వతమ్మ చెప్పింది.

"ఇంటర్ చదివిందండీ!"

ఉమకి రుక్మిణిపై మొదటి చూపులోనే సదభిప్రాయం కలగలేదెందుకో. ఆమె ధోరణి చూస్తే తమ్ముడి బలవంతంపై అక్కడికి

వచ్చినట్టుంది. ఆ ముఖంలోని అయిష్టత, ముళ్లమీద కూర్చున్నట్టున్న ఆ తీరు చూస్తే తమ సంబంధం ఆవిడకి ఇష్టంలేదని అర్థమయింది. తల తిప్పుకోబోయిన ఆమెకి తననే చిరునవ్వుతో చూస్తున్న అతను కనిపించాడు. ఆమె గుండె ఝల్లుమనగా కలవరంగా తల దించేసుకుంది.

అతను పెద్ద అందగాడు కాడు. కానీ ఆకర్షణీయంగా వున్నాడు. ఎందరో అబ్బాయిలు తనని మాట్లాడించాలని ప్రయత్నించేవారు. వాళ్ళు తనవైపు చూసినప్పుడు తనపై వాళ్ళ కళ్ళలో వ్యక్తమయ్యే ఆరాధనని గమనించినా కలగని అలజడి తనలో ఇప్పుడెందుకు? అవ్యక్తమైన అనుభూతికి లోనయింది ఆమె మనసు.

అంతలోనే తనని తాను నిందించుకుంది. 'ఛ! ఏమిటిది పెళ్ళి చూపులకి వచ్చిన ఒక అపరిచితుడిని చూసి తన మనసిలా పరవశానికి లోనవుతోంది? ఈ సంబంధం తమకి అందనంత ఎత్తులో వుందని తెలిసే అమ్మ సంతృప్తికోసం పెళ్లి చూపులకి కూర్చుంది. అతనిపై ఆశలు పెంచుకోడం అనవసరం' అలా అనుకోగానే ఆమెకి అతనిపై ఇంట్రెస్ట్ పోయింది.

పెళ్ళివారు వెళ్ళాక చీర మార్చుకుని బయటికి వస్తున్న ఉమకి దేముడి పటంముందు కళ్ళు మూసుకుని, చేతులు జోడించి నిలబడి వున్న తల్లి కనిపించింది.

"అమ్మ పిచ్చిది. ఈ సంబంధం కుదరాలని అప్పుడే దేముడిని ప్రార్థిస్తోంది'' అనుకుని చిన్నగా నవ్వుకుంది.

★ ★ ★

'నాలుగు వేలు పంపవలెను. -నీరజ అని కూతురు రాసిన ఆ ఉత్తరాన్ని చదువుకుంటూ వుండిపోయింది అన్నపూర్ణమ్మ. టెలిగ్రామ్ లాంటి ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదివిందో ఆవిడకే తెలియదు. కూతురు దగ్గరనుంచి వచ్చే ఉత్తరంకోసం ఆతృతగా ఎదురుచూడడం ఆమె రాసిన ఆ రెండు ముక్కలు చదువుకుని 'అయ్యో! పిల్ల ఎలా వుందో? కనీసం యోగక్షేమాలైనా రాయదు' అని గిలగిలలాడడం గత కొన్ని నెలలుగా ఆవిడకి పరిపాటి అయిపోయింది. చదువుతో తల మునకలయ్యే పిల్లకి ఉత్తరం రాసే తీరుబడి ఎక్కడిది? అని మనసుని సమాధానపరుచుకోవడం అలవాటయిపోయింది. మొదట్లోలా కూతురు ఆవిడకి రాసే ఉత్తరాలలో ఆవిడని వదిలి వెళ్లాననే బాధ, ఆవిడకి దూరంగా వున్నాననే బెంగ వ్యక్తమయ్యేవి. కాలం గడిచేకొద్దీ ఆ ఉత్తరాలు కాలేజీ, కొత్తగా ఏర్పడిన పరిచయాలు, స్నేహితులు వీటితో నిండి వుండేవి. గత కొద్దికాలంగా ఆ ఉత్తరాలు పొడిగా, ముక్తసరిగా వుంటున్నాయి. అన్నపూర్ణమ్మ మొదట్లో బాధపడినా తరువాత సర్దుకునేది.

'ఇంజనీరింగ్ చదవడం అంటే మాటలు కాదు. అంత పెద్ద చదువు చదువుతూ తనకి పెద్ద పెద్ద ఉత్తరాలు రాయడానికి దానికి తీరుబడి ఎక్కడిది?' అనుకునేది.

కూతురి ఉత్తరం చదివి బ్యాంక్‌కి వెళ్ళి, డబ్బు విత్‌డ్రా చెయ్యాలని గుర్తువచ్చి గబగబ తయారవసాగింది.

వరలక్ష్మి కూరగిన్నె తెచ్చి వంటగదిలో గట్టుమీద పెడుతూ అంది.

"ఏమిటి వదినా, ఎక్కడికో బయలుదేరినట్టున్నారే?"

"బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు తేవాలి వదినా! నీరజ డబ్బు పంపమని ఉత్తరం రాసింది''

"నీరజ ఉత్తరం రాసిందా? సంక్రాంతికి వస్తోందా?"

"అదేమీ రాయలేదు. డబ్బు పంపమనే రాసింది''

"ఈ కాస్త పనికి నువ్వెందుకు? మీ అన్నయ్య బజారులో పని వుందంటున్నారు. వెళ్ళినప్పుడు బ్యాంక్‌కి వెళ్తారు''

అభిమానంతో కూడిన కృతజ్ఞతతో ఆమె





వైపు చూసింది అన్నపూర్ణమ్మ.

ఆ రాత్రి భోజనాలయ్యాక వరండాలో కూర్చుని లోకాభిరామాయణం మాట్లాడు కుంటున్నారు అన్నపూర్ణమ్మ, వరలక్ష్మి. పరంధామయ్య అక్కడికి వచ్చి కూర్చుంటూ అడిగాడు.

"ఈ ఏడాదితో నీరజ చదువు అయిపో తుంది. తరువాత ఏం చేద్దామని?"

"ఆడపిల్ల ఎంత చదివినా ఒక అయ్యచే తిలో పెట్టవలసిందే కదా అన్నయ్యా! చదువు పూర్తికాగానే తగిన సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యాలని వుంది. తరువాత చది వించుకుంటాడో, ఉద్యోగం చేయించుకుంటా డో దాని భర్త ఇష్టం. ఇది కేవలం నా అభిప్రాయం మాత్రమే. నీరజ ఏమంటుందో తెలియదు''

"నీరజ చిన్నపిల్ల. తనకేం తెలుసమ్మా? నువ్వు చెప్పిన మాటే వింటుంది. ఇంతకీ నీ దృష్టిలో నీరజకి తగిన సంబంధం ఏదైనా వుందా?"

"నాకా? నాకేం తెలుసన్నయ్యా! అంతవ రకు వస్తే దానికి తగిన వరుడిని వెదికే బాధ్యత కూడా మీదే! మగదిక్కులేని నాకు, తోబుట్టువు లెవరూ లేని నన్ను తోబుట్టువు కంటే ఎక్కువగా ఆదరిస్తున్నారు. మీ రుణం ఈ జన్మలోనే కాదు ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను'' ఆవిడ స్వరం గాద్గదికమ యింది.

"నువ్వు నా చెల్లెలికంటే ఎక్కువ దానివ నే చనువుతోనే మన మధ్య వున్న అనుబంధా న్ని దృష్టిలో వుంచుకునే నువ్వేమనుకోనంటే ఒకమాట చెబుతాను''

"ఏమిటన్నయ్యా అది?"

"నీరజని మా శేఖరానికి చేసుకుని మన కుటుంబాల మధ్య వున్న అనుబంధాన్ని మరింత పటిష్టం చేసుకోవాలని వుంది''

"నాకు అభ్యంతరం లేదన్నయ్యా? మీలాంటి అమృత హృదయుల మధ్య నా కూతురు సుఖపడుతుందనే నమ్మకం నాకు వుంది. కానీ నీరజ..."

"నాకు తెలుసమ్మా! ఇంజనీరింగ్ చది విన పిల్లని ఎమ్‌కామ్ ప్యాసయి, బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్న మా శేఖరానికిమ్మని అడ గడం అత్యాశే అవుతుంది''

"అబ్బెబ్బే! అది కాదన్నయ్యా! నా ఉద్దేశం... పెళ్ళి విషయంలో నీరజ అభి ప్రాయం తెలుసుకున్నాక కానీ, మీకు మాట ఇవ్వలేనని చెబుతున్నాను. శేఖరానికేం బంగారంలాంటి కుర్రాడు. బ్యాంక్‌లో ఉద్యోగం అంటే మాటలా?"

"నీరజ నీ మాట తీసి పారేస్తుందని నేననుకోను. ఇరుగుపొరుగువాళ్ళం. మా మంచిచెడ్డలు మీకు, మీ మంచిచెడ్డలు మాకు తెలుసు. ఎక్కడో, తెలియని సంబంధం చేసుకునే బదులు తెలిసిన సంబంధం చేసు కుని కూతురు లాంటి కోడలిని తెచ్చుకోవా లని మా ఆకాంక్ష. ఒక విషయం గుర్తుంచుకో చెల్లెమ్మా! ఒకవేళ నీరజ శేఖరాన్ని చేసుకోవ డానికి అంగీకరించకపోయినా మన అను బంధం మాత్రం ఎప్పటికీ చెదరదు''

అన్నపూర్ణమ్మ కళ్లల్లో నీళ్ళు నిండాయి. "ఎంతమంచి మనసన్నయ్యా మీది! నీరజకి ఈ విషయాన్ని రేపే ఉత్తరం రాస్తాను'' అంది.

ఆ రాత్రి పడుకున్నదన్నమాటే గానీ ఆవి డకి నిద్రపట్టలేదు. నీరజ పెళ్ళి విషయంలో తనకింత వరకు ఒక నిశ్చితాభిప్రాయం లేకపోయినా, ఇప్పుడు పరంధామయ్య తనంతట తానుగా నీరజని శేఖరానికి చేసుకో వడానికి ముందుకి రావడంతో "శేఖరానికి నీరజని ఇస్తేనేం?" అనే ఆలోచన అంకు రించి అది బలపడసాగింది.

ఇరవై ఎకరాల పొలం వున్న పరంధామ య్యకి ఇద్దరే కొడుకులు. ఆస్తిమాట అటుంచి పరంధామయ్య దంపతులకి తన ఎడల తగని ఆపేక్ష. శేఖరం బుద్ధిమంతుడు. 'అ త్తా' అంటూ చిన్నప్పుడంతా తనని ఒక్క

నిముషం కూడా వదలకుండా తిరిగేవాడు. వయస్సుతో బాటు ఆ అభిమానం పెరుగుతూ వచ్చింది. ఇంతకీ నీరజ ఏమంటుందో? ఆవిడ ఒక నిశ్చయానికి వచ్చి లేచి ఆరాత్రి వేళ కూతురుకి ఉత్తరం రాయడం మొదలుపెట్టింది.

★ ★ ★

తలుపు తీసిన పార్వతమ్మ ఎదురుగా నిలబడి వున్న పేరిశాస్త్రిని ఆహ్వానించడం మరచిపోయి గుండె వేగంగా కొట్టుకుంటూండగా అలాగే నిలబడిపోయింది.

"అమ్మా! నేను లోపలకి రావచ్చా?"

ఆవిడ పక్కకి తప్పుకుంటూ "రండి'' అంది కంగారుగా.

"చల్లటి వార్త మోసుకొచ్చాను పార్వతమ్మగారూ! మన ఉమ నచ్చిందని అబ్బాయి చెప్పాడు''

"కానీ కట్నం..."

"కట్నం అక్కర్లేదు అని మీకు ముందే చెప్పాను కదమ్మా!" పార్వతమ్మ ముఖంలో సంభ్రమానందాలు కదలాడి అంతలోనే ఏదో అనుమానం పొడచూపింది.

'ఈ రోజులలో కట్నం వద్దని, అమ్మాయే ముఖ్యమని చేసుకునే వాళ్ళున్నారా? ఇంతకీ అబ్బాయి ఆరోగ్యవంతుడేనా? అతనిలో ఏ లోపం లేదుకదా!' ఇలాంటి అనుమానాలు ఆమెలో భుజంగాల్లా బుసలు కొడుతున్నాయి.

"శాస్త్రిగారూ! ఉమ నాకు ఒక్కగానొక్క కూతురు. నా పంచప్రాణాలు దానిపైనే పెట్టుకుని బతుకుతున్నాను. ఉమ అందచందాలు చూసి ఏ కోటీశ్వరుడో దాని మెడలో వరమాల వేస్తాడనే దురాశ నాకు లేదు. కానీ నా కూతురు భర్తతో సుఖంగా కాపురం చేసుకోవాలనుకోవడం దురాశకాదు కదా!"

"మీ అనుమానం, భయం నాకు అర్థమయ్యాయమ్మా! ఏ అబ్బాయి అయినా కట్నం వద్దంటే అది అతని సంస్కారంగా కాక, అతనిలో ఏదైనా లోపం వుందేమో లేకపోతే కట్నం ఎందుకు వద్దంటాడని ఆలోచించే స్థితిలో వున్నాం మనం. తప్పు మనది కాదు. ఈ వ్యవస్థది. కానీ, అబ్బాయి విషయంలో మీరలాంటి అనుమానాలేవీ పెట్టుకోనవసరం లేదు. అతను పరిపూర్ణ ఆరోగ్యవంతుడు. కేవలం ఉమ అందచందాలకి ఆకర్షింపబడే అతను కట్న కానుకలని ఆశించకుండా మన సంబంధంపట్ల సుముఖంగా వున్నాడు''

"కానీ..."

"అమ్మా! పార్వతమ్మగారూ! నాకు మా అమ్మాయివేరు ఉమ వేరు కాదు. మీకు అబ్బాయి విషయంలో ఇంకా ఏవైనా సందేహాలుంటే ఈ సంబంధం విరమించుకోండి. లేదూ, మీరు సుముఖంగా వుంటే, వచ్చే శుక్రవారం తాంబూలాలు తీసుకోవడానికి మంచి ముహూర్తం వుంది. మరి నేను వస్తాను'' ఆయన లేచి నిలబడ్డాడు.

"మీరంతగా చెబుతున్నాక కూడా ఈ సంబంధాన్ని కాదనుకోవడం నా మూర్ఖత్వమే! ఉమని కూడా ఒక మాట అడిగి నేను రేపు మీ ఇంటికి వచ్చి మాట్లాడతాను''

"శుభం" ఆయన వెళ్లిపోయాడు.

పార్వతమ్మ మనసంతా కంగారుగా ఉంది. ఏదో తెలియని ఉద్విగ్నత! ఉమ పెళ్ళి ఇంత సులువుగా నిశ్చయమవుతుందని, తన తాహతుకి మించిన మంచి సంబంధం ఆమెని వెతుక్కుంటూ వస్తుందని కలలోకూడా అనుకోలేదు. అప్పటికప్పుడు స్కూలుకి వెళ్ళి ఉమతో చెప్పెయ్యాలన్నంత ఉద్విగ్నతని అణచుకుంటూ ఆవిడ పరధ్యాసగానే ఇంటిపనులు చేసుకోసాగింది.

సాయంకాలం ఇంటికి వచ్చిన ఉమ ఆత్రుతగా తనకోసం ఎదురుచూస్తున్న తల్లిని ఆవిడ ముఖంలో చిందులు వేస్తున్న ఆనందాన్ని విచిత్రంగా చూస్తూ లోపలికి అడుగుపెట్టింది.

పార్వతమ్మ కూతురి చెంపలు పట్టి నుది




టిపై ముద్దు పెట్టుకుంటూ అంది.

"నువ్వు అదృష్టవంతురాలివమ్మా! మొన్న నిన్ను చూసిన అబ్బాయి నువ్వు నచ్చావని కబురు పంపాడు''

ఉమ మామూలుగా అంది. "నిజమా? కట్నం లక్షా, రెండు లక్షలా?"

"కట్నం వద్దటమ్మా''

"వద్దా పోనీ లాంఛనాలు? స్కూటర్, కలర్ టి.వి., ఫ్రిజ్..."

"మన పరిస్థితి పేరిశాస్త్రిగారి ద్వారా వినే అతను నిన్ను చేసుకోవడానికి సంసిద్ధతను వ్యక్తం చేశాడు''

"కానీ, ఏమీ లేని మనతో సంబంధం కలుపుకోవాలని అతనెందుకు ఆశపడుతున్నట్టు?"

"అతనికి నువ్వు బాగా నచ్చావుట"

ఉమ ముఖంలో క్షణంలో సగంసేపు రకరకాల భావాలు కదలాడి చిరుసిగ్గు అలుముకుంది. పెళ్ళిచూపులలో తనవైపు చిరునవ్వుతో చూస్తున్న అతను గుర్తువచ్చి ఆమె ఒళ్లంతా చక్కిలిగింతలు పెట్టినట్లయింది. ఆమె కన్నెమనసులో అతను మొదటిసారిగా అలజడి కలిగించాడు. తను చాలామందినే ఆకర్షించి వుండవచ్చు. కానీ, తనని మెచ్చి తనతో జీవితం పంచుకుంటానంటున్న అతను... ఆమె మనసు తీయని ఊహలతో పులకరించింది.

"నీకు ఇష్టమైతే ఎల్లుండి శుక్రవారంనాడు తాంబూలాలు పుచ్చుకుందామన్నారు శాస్త్రిగారు''

'నాకు ఇష్టమే' అని ఉమ చెప్పలేదు కానీ ఆమె ముఖంలోని సిగ్గు దొంతరలు చెప్పాయి.

ఆ రాత్రి ఉమే కాదు పార్వతమ్మ కూడా నిద్రపోలేదు.

'అబ్బాయి కట్నం వద్దన్నా పెళ్ళి ఖర్చు ఎంత లేదన్నా ఇరవైవేలు పైచిలుకే అవుతుంది. ఉమకి పది చీరలయినా కొనాలి. ఎలా?' ఆలోచనలతో ఆవిడ గుండె బరువెక్కింది. ఆవిడ మంచినీళ్ళకోసం లేచినదల్లా మంచంమీద కూర్చుని వున్న ఉమని చూసి అడిగింది.

"నువ్వింకా నిద్రపోలేదా?"

"నిద్ర పట్లేదమ్మా!"

మంచినీళ్ళు తాగి వచ్చి కూతురిపక్కనే కూర్చుంది.

"అమ్మా!" ఉమ పిలిచింది. "నేను పెళ్ళి చేసుకుని వెళ్లిపోతే నువ్వొక్కర్తివే ఎలా వుంటావమ్మా?" ఆమె స్వరంలో దుఃఖం గరగరలాడుతోంది.

పార్వతమ్మకి ఇన్నాళ్ళూ కూతురిపెళ్ళి నిశ్చయమవలేదనే బాధ వుండేది. ఇప్పుడు ఆమెకి పెళ్ళయి అత్తవారింటికి వెళ్తుందంటే మరో బాధ మొదలయింది. ఉమని మరో ఇంటికి పంపాలనే ఊహే భయంకరంగా, బాధాకరంగా వుంది. కానీ, ఈ పెళ్ళి ఎలా చెయ్యగలనా అనే ఆందోళన ఆ బాధని డామినేట్ చేసింది.

"ఆడపిల్ల పెళ్ళి చేసి అత్తవారింటికి పంపాక ప్రతి తల్లీ ఏం చేస్తుందో నేనూ అదే చేస్తాను'' అంది నవ్వుతూ.

"ప్రతి తల్లి విషయం వేరు. నువ్వు వేరు. నువ్వు, నేను ఇద్దరం సంపాదిస్తున్నాం. కనుక మనకి బాగానే గడిచిపోతోంది. నేను పెళ్ళి చేసుకుని వెళ్లిపోతే నువ్వు సంపాదించేది నీకు సరిపోతుందా?"

"ఎందుకు సరిపోదు. అంతగా సరిపోకపోతే మరో నాలుగిళ్లలో పాఠాలు చెబుతాను''

"ఎన్నాళ్ళు చెప్పగలవ్?"

"చెప్పినన్నాళ్ళే!"

"తర్వాత?"

దానికి జవాబు ఆవిడ దగ్గరలేదు. అందుకనే మౌనం వహించింది.

"తర్వాతేం చేస్తావమ్మా? నా భర్త నిన్ను ఆదరించగలిగే సహృదయుడైతే ఫర్వాలేదు.

లేకపోతే?"

"పరిస్థితి అంతవరకూ వచ్చాక చూద్దాం?"

"అంతవరకు వచ్చాక ఏమీ చెయ్యలేం! నువ్వు నిరాధారంగా మిగిలిపోతావు. అందుకే ఒకసారి అతన్ని కలుసుకుని మాట్లాడతాను. అతను నిన్ను ఆదరించడానికి అంగీకరిస్తేనే పెళ్ళిచేసుకుంటాను. లేకపోతే నేనసలు పెళ్ళేచేసుకోను."

"ఉమా!" పార్వతమ్మ అరిచింది. "నీకేమైనా మతిపోయిందా? నువ్వసలు ఒంటిమీద స్పృహవుండే మాట్లాడుతున్నావా? మనం వున్న పరిస్థితులలో నీకు పెళ్ళి అవడమే గొప్ప. అలాంటిది అతను కానీ కట్నం ఆశించకుండా నిన్ను చేసుకోడానికి ముందుకి వస్తే నా బాధ్యత అతను వహిస్తేనే పెళ్ళి చేసుకుంటానని షరతు పెడతావా? అతను అంగీకరించకపోతే పెళ్ళే మానుకుంటావా? నాకోసం పెళ్ళి మానేస్తావా? నీకోసం నేను ఎల్లకాలము బతికి వుంటాననుకున్నావా? నాకోసం నువ్వు పెళ్ళి మానేస్తే నీ సంపాదన కోసం ఆశపడి నీ పెళ్ళి చెయ్యడం లేదని నలుగురూ నా ముఖాన ఉమ్మివేస్తారు''

"కాని నువ్వు ఒంటరిగా గడపడం కష్టం! ఈ వయసులో నీకు నా అనేవాళ్ళ అండ అవసరం. ఆర్థికంగా మానసికంగా నువ్వు దెబ్బతింటావు. అది నేను భరించలేను'' ఉమ చెంపలమీదనుంచి కన్నీళ్ళు జారిపోతున్నాయి.

"డబ్బుదేం వుంది? కొంత మనం దాచిన డబ్బు వుంది. నేను సంగీతం చెప్పే ఇళ్ళలో కొంత అప్పుగా తెస్తాను. నా గురించి నాకు బాధ లేదమ్మా! ఓపిక వున్నన్నాళ్ళూ కష్టపడతాను. తరువాత ఆ భగవంతుడే దారిచూపిస్తాడు'' అందావిడ కూతుర్ని ఓదారుస్తూ.



"చి॥సౌ॥ నీరజకి

మీ అమ్మ దీవించి రాయునది, నీ దగ్గర నుంచి ఈమధ్యకాలంలో ఉత్తరాలు లేవు. నేను పంపిన డబ్బు అందినదని తలుస్తాను. బహుశా చదువు వత్తిడివలన నాకు ఉత్తరం రాయలేకపోయివుంటావు.

నీ చదువు పూర్తికాగానే నీకు పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను. నా దృష్టిలో ఒక మంచి సంబంధం వుంది. ఆ సంబంధం కొత్తది, నీకు తెలియనిది కాదు. పరంధామయ్య మామయ్యగారబ్బాయి శేఖరం నీకు అన్నివిధాల తగినవాడని నా అభిప్రాయం. మామయ్య తనంతటతానుగా నిన్ను కోడలిగా చేసుకుంటానని అడిగారు. మామయ్యగారు మనకిద్దరికీ చేసిన సహాయం మరచిపోదగినది కాదు. నిన్ను ఆ ఇంటి కోడలిగా చెయ్యడంవలన మన రెండు కుటుంబాలు మరింత దగ్గరవుతాయి. శేఖరం కూడా మంచివాడు. ఆలోచించు. నీ అభిప్రాయాన్ని నాకు తెలుపుతావని ఆశిస్తున్నాను. డబ్బేమయినా కావాలంటే రాయి. ఇబ్బందిపడకు.

ఇట్లు
మీ అమ్మ"

ఉత్తరం చదివి పెదవి నములుతూ వుండి పోయింది నీరజ. అనూహ్యంగా తల్లినుంచి తన పెళ్ళిప్రస్తావన రావడంతో ఆమెకి మతి పోయినట్టుంది. పైగా పరంధామయ్య మామయ్య తనని కోడలిగా చేసుకుంటాననడం కలలోనైనా ఊహించనిది.

''ఛ ఈ పెద్దవాళ్ళకసలు బుద్ధిలేదు. మేనత్త మేనమామ పిల్లలనే కాకుండా ఇరుగుపొరుగు వాళ్ళతో కూడా బంధుత్వాలు కలిపి పెళ్ళిదాకా తీసుకెళ్తారు'' పళ్ళు కొరుకుతూ అప్రయత్నంగా పైకే అంది.

జుట్టు దువ్వుకుంటున్న పల్లవి చటుక్కున తిరిగి చూసి నవ్వింది.

"ఏమిటి నీరజా! ఎవరు రాశారా ఉత్తరం"

"ఇంకెవరు? మా అమ్మ. ఆవిడకి వయసు పెరుగుతోన్నకొద్దీ మతిపోతోంది. నా పరీక్షలు కాలేదు. భవిష్యత్తులో ఏం చెయ్యాలో ఆలోచించుకోలేదు. ఇప్పుడు వున్నట్టుండి పెళ్ళి ప్రస్తావన ఏమిటి?"

"సంబంధం చూశారా?"

"ఆc! ఏదోలే! మా పక్కింటి వాళ్ళబ్బాయిని చేసుకోమంటుంది. ఛీ! ఛీ! మా అమ్మకసలు బుద్ధిలేదు''

నీరజ తల్లిని గురించి అలా పరుషంగా మాట్లాడడం పల్లవికి బాధ అనిపించింది.

"నీకిష్టంలేకపోతే నీకప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదని మీ అమ్మగారికి ఉత్తరం రాయి''

"రాయను... రాసినా మా అమ్మ అర్థంచేసుకోలేదు''

"మరేం చేస్తావు?"

"పరీక్షలవగానే ఊరికి వెళ్తానుగా! అప్పుడు చెబుతాను''

"ఇంతకీ నీకు అయిష్టత పెళ్ళిమీదా లేక మీ అమ్మగారు చూసిన సంబంధం మీదా?"

"పెళ్ళిమీదే'' నీరజ ముఖం తిప్పుకుంది.

పల్లవి త్వరగా ముఖం కడుక్కొని వచ్చి చదువులో నిమగ్నమయింది. సాయంకాలం అయిదు గంటలకే చదువు ఆపి తీరుబడిగా డ్రెస్సప్పవుతున్న నీరజని చూసి అడిగింది.

"ఎక్కడికోయ్, సినిమాకా?"

"ఆc! అవును'' ఆమె మరో ప్రశ్న అడగడానికి ఆస్కారమివ్వకుండా బ్యాగ్ తీసుకుని త్వరగా బయటపడింది. నీరజ అబద్ధం చెబుతోందని పల్లవికి తెలుసు. ఆమెని నిలదీసే చనువు కూడా వుంది. కాని ఆమె ఎందుకనో అలా చెయ్యలేకపోయింది.

నీరజలోని పరధ్యాస, ఆమెలో రెట్టించిన ఉత్సాహం చూస్తే ఆమె ప్రేమలో పడిందేమో అనే అనుమానం వచ్చింది పల్లవికి. నాలుగు రోజుల తర్వాత ఆ అనుమానం నిజమయింది. నీరజ ప్రేమిస్తున్న ఆ వ్యక్తి గౌతమ్!

పల్లవికి సంభ్రమంతో నోట మాటరానట్టు అయింది. ఒకప్పుడు తన చుట్టూ తిరిగి తనని పెళ్ళిదాకా తీసుకెళ్ళిన గౌతమ్ ఇప్పుడు నీరజని తన చుట్టూ తిప్పుకుంటున్నాడు. అతను తనపై ఆశలు పెంచుకున్న విషయం నీరజకి తెలుసు. అతను తనచేత తిరస్కరింపబడ్డాడనీ తెలుసు. తన ప్రాణస్నేహితురాలయిన నీరజనుంచి తనకి రహస్యాలేవీ లేవని తను గౌతమ్ విషయమంతా ఆమెకి చెబుతుందని అతనికి తెలుసు.

అతనికి తనపై వున్న భావం ప్రేమ కాని ఆకర్షణ కాని మరేదయినా కాని తనకోసం తపించిపోయి తనచుట్టూ తిరిగిన అతన్ని నీరజ ఎలా ప్రేమించగల్గుతోంది. పల్లవికి ఇదేదో అర్థంకాని పజిల్‌లా అనిపించింది.

★ ★ ★

"ఉమ పెళ్ళి నిశ్చయమయింది అరుంధతిగారూ!" సంతోషంతో దీప్తివంతమైన ముఖంతో సంబరంగా చెబుతున్న పార్వతమ్మ వైపు సంభ్రమంగా చూసింది అరుంధతి.

"ఏ వూరు? అబ్బాయి ఏం చేస్తున్నాడు?"

"ఈ వూరే! బ్యాంక్‌లో ఉద్యోగం"

"చాలా సంతోషంగా వుంది పార్వతమ్మ గారూ ఉమతోబాటు మీరూ అదృష్టవంతులే! మంచి ఉద్యోగంలో వున్న అబ్బాయి దొరికాడు!" మనస్ఫూర్తిగా అభినందించింది.

ఉమని అతను కట్నం ఆశించకుండా చేసుకోడానికి ముందుకి వచ్చాడని విని మరింత ఆనందాన్ని ప్రకటించింది.

"అతను కట్నం వద్దన్నాడు కదా అని పెళ్ళి అయిందనిపిస్తే మర్యాదగా వుండదు కదమ్మా! వున్నంతలో బాగానే చేద్దామనుకుంటున్నాను. ఆపై భగవంతుడి దయ"

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి పార్వతమ్మగారూ! ఉమ పెళ్ళి కోసం డబ్బేమైనా దాచారా?"

"అప్పుడప్పుడూ దాచిన డబ్బు అయిదారువేలదాకా వుంటుంది''

"పెళ్ళి ఖర్చుకి అదేం సరిపోతుందండీ! అసలే ధరలు మండిపోతున్న ఈ రోజులలో పెళ్ళివారికి రెండు పూటలు భోజనం పెట్టడానికే బోలెడు ఖర్చవుతుంది''

"ఏం చేస్తానమ్మా! మగదిక్కులేని సంసారం! నేను సంగీతం చెప్పే పది ఇళ్ళల్లో తలొక వెయ్యి రూపాయలు ఎడ్వాన్సుగా అడుగుదామనుకుంటున్నాను. మీరు కూడా ఆయనతో చెప్పి నాకో వెయ్యి రూపాయలు అప్పుగా ఇప్పించి ఈ పెళ్ళి ఎలాగోలా గట్టెక్కించండమ్మా! తరువాత ప్రతినెలా నాకిచ్చే జీతంలో మినహాయించుకుందురు గాని''

"చెబుతాను'' అంది అరుంధతి ఆవిడకి తనెలా సాయపడగలనా అని ఆలోచిస్తూ.

తరువాత ఆవిడ భర్తతో ఉమ పెళ్ళి నిశ్చయమైన సంగతి, పార్వతమ్మగారు డబ్బు అప్పు అడిగిన సంగతి చెప్పి "పాపం! పేదవాళ్ళు! మగదిక్కు లేకపోయి నా ఇన్నాళ్ళూ సంసారం ఎలాగో ఈడ్చుకొచ్చింది. ఈ పెళ్ళి కూడా ఎలాగో చేసేస్తే ఆవిడ బాధ్యత తీరిపోయినట్టే'' అంది.

"నేనూ అదే చెబుదామనుకుంటున్నాను అరుంధతీ! పాపం! ఆవిడకీ వేరే ఆధారంలేదు. మనం ఒక పదివేలు పెళ్ళి ఖర్చుగా పెట్టుకుందాం. మనకి మాత్రం ఏ పదిమంది పిల్లలున్నారని? పల్లవి ఒకర్తేగా?" అన్నాడు మురళీధరరావు.

"నేనావిడకి ఎలా సాయంచెయ్యగలనా అని తెగ మథనపడిపోతున్నాను. ఆ మార్గం మీరే చూపించారు'' అంది అరుంధతి తృప్తిగా.

★ ★ ★

"డియర్ పల్లవీ,

ఇంత త్వరలో నీకు నా పెళ్ళి వార్త వినిపిస్తాననుకోలేదు. అసలు నా పెళ్ళి ఇంత త్వరగా నిశ్చయమవుతుందని మా అమ్మే అనుకోలేదు. వరుడి పేరు భాస్కర్. ఈ వూళ్ళోనే బ్యాంక్‌లో ఉద్యోగం. అన్నింటినీ మించి అతను కట్నం ఆశించకుండా నన్ను పెళ్ళిచేసుకుంటున్నాడు. అందరూ నన్ను అదృష్టవంతురాలినంటున్నారు. అదృష్టమో, దురదృష్టమో కాలమే నిర్ణయించాలి. నాకేమిటో కంగారుగా, అయోమయంగా వుంది. నేను పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే మా అమ్మ ఎలా బతుకుతుందా అనే బెంగ ఒకవైపు, ఆవిడకి తీరని సమస్య అనుకున్న నా పెళ్ళి ఇంత సులువుగా నిశ్చయమైన ఆనందం మరోవైపు- నా మనసు ఆనంద విషాదాల సమ్మిళితంగా వుంది. నీ పరీక్షలు దగ్గరపడ్డాయి కాబట్టి నువ్వు నా పెళ్ళికి రాలేవని నాకు తెలుసు. కాని నా ప్రాణస్నేహితురాలివైన నువ్వు నా పక్కన వున్నట్టే ఊహించుకుంటాను. పరీక్షలవగానే వచ్చేస్తావుగా?

ప్రేమతో

ఉమ."

కవరులో ఉత్తరంతోబాటు వున్న శుభలేఖని చాలాసేపు చూస్తుండిపోయింది పల్లవి. ఆమెకెందుకో కన్నీళ్ళు వచ్చాయి.

'ఉమ ఎంత మంచి అమ్మాయి?





అలాంటి మంచి మనసున్న ఆమె జీవితం ఎలా సాగుతుందో? ఆమె జీవితం సుఖంగా సాగిపోవాలి!' మనస్ఫూర్తిగా ప్రార్థించింది.

తన సంతోషాన్ని నీరజతో పంచుకుంటూ "ఉమ పెళ్ళి! ఇప్పుడే వెడ్డింగ్ కార్డ్ వచ్చింది'' అంది శుభలేఖని అందిస్తూ.

"నిజమా?" నీరజ సంభ్రమంగా అందుకుని చూసింది.

"మొత్తానికి ఉమ లక్కీఫెలోనే!" వరుడి పేరు పక్కన వున్న డిగ్రీ, అతని ఉద్యోగం చూస్తూ అంది. "ఇంతకీ అతను వాళ్ళమ్మగారిని ఆదరిస్తాడనే నమ్మకంతోనే పెళ్ళికి అంగీకరించిందా?"

"అదేమీ రాయలేదు. కాని అతను మంచి వాడిలాగే అనిపిస్తున్నాడు. కట్నం వద్దన్నాడట!"

"ఓ!" నీరజ నవ్వింది... "అడిగినా వీళ్ళు ఏమీ ఇవ్వలేరులే! అసలు తను వున్న పరిస్థితులలో పెళ్ళి కావడమే గొప్ప. అందుకే ముందంతా మా అమ్మని ఆదరించిన మనిషినే పెళ్లిచేసుకుంటాను అని పట్టుదల పట్టిన మనిషి సైలెంట్‌గా పెళ్ళికి సిద్ధమయింది!"

నీరజ ఉమ గురించి అలా మాట్లాడ్డం పల్లవికి నచ్చలేదు. ఆమెతో వాదించాలని లేదు. అందుకే మౌనంగా తన టేబిల్ దగ్గరకి వచ్చి ఉమకి ఉత్తరం రాయడం మొదలుపెట్టింది.

"డియర్ ఉమా,

నీ ఉత్తరం, శుభలేఖ ఇప్పుడే అందాయి. చాలా సంతోషించాను. నిన్ను మెచ్చి నిన్ను వరించిన ఆ హీరోని ఇప్పుడే చూసెయ్యాలని వుంది. కాని పరీక్షలు దగ్గరపడ్డాయి కాబట్టి రాలేకపోతున్నాను. నేను ఇక్కడే వున్నా నా మనసు నీ దగ్గరే వుంటుంది. భాస్కర్ నిజంగా హీరోనే! నీలాంటి మంచి మనసువున్న అమ్మాయికి మంచి భర్తే దొరుకుతాడు. నీ జీవితం సుఖంగా సాగిపోతుంది. నాకా నమ్మకం వుంది.

మీ అమ్మగార్కి నా నమస్కారములు అందచేయి. నీ వైవాహికజీవితం సుఖంగా సాగిపోవాలని కోరుకుంటూ.

ప్రేమతో నీ పల్లవి"

★ ★ ★

ఆకాశమంత పందిరి, భూదేవి అంత అరుగు వెయ్యకపోయినా, వున్నంతలో కూతురి పెళ్ళి బాగానే జరిపించింది పార్వతమ్మ. అరుంధతి, మురళీధరరావు దంపతులు తామే పెళ్ళి పెద్దలై పెళ్ళివారికి మర్యాద లోపం జరగకుండా పూనుకున్నారు.

మెడలో కొత్తగా వచ్చి చేరిన మంగళ సూత్రాలు! తన చిటికెనవ్రేలు పట్టుకుని తన వైపు ఆరాధనగా మురిపెంగా చూస్తున్న భర్త! ఉమ మనశ్శరీరాలు ఏదో తెలియని ఉద్విగ్నతతో నిండిపోయాయి.

పెళ్ళితంతు ముగిసి భోజనాలవగానే వరుడు భాస్కర్ అక్కగారు రుక్మిణి వచ్చి పార్వతమ్మతో చెప్పింది.

"ఇవాళ అమ్మాయిని మా ఇంటికి తీసుకెళ్తాం"

"ఇవాళేనా?" ఆవిడ ఆమె అలా అనగానే తొట్రుపడింది.

"రేపు మా ఇంట్లో మా తమ్ముడిచేత, మరదలిచేత సత్యన్నారాయణ వ్రతం చేయిస్తాం" చాలా ముభావంగా మాట్లాడుతోందామె.

ఆవిడని ఆమె ముభావంకంటే కొన్ని గంటలక్రిందట పెళ్ళయిన కూతురు పరాయివాళ్ళ సొత్తు అవుతోందనే భావమే ఎక్కువ బాధ పెట్టింది. ఆ బాధని దిగమింగుకుని అడిగింది.

"మరి మీరందరూ మా ఇంటికి ఎప్పుడు వస్తారమ్మా, అక్కడ మూడు నిద్రలు అయ్యాక, మా ఇంట్లో కూడా మూడు నిద్రలు చెయ్యాలి కదా!"

"చూద్దాం! మా తమ్ముడేమంటాడో! మళ్ళీ వర్జ్యం వస్తుంది. అమ్మాయి బట్టలవీ

సర్దండి'' అని విడిదికేసి అడుగులు కదిపింది రుక్మిణి.

తమ్ముడి ఇష్టం మాట అటుంచి తమ ఇంటికి రావడం ఆమెకే ఇష్టంలేదని స్పష్టమయింది పార్వతమ్మకి. ఆమె గుండెని చీల్చుకుని వచ్చింది విషాదకరమైన నిట్టూర్పు.

కూతురి పాదాలకి సుశీలమ్మచేత పసుపు రాయించి కొత్త చీరలో కట్టిన వడిగంటి బియ్యం మూట పెట్టించింది. వంగి నమస్కరిస్తున్న ఉమ కన్నీళ్ళు తల్లి పాదాలని అభిషేకించాయి. కూతురిని ఆశీర్వదిస్తున్న తల్లి కన్నీళ్ళు ఆమె తలపై అక్షింతలై కురిశాయి. దుఃఖాన్ని నిగ్రహించుకోలేక పెరట్లోకి వెళ్ళిపోయి వెక్కివెక్కి ఏడుస్తున్న పార్వతమ్మ దగ్గరకి ఆదుర్దాగా వచ్చింది సుశీలమ్మ.

"పిచ్చిదానివా ఏమిటొదినా? శుభమా అని ఉమ పెళ్ళిచేసి అత్తవారింటికి పంపుతూ అలా ఏడవచ్చా? లోకంలో నువ్వొక్కదానివే ఆడపిల్లని కన్నావా ఏం? నువ్వలా ఏడిస్తే పిల్ల బెంగటిల్లిపోతుంది. కళ్లు తుడుచుకో. పిల్లని నవ్వుతూ సాగనంపు. అయినా ఉమని నువ్వు చూడాలన్నా అది నిన్ను చూడాలన్నా ఏమంత దూరాభారమని. బస్సెక్కితే పావుగంట ప్రయాణం"

సుశీలమ్మ ఓదార్పుతో వూరటచెంది కళ్ళు తుడుచుకుంది పార్వతమ్మ.

ఏడ్చిఏడ్చి ఉమ కళ్ళు మంకెన పూలలా వున్నాయి. "తను వెళ్ళిపోతోంది. తల్లి ఒంటరిగా బతుకునెలా ఈడుస్తుందనే బాధే ఆమెకి దుఃఖాన్ని తెప్పిస్తోంది.

"మీ ఆవిడ కన్నీటి ప్రవాహంలో మనం ఇక్కడనుంచి మన ఇంటిదాకా వెళ్ళడానికి కారు లాభంలేదు. పడవ వుండాల్సిందే!" రుక్మిణి వ్యంగ్యంగా అన్నదానికి భాస్కర్ నవ్వడం వినిపించి ఉమ సిగ్గుతో కుంచించుకుపోయింది.

"కన్నవాళ్ళని విడిచిపెట్టి మొదటిసారిగా అత్తవారింటికి వెళ్ళే ఆడపిల్ల హృదయావేదన తెలియని మూర్ఖురాలా ఈమె. తన దుఃఖాన్ని బాధని అపహాస్యం చేస్తున్న ఈమె ఒకప్పుడు పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్తూ బాధపడలేదా?" ఉమకెందుకో ఆడబడుచుపై సదభిప్రాయం కలగలేదు. ఆమె కళ్ళలో నీళ్ళూరుతున్నాయి. పెళ్ళయి ఇంకా కొద్దిగంటలు కాకముందే ఆడబడుచుపై దురభిప్రాయం కలిగినందుకు బాధతో వచ్చిన కన్నీళ్ళవి.

★ ★ ★

సత్యన్నారాయణవ్రతం, భోజనాలు అయ్యాక వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయారు. పార్వతమ్మ కూడా ప్రయాణమయింది.

ఆమె వెళ్తానని చెప్పగానే, "వుండండి. రేపు వెళ్దురుగాని'' అంది రుక్మిణి.

పార్వతమ్మని ఆమె ముభావం వెళ్ళగొడుతోంది. కాని కూతురి దగ్గరగా ఈ ఒక్కరోజైనా వుండాలనే కాంక్ష ఆమెని ఆపేసింది.

"కాస్సేపు పడుకోండి'' అంటూ రుక్మిణి గదిలో పక్క చూపించింది ఆవిడకి. పార్వతమ్మ పడుకుంది. పదిరోజులబట్టి నిర్విరామంగా పెళ్ళి పనులతో సతమతమై వుందేమో ఆవిడని నిద్రాదేవత ఆవహించింది. పక్క మంచంమీద అప్పటికే ఉమ ఒళ్లెరగకుండా నిద్రపోతోంది.

అలా ఎంతసేపు నిద్రపోయిందో బాగా దాహమనిపించి, మెళుకువ వచ్చింది ఆవిడకి. మంచినీళ్ళకోసం గది బయటకి రాబోయి నదల్లా బయటనుంచి వినిపిస్తున్న రుక్మిణి మాటలలో తన ప్రస్తావన వినిపించి అప్రయత్నంగా ఆగిపోయింది.

"మీ అత్తగారికి ఉమ ఒక్కర్తే ఆడపిల్ల! పైగా బతకడానికి ఆధారమూ లేదు. ఇన్నాళ్ళూ ఉమచేత ఉద్యోగం చేయించి బాగానే బతికేసింది. ఇప్పుడింక ఆ ఆధారమూ లేదుగా? ఆవిడ బాధ్యతా నీదే!" రుక్మిణి అన్నదానికి అతనేమంటున్నాడో వినిపించలేదు.

పార్వతమ్మ హృదయ స్పందన ఆగినట్ట




# ఏరిన ముత్యాలు

★ ఒక వ్యక్తి ఎలాంటివాడో తెలుసుకోవాలంటే అతనిని 'అధికారం'లో కూర్చోబెట్టి చూడు.

-యుగోస్లావియా సామెత

★ 'మార్పు' వేరు, 'ప్రగతి' వేరు. మార్పు శాస్త్రీయం, ప్రగతి నైతికం. మార్పు నిస్సందేహం, ప్రగతి సందేహాస్పదం.

-బర్ట్రాండ్ రస్సెల్

★ కళకి విలువ తెచ్చేది అందంకాదు, సదాచారం.

-సోమర్‌సెట్ మామ్

★ ప్రగతికి అన్నిటికంటె ఎక్కువ అవసరమయింది 'అసంతృప్తి'. సంపూర్ణ తృప్తి చెందిన మనిషిని చూపగలమా?

-టి.ఎ.ఎడిసన్

★ రక్తపాతం నువ్వుకోరుకుంటే అది మన రక్తమే అవనీ. ఒకరిని చంపడంకంటే తాను చావగలిగే గొప్ప ధైర్యం మనిషి అలవరచుకోవాలి.

-మహాత్మాగాంధీ

★ జీవితం అంటే భయపడేవారు అప్పుడే మూడువంతులు మరణించినట్టే.

-రస్సెల్

★ విశ్వాసం సడలిపోయి, గౌరవం నాశనమైతే మనిషీ పోయినట్టే.

-జాన్‌గ్రీన్‌లీఫ్

★ మానవజాతి చరిత్రను నిర్ధారించేది ఆకాశంలో ఏం జరుగుతోందో దాన్ని బట్టి.

-సర్ ఆర్థర్ కేత్

★ పెద్దగా అరిచి, తన వాదన నమ్మాలని చూచేవారి వాదం ఎపుడూ బలహీనమే!

-హెన్‌స్టైన్

★ స్నేహంకోసం ప్రాణమివ్వడం కష్టమేమీకాదు. అంతటి త్యాగంచేసే స్నేహితుణ్ణి పొందటమే కష్టం.

-హ్యూమ్

★ ప్రేమకు అర్థం ఏమిటంటే మన సుఖాలను మరొకరి సుఖాలతో కలిపి పంచుకోవడం.

-లిబ్‌నిజ్

★ తప్పులు అందరూ చేయగల్గితే, త్యాగాలు కొందరే చేయగలరు.

-రాచకొండ విశ్వనాథశాస్త్రి

సేకరణ: దంతుర్తి భినరామచంద్రరావు

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు

**కూపన్**

జనవరి **చతుర నవల** **బాధ్యత**

సమీక్షకుని పేరు : ____________________

చిరునామా ____________________

____________________

____________________

యింది. ఆవిడ శరీరంలోని రక్తమంతా నీళ్ళు గా మారిపోతున్న అనుభూతి.

ఆ స్వరంలో ఎంత చులకన? మరెంత తృణీకారం! తన బాధ్యత వహించవలసివ స్తుందేమోననే భయాన్ని పెళ్ళిచూపులలోనే వ్యక్తం చేసిన సుందరరామయ్య! తన బాధ్యత అల్లుడిదేనని ఘంటాపథంగా చెబుతున్న రుక్మిణి! ఏమిటీ మనుషులు! పరుల ముందు చెయ్యి జాపని తన ఆత్మాభిమానం తన అసహాయత ముందు ఓడిపోతుందా? అలా ఒక్కనాటికీ జరగదు, జరగకూడదు.

రుక్మిణి అన్నదానికి అల్లుడు ఏమన్నాడో పార్వతమ్మ విననూ లేదు. వినాలన్న కుతూహలమూ ఆవిడకి లేదు. ఆవిడ మంచినీళ్ళు తాగే ప్రయత్నాన్ని విరమించుకుని వెనుదిరగబోయింది.

రుక్మిణికి వత్తాసు పలుకుతున్నట్టు మరో స్వరం వినిపించింది.

"ఏరికోరి మంచి సంబంధం చేసుకున్నావురా! కట్నకానుకలేవీ లేవుగానీ, అత్తగారు మాత్రం అల్లుడింటికి అరణం వస్తుందిట!" ఆ స్వరం తన అల్లుడికి అమ్మమ్మ అయిన తులసమ్మది.

పార్వతమ్మకి అక్కడనుంచి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోయి దోసిట్లో ముఖం దాచుకుని కరువుతీరా ఏడవాలన్పించింది.

తనని గురించి వీళ్ళంతా ఏమనుకుంటున్నారు? తను అల్లుడినెత్తినెక్కి కూర్చుని తినేదానిలా కనిపిస్తోందా? తను ఏ ఆధారంలేనిది కాబట్టి వీళ్ళు ఇలా చులకనగా మాట్లాడుతున్నారు! అదే తను బాగా డబ్బున్నదైతే తనని అగ్గగ్గలాడుతూ చూసేవాళ్ళే!" ఆవిడ వెనుదిరిగివచ్చి తన పక్కమీద పడుకుంది. పొంగిపొరలి వస్తున్న దుఃఖాన్ని బలవంతాన నిగ్రహించుకుంటోందావిడ.

★ ★ ★

హఠాత్తుగా వచ్చిన నీరజని చూసి ఆశ్చర్యపోయింది అన్నపూర్ణమ్మ.

"ఉత్తరమైనా రాయకుండా వచ్చావేమిటీ''

"నా ఉత్తరం నీకు చేరేప్పటికి నేను ఇంట్లో వుంటాను. అందుకని రాయలేదు''

"అదికాదు. నువ్వు ఎప్పుడొస్తావని, స్టేషన్‌కి వచ్చి నిన్ను తీసుకొస్తానని మామయ్యగారు అడిగారు''

తల్లి నోటివెంట ఆ సమయంలో పరంధామయ్య ప్రస్తావన రావడం ఆమెకేమాత్రం నచ్చలేదు. ఆ అయిష్టతని ముఖంలో కనబడనివ్వకుండా అంది.

"అబ్బబ్బ! నేనేమైనా చిన్నపిల్లనా ఏమిటి? రేపో, మాపో అమెరికా వెళ్ళబోతున్నదాన్ని. ఇంకా నన్ను చెయ్యిపట్టుకుని ఇంటికి తీసుకురావాలా?"

"అమెరికా వెళ్తావా? దేనికి? ఇంకా చదువుతావా?" అన్నపూర్ణమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

"చదవక? ఈ పల్లెటూళ్ళో కూర్చుని పిడకలు చెయ్యమంటావా?" విసురుగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తలుపు వేసుకుంది నీరజ.

భోజనాలయ్యాక తీరుబడిగా పుస్తకం ఏదో పట్టుకుని కూర్చున్న కూతుర్ని అడిగింది.

"నా ఉత్తరం అందిందా?"

"అందింది'' పుస్తకంలోనుంచి తలెత్తకుండానే అంది. ఆవిడకి ముభావంగా, ముక్తసరిగా మాట్లాడుతున్న కూతురి దగ్గర పెళ్ళి విషయం ఎలా ప్రస్తావించాలో అర్థం కాలేదు.

"అది కాదే! ఎంత చదివినా, ఎంత పెద్ద ఉద్యోగం చేసినా పెళ్ళి చేసుకోక తప్పదుకదా! పెళ్ళయ్యాక నీ ఇష్టం! నీ భర్త ఇష్టం! ఇంకా చదువుకుంటావో, ఉద్యోగమే చేస్తావో'

"నేనింకా చదువుకోవాలి. నాకు నా కెరీర్ ముఖ్యం! పెళ్ళికాదు''

"నామాట విను నీరజా! తెలిసివున్న సంబంధం..." ఆవిడ ఇంకా ఏదో చెప్పబో

తుండగానే అసహనంగా అడ్డుపడింది.

"అన్నీ నువ్వు నిర్ణయించడమేనా? నా ఇష్టాయిష్టాలతో ప్రమేయంలేదా?"

"శేఖర్ అంటే నీకు ఇష్టంలేదా?"

"ఇష్టమే! కానీ ఆ ఇష్టం పెళ్ళి చేసుకునేంత గాఢమైనది కాదు. చిన్నప్పటినుంచి ఇరుగుపొరుగున వుండేవాళ్ళం. అతన్ని ఒక స్నేహితునిగా అభిమానించగలను. అంతే!"

"మీ నాన్నగారు పోయినప్పటినుంచీ ఇన్ని సంవత్సరాలుగా మామయ్యగారు మనకి ఎంత ఉపకారం చేశారు? నన్ను తోడబుట్టినదానికంటే ఎక్కువగా ఆదరించారు. ఇవ్వాళ వాళ్ళబ్బాయికి నిన్ను చేసుకుంటానని ఆయనంతట ఆయనగా ముందుకి వచ్చారంటే శేఖరానికి సంబంధం దొరక్క కాదు. కేవలం మనపై వున్న అభిమానంతోనే. మన రెండు కుటుంబాల మధ్యవున్న స్నేహాన్ని బంధుత్వంగా మార్చుకోవాలనే!"

"అంతేనా? దాదాపు పదిహేను ఎకరాల పొలానికి ఒక్కగానొక్క వారసురాలిని! నన్ను వాళ్ళబ్బాయికి చేసుకుంటే ఆస్తి బయటికి పోదనే ప్లాన్‌తో కూడానా?"

"నీరజా!" హతాశురాలయింది అన్నపూర్ణమ్మ. "అలా మాట్లాడకు. మామయ్య వింటే బాధపడతారు''

"లేకపోతే ఏమిటమ్మా నువ్వు చెప్పేది? ఆయన మన కుటుంబానికి చేసిన సాయానికి కృతజ్ఞతతో నేను వాళ్ళబ్బాయిని పెళ్ళి చేసుకోవాలా? నేను ఇంజనీర్‌ని. అతను బ్యాంక్ ఉద్యోగి. ఇగో కాంప్లెక్సులు మొదలవుతాయి. సంసారం నరకమవుతుంది''

"నేనాకోణంనుంచి ఆలోచించనేలేదు నీరజా!" అన్నపూర్ణమ్మ సిగ్గుపడుతూ అంది. "మామయ్యా వాళ్ళది మంచి కుటుంబం. శేఖరం బుద్ధిమంతుడు. ఇదొక్కటే ఆలోచించాను. మామయ్యగారు అడిగితే ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో? తెల్లవారి ముఖం ముఖం చూసుకునేవాళ్ళం"

"మా అమ్మాయి అమెరికా వెళ్తానంటోంది. అప్పుడే పెళ్ళి చేసుకోదుట అని చెప్పెయ్యి. దానికంత మధనపడడమెందుకు?" తేలిగ్గా అంది.

కానీ, ఆవిడమాత్రం ఆవిషయాన్ని తేలిగ్గా తీసుకోలేకపోయింది. పరంధామయ్యగారి కుటుంబంతో ఆవిడకి వున్న అనుబంధం అలాంటిది.

★ ★ ★

ఇంటి మెట్లెక్కుతున్న పార్వతమ్మని చూసి రుక్మిణి ముఖం అప్రసన్నమయింది. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో పలకరించింది ఆవిడని.

"రండి. ఉమ మా ఇంటికి వచ్చి నెలరోజులయినా, మీరు చూడ్డానికి రాలేదేమిటా అనుకుంటున్నాను'' ఆ మాటలలోని శ్లేష పార్వతమ్మకి అర్థమయింది.

"ఉమా! మీ అమ్మగారు వచ్చారు చూడు!" అరిచినట్టు చెప్పింది.

పార్వతమ్మ ఉస్సురనుకుంటూ ముఖాన పట్టిన చెమటని పైట కొంగుతో తుడుచుకుంటూ నిలబడివుంది. వంటింట్లో పనిచేస్తున్న ఉమ సంభ్రమంగా వచ్చి తల్లిని కౌగలించుకుంది.

"ఇంత చిక్కిపోయావేమిటమ్మా?" కన్నీళ్ళతో అడిగింది. నిజంగానే పార్వతమ్మ కళ్ళు గుంటలుపట్టి ముఖం పీక్కుపోయి వుంది.

"నీమీద బెంగతో అన్నం తినడం లేదేమో మీ అమ్మగారు'' వంకరగా నవ్వుతూ అంది రుక్మిణి. వ్యంగ్యంగా మాట్లాడుతున్న ఆమె ధోరణి ఆవిడ మనసులో ముల్లు గుచ్చినట్లయింది.

"కూర్చోమ్మా! మంచినీళ్ళిస్తాను'' ఉమ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చింది. కూతురిచ్చిన నీళ్ళు తాగి గ్లాసు పక్కన పెట్టింది.

"బాగా నీరసంగా కనిపిస్తున్నావు. ఒంట్లో బాగా లేదామ్మా?" తల్లి చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కుతూ అడి




గింది.

"ఏం లేదమ్మా! పెళ్ళి పనులు, అలసటవ లన ఇలా అయ్యాను అంతే!" నవ్వుతూ అంది పార్వతమ్మ. కొంచెం ఒళ్ళు చేసి, సంతోషం తెచ్చిన నిగారింపుతో మిసమిసలా డుతున్న కూతురిని కళ్ళనిండుగా చూసుకుని ఆనందించింది.

"ఆంటీ వాళ్ల ఇంటికి వెళ్తున్నావా? పల్లవి ఎప్పుడు వస్తుంది?"

"ఆంటీ వాళ్ళు వూళ్ళో లేరు. పల్లవి పరీక్షలయిపోయాయిట. తిరుపతి వెళ్ళి అటు నుంచే బెంగుళూర్, మైసూరు, వూటీ అన్నీ తిరిగి వస్తారుట"

కాస్సేపు అవీ ఇవీ మాట్లాడుకున్నాక ఉమలేచింది. 'కాఫీ తెస్తానుండు'

"నువ్వు మీ అమ్మగారితో మాట్లాడుతూ వుండు. నేను కాఫీ కలుపుతాను'' అంది అంతవరకు వాళ్ళ దగ్గరే కూర్చున్న రుక్మిణి చటుక్కున లేస్తూ.

ఉమకి ఆదుర్దాగా వుంది. తల్లి తన పెళ్ళికోసం అప్పు చేసిందని తెలుసు. ఆ అప్పు ఎలా తీరుస్తుంది? లోతుకుపోయిన కళ్లతో రోగిష్టి దానిలా వున్న తల్లిని చూస్తే అసలామె భోజనం చేస్తోందా అనే అను మానం వచ్చిందామెకి.

"నిజం చెప్పమ్మా! ఎందుకలా వున్నావ్. ఒంట్లో బాగాలేదా?"

కూతురి ఆతురత అర్థమై తల్లి మనసు ఆర్ద్రమయింది "నాకే అనారోగ్యం లేదు. ఎందుకంత కంగారు పడుతున్నావ్? ఎండ లు మండిపోతున్నాయ్ కదూ? నీళ్ళు తెగ తాగి అన్నం సహించడంలేదు. భాస్కర్ ఎప్పుడు వస్తాడు?" మాట మార్చింది.

"సాయంకాలం అయిదు గంటలవు తుంది''

ఈలోగా రుక్మిణి కాఫీ తెచ్చింది.

"తీసుకోండి'' అంది కప్పు ఆవిడ దగ్గర పెడుతూ. రుక్మిణి తనపై ఎంత తేలిక భావంతో వున్నదీ అర్థమైన పార్వతమ్మకి ఆ కాఫీ తాగాలనిపించలేదు.

"నాకు కాఫీ వద్దమ్మా! ఇప్పుడే తాగి వచ్చాను'' అంది.

"కాఫీయేగా! మరోసారి తాగవచ్చు. ఫర్వాలేదు తాగమ్మా'' అంది ఉమ.

కూతురు చెప్పినా ఆవిడ కాఫీ తాగలేదు.

"కలిపేశారుగా! పోనీ మీరు తాగండి వదినా!" అంది ఉమ.

"నేను కాస్సేపాగి తాగుతాను. నువ్వు తాగు'' అంది రుక్మిణి 'తిండి లేకపోయినా పొగరుకేమీ తక్కువలేదు' అని లోలోన పళ్ళు కొరుక్కుంటూ,

ఉమ కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంది. కషాయంలా, చూరునీళ్లలా వున్న ఆ కాఫీని తాగలేక తాగుతూ అడిగింది.

"పొద్దుట ఫిల్టర్ వేశాను. డికాషన్ గ్యాస్ స్టవ్ పక్కనే వుంది. మీరు చూడలేదా?"

"అయ్యో! నేను చూడలేదు ఉమా! డికా షన్ లేదేమో అనుకుని మీ అమ్మగారు వెళ్లిపోయే తొందరలో వున్నారనుకుని నీళ్లలో పొడరు వేసి వడగట్టాను'' అంది రుక్మిణి.

ఆమె కావాలనే తనకోసమని నీళ్ల కాఫీ కలిపిందని పార్వతమ్మ కొక్కదానికే తెలు సు. ఆమెకెందుకో ఆ వాతావరణంలో కూర్చోడానికి ఇబ్బంది అనిపించింది.

"నేను వెళ్ళొస్తాను ఉమా!" లేచింది.

"కాస్సేపాగి వెళ్ళచ్చులేమ్మా?" అంది ఉమ.

"నాలుగు రోజులు వుండడానికి వచ్చారనుకున్నాను. అప్పుడే వెళ్తారా?" రుక్మిణి వంకరగా నవ్వుతూ అంది.

"పాఠం చెప్పడానికి వెళ్ళాలి. టైమ యింది'' ఆవిడ వెళ్తున్నానని కూతురితో చెప్పి బయటికి వచ్చేసింది.

ఆవిడ కళ్లల్లో నీళ్ళు ఊరుతున్నాయి.

'పంచప్రాణాలు కూతురిపైనే పెట్టుకుని బతికింది. ఇప్పుడు అది పరాయిదయిపోయింది. దాని ఇంట్లో కప్పు కాఫీ ఇవ్వడానికి కూడా దానికి స్వతంత్రం లేదు. భగవంతుడు తన భర్తని తీసుకుపోవడమే కాదు. తనకి ఆడపిల్లనిచ్చి తీరని అన్యాయం చేశాడు. ఇదే కొడుకు దగ్గర ఉంటే ఎంత స్వతంత్రంగా స్వేచ్ఛగా వుండేది?' అనుకుందావిడ వేదనగా నిట్టూరుస్తూ.



తలుపు తట్టిన శబ్దం విని అన్నం తింటున్న పార్వతమ్మ చెయ్యి కడుక్కుని వచ్చి తలుపు తీసింది. ఎదురుగా నిలబడి వున్న ఉమని చూసి ఆనందంతో విప్పారిన ముఖంతో అంది.

"నువ్వా! ఇదేమిటమ్మా ఇంత ఎండలో?" అంది పక్కకి తప్పుకుని దారి ఇస్తూ.

"ఆయన బ్యాంక్‌కి వెళ్ళారు. ఇంట్లో ఏమీ తోచలేదు. కాస్సేపు నీ దగ్గర కూర్చోవచ్చు కదా అని వచ్చానమ్మా'' లోపలకి వచ్చింది ఉమ.

"భోజనం చేశావా?"

"చేశాను. మంచినీళ్ళు కావాలి'' అంటూ వంటగదిలోకి నడవబోయింది.

"నువ్వు ఇక్కడే కూర్చో! వంటగదిలో అసలు గాలి ఆడడంలేదు. నేను మంచినీళ్లిస్తాను''

"నేను మంచినీళ్ళు తీసుకుంటానుకానీ, నువ్వు భోజనం చేశావా?" అంది వంటింట్లోకి వెళ్తూ.

పార్వతమ్మ ఆమెననుసరిస్తూ అంది.

"తింటున్నాను. ఇంతలో నువ్వొచ్చావు''

"నేనూ ఇక్కడే కూర్చుంటాను. తినేసెయ్యి''

పార్వతమ్మ కంచంముందు కూర్చుంది. పచ్చడితో అన్నం తింటున్న తల్లిని చూస్తూ "కూర వండుకోలేదామ్మా?" అనడిగింది ఉమ.

"ఇంట్లో కూరలు అయిపోయాయి. పొద్దుట నేను స్నానం చేస్తుండగా కూరల బ్బాయి వచ్చి పిలిచి పోయాడు. ఎలాగూ సాయంకాలం బయటికి వెళ్తానుకదా. అప్పుడు తీసుకోవచ్చులే అని..."

నీళ్లలాంటి మజ్జిగతో అన్నం తింటున్న తల్లిని చూసి కన్నీళ్ళు ఆపుకోలేక ముందు గదిలోకి వెళ్ళిపోయింది.

ఇంట్లో కూరలు అయిపోయినమాట అబద్ధమని తనకి తెలుసు. 'గతంలో తల్లి, తను సంపాదిస్తేనే అంతంతమాత్రంగా గడచిపోయేది. ఇప్పుడు తల్లి ఒక్క సంపాదనమీద గడపడం ఎంత కష్టం'

భోజనం ముగించి ముందుగదిలోకి వచ్చిన పార్వతమ్మ ఏడుస్తున్న కూతురుని చూసి కంగారు పడిపోయింది.

"ఏమయిందమ్మా? ఎందుకేడుస్తున్నావ్?"

"నాకెందుకు పెళ్ళి చేశావమ్మా?" తల్లి భుజంపై తల వాల్చి వెక్కివెక్కి ఏడ్చింది.

ఆమె హృదయ విదారకంగా అలా ఏడుస్తుంటే పార్వతమ్మ గాభరాపడిపోయింది.

"ఏమయిందో నాకు చెప్పు తల్లీ! అల్లుడు మంచివాడు కాడా? నిన్ను బాధపెడ్తున్నాడా?"

"నేను చాలా సుఖంగా వున్నానమ్మా! ఆయన చాలా మంచివారు. నన్ను చాలా ప్రేమగా చూసుకుంటారు. కానీ నువ్విక్కడ కడుపునిండా తిండికి నోచుకోకుండా అవస్థపడుతుంటే నేనక్కడ సంతోషంగా వున్నాను''

"అవా'' తేలికపడిన మనసుతో నవ్వేసింది.

"నేనేమీ తిండి తినకుండా పస్తులుండడం లేదమ్మా! రోజూ కూర కొంటున్నాను. ఇవాళే..."

"ఎందుకమ్మా అందమైన అబద్ధాలతో నిన్ను నువ్వు మోసం చేసుకుంటూ, నన్ను మోసం చెయ్యాలని చూస్తావ్? నువ్వు నిజంగా ఏలోటూ లేకుండా బతుకుతున్నావా? మనిద్దరి సంపాదనే ఇల్లు గడవడానికి కటాకటీగా సరిపోయేది. ఇప్పుడు నువ్వొక్కదానివే సంపాదిస్తూ నా పెళ్ళికైన అప్పులు తీరుస్తూ... నెలరోజులలో నువ్వెంత చిక్కిపోయావో నీకు తెలుస్తోందా? ఇలా పచ్చడి మెతుకులు రోజూ తింటే నీ ఆరోగ్యమేమయిపోతుంది?"

"ఆ పచ్చడి మెతుకులు కూడా లేని నిర్భాగ్యులు ఈ ప్రపంచంలో చాలామందే వున్నారు. వాళ్ళకంటే నేను నయంకదూ?" నవ్విందావిడ.

ఉమకి ఉప్పెనలా దుఃఖం వస్తోంది.

ఏం సుఖపడింది అమ్మ? ఎప్పుడూ పేదరికమే! ఎప్పుడూ రేపు ఎలా గడుస్తుందా అన్న బెంగే! తన చదువు మధ్యలోనే ఆపేసి ఉద్యోగంలో చేరేవరకు తమ ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రంగానే వుండేది. ఇప్పుడు మళ్ళీ అదే పరిస్థితి పునరావృతమయింది.

"అందుకే నేను పెళ్ళి చేసుకోనని చెప్పాను'' వెక్కిళ్ళమధ్య అస్పష్టంగా అంది.

"పిచ్చిదానివి! పెళ్ళి మానేస్తావా? రేపో మాపో రాలిపోబోయే ఈ అమ్మకోసం నీ భవిష్యత్తు నాశనం చేసుకుంటావా? అయినా నాకేమయిందని? చెట్టుకింద గడపడంలేదు. హాయిగా నెలకి నాలుగొందలు అద్దె ఇస్తూ శుభ్రమైన ఇంట్లో వుంటున్నాను. పస్తులుండడం లేదు. ఒకరిపై ఆధారపడకుండా స్వతంత్రంగా సంపాదించుకుంటున్నాను''

"ఎన్నాళ్ళు సంపాదించగలవ్? ఎన్నాళ్లిలా ఒంటరిగా గడపగలవ్? నీకేదైనా సుస్తీ చేస్తే?"

"నన్ను ప్రాణంగా చూసుకోవడానికి నువ్వున్నావుగా? నీ దగ్గరికి వచ్చేస్తాను'' ఆవిడ కూతురిని ఓదార్చడంకోసమే ఆ మాట అన్నా 'వృద్ధాప్యంలో నా బాధ్యత నీదే అని ఆమెతో చెప్పకనే చెప్పానా' అని లోలోన మథనపడింది.

ఉమకి పెళ్ళికి ముందు తల్లితో తను పట్టుదలగా అన్నమాటలు గుర్తువచ్చాయి.

"ఒకసారి అతన్ని కలుసుకుని మాట్లాడతాను. అతను నిన్ను ఆదరించడానికి అంగీకరిస్తేనే పెళ్ళి చేసుకుంటాను''

"తనెందుకు ఆ మాటపై నిలబడలేకపోయింది? తను పెళ్ళికి తొందరపడలేదు. తన పెళ్ళి తల్లికి పెద్ద సమస్య! తనకి పెళ్ళి చెయ్యలేకపోయాననే బాధ ఆవిడని కృంగదీస్తోందని తనకి తెలుసు. అలాంటి పరిస్థితులలో అనుకూలమైన సంబంధం తనని వెదుక్కుంటూ వచ్చినా తను పెళ్ళికి నిరాకరించడం తల్లికి మరిన్ని సమస్యలను తెచ్చిపెడుతుందని తెలుసు. అందుకే గత్యంతరం లేక పెళ్ళికి ఒప్పుకుంది. చాలీచాలని సంపాదనతో ఒంటరిగా తల్లి ఎలా బతుకునీడుస్తుందా అనే బాధని తనని కోరి జీవితంలోకి ఆహ్వానించిన భర్త అనురాగంలో మరిచిపోయింది. ఇప్పుడు తల్లి సమస్య పరిష్కరింపబడాలంటే అతని సహకారం అవసరం. తనని ప్రాణప్రదంగా, అపురూపంగా చూసుకునే అతను తల్లికి సహాయపడితే కాదంటా



డా?" ఉమ మనసులో చిన్న ఆశ కలిగింది.

★ ★ ★

భాస్కర్‌పై అతని అక్క రుక్మిణి ప్రభావం ఎక్కువగా వుంది. చిన్నప్పుడే తల్లి, ఇంటర్ రెండోసంవత్సరం చదువుతుండగానే తండ్రి చనిపోవడంతో అక్కగారింట్లోనే వుండి చదువుకునేవాడు. పై చదువులకి హాస్టల్‌కి వెళ్ళినా సెలవులకి అక్క ఇంటికే వచ్చేవాడు. రుక్మిణి భర్త జగన్నాథం కూడా బావమరిది నెలల తరబడి తమ ఇంట్లో వున్నా పెద్దగా అభ్యంతరం పెట్టేవాడు కాడు. రుక్మిణి తర్వాత అతనిపై ప్రభావం చూపించినది అతని అమ్మమ్మ తులసమ్మ. తులసమ్మ నిజానికి అతని స్వంత అమ్మమ్మ కాదు. తమ తల్లి పోయాక తమ ఆలనా పాలనా చూసిన ఆవిడపై రుక్మిణికి, భాస్కర్‌కి కూడా కృతజ్ఞతాభావం వుంది.

★ ★ ★

ఆరోజు ఉమ తల్లిని చూడ్డానికి వెళ్ళిన కొద్దిసేపటికే రుక్మిణి రోజూలాగానే తమ్ముడింటికి వచ్చింది. ఇంటికి తాళం పెట్టివుంది. పక్కింటి వాళ్ళని అడిగితే ఉమ తల్లిని చూడ్డానికి వెళ్ళిన విషయం తెలిసింది. రుక్మిణికి పేదింటి పిల్ల అయిన ఉమని తమ్ముడు పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు. డబ్బులేనివాళ్ళకి నీతి నియమాలుండవని, వాళ్ళు ఆడపిల్ల సొమ్ముకి, అల్లుడిసొమ్ముకి కూడా ఆశపడతారని ఆమెకో గొప్ప నమ్మకం. ఆమె నమ్మకం ఇంతవరకు వమ్ము కాలేదు. అలాంటి దృష్టాంతాలను చాలా చూసింది కూడా. కిందటిరోజు పార్వతమ్మ ఉమని చూడ్డానికి రావడం ఆమెకి తెలుసు. ఇవాళ వున్నట్టుండి ఆమె తల్లిని చూడ్డానికి వెళ్ళిందంటే భర్తకి తెలియకుండా ఏ డబ్బో దస్కమో ఇవ్వడానికేనని ఆమె అనుమానం. ఆమె అనుమాన నివృత్తికోసం తమ్ముడికి ఫోన్‌చేసింది.

"మీ ఇంటికి వెళ్ళాను. ఉమ ఇంట్లోలేదు''

"ఎక్కడకి వెళ్ళింది?" అడిగాడతను.

"వాళ్ళమ్మగారిని చూడ్డానికి వెళ్ళింద'ని పక్కింటివాళ్ళు చెప్పారు.

"తను వాళ్ళమ్మగారింటికి వెళ్తానని నాతో చెప్పలేదే''

"నీకు చెప్పకుండా వెళ్ళి వుంటుందని నేనూ అనుకున్నానులే' ఆమె ఫోన్ పెట్టేసింది.

రుక్మిణి భాస్కర్‌కి ముందునుంచే పేద అత్తమామలు అల్లుడిసొమ్ము ఎలా దోచుకుని తింటారో చెప్పేది. అలాంటి ఒకటి రెండు సంఘటనలని అతనికి చూపించింది కూడా. ఇప్పుడు ఉమ తనతో చెప్పకుండా ఆమె తల్లిని చూడ్డానికి వెళ్ళడం అతనికి బోలెడు అనుమానాలను కలిగించింది. ఇంట్లో బీర్వాలో డబ్బు వుంది. ఉమ దాంట్లోంచి రెండు వందలు తీసి తల్లికి ఇచ్చినా ఇస్తుంది. భార్యని అనుమానించి, అవమానించినట్టవుతుందని బీర్వా తాళాలు దాచలేదు. కాని భాస్కర్ రుక్మిణిలా పైకి తేలే రకం కాదు. అతను సాయంకాలందాకా బ్యాంక్‌లో ఎలాగో గడిపి ఇంటికి వచ్చాడు.

రోజూ అతను ఇంటికి వచ్చేప్పటికి స్నానం చేసి ఫ్రెష్‌గా తయారై చిరునవ్వుతో స్వాగతమిచ్చే ఉమ ముఖం పది లంఖణాలు చేసినట్టుగా పీక్కుపోయి వుంది. ఆమె చాలా సేపటినుంచి ఏడుస్తోందనడానికి నిదర్శనంగా కళ్ళు ఎర్రగా వున్నాయి.

"అలా వున్నావేం?" అని అడిగేడు.

ఆమె జవాబు చెప్పేలోగానే "ప్రొద్దుట పదకొండు గంటలకి ఇంటికి వచ్చాను. ఇంటికి తాళం పెట్టివుంది. ఎక్కడకి వెళ్ళావ్?" అనడిగేడు.

"మా అమ్మని చూడ్డానికి వెళ్ళాను'' చెప్పిందామె. ఆమె స్వరంలో దుఃఖఛాయలని పట్టించుకోకుండా అతను లోపలకి నడిచాడు. బీర్వాతీసి డబ్బు లెక్కపెట్టాడు. తను




పెట్టిన డబ్బు పెట్టినట్టే వుంది. గాఢంగా నిశ్వసించాడు.

ఉమ అతనికి కాఫీ తెచ్చింది. అతను రోజూలా మాట్లాడకపోవడంతో వంట ప్రయత్నంలో పడింది.

రాత్రి ఎనిమిది గంటలవుతుండగా భోజనానికి కూర్చున్న అతను టేబిల్‌మీద తనకొక్కడికే కంచంపెట్టి వుండడాన్ని గమనించి అడిగాడు.

"అదేం? నువ్వు తినవా?"

"తినాలని లేదు''

"ఏం ఒంట్లో బాగాలేదా?"

ఆమె తలవూపింది. అవును, కాదుల మధ్య వుంది ఆ తల పంకింపు.

"కొంచెం తిను'' అతను పళ్ళెంతీసి అన్నం, కూరవేసి ఆమెని పిలిచాడు. "రా కూర్చో!"

అతని బలవంతంమీద ఆమె కంచంముందు కూర్చుంది. ఆమె కళ్ళ ముందు పచ్చడి మెతుకులు తింటున్న తల్లి కనిపిస్తోంది. చిక్కి సగమైన తల్లి! ఆమె కళ్లనుంచి నీళ్ళు రాలి కంచంలో పడ్డాయి. ఆమె కంచాన్ని వెనక్కి నెట్టేసి లేచి గదిలోకి వెళ్ళిపోయింది.

ఆమె వెనుకనే ఆదుర్దాగా గదిలోకి వచ్చాడతను.

"ఏమయింది, నాకు చెప్పు. ఒంట్లో బాగాలేదా?"

'కాదు' అన్నట్లు తలవూపింది.

"మీ అమ్మగారికి బాగాలేదా?"

"బాగాలేనిది ఇంట్లోని పరిస్థితే!" అంటూ ఉమ తల్లి తమ పెళ్ళికి అప్పుచెయ్యడం గురించి చెప్పింది.

"మేమిద్దరం సంపాదిస్తున్నప్పుడు ఇంట్లో బాగానే గడచిపోయేది. ఇప్పుడు అమ్మ ఒకర్తే ఎంత కష్టపడుతోందో తెలుసా? పచ్చడి మెతుకులు తింటూ, చిక్కి సగం అయింది''

"అయ్యయ్యో!" అన్నాడతను అప్రయత్నంగా.

"అమ్మకి నేనొక్కర్తినే కూతురిని అవడం ఆవిడ దురదృష్టం. ఇప్పుడు ఫర్వాలేదు. మరో నాలుగేళ్ళు పోయాక అయినా ఆవిడ ఎవరో ఒకరిమీద ఆధారపడవలసిందే! అప్పుడావిడని ఎవరు చూస్తారా అని నా దిగులు'' అంది ఉమ.

భాస్కర్ తెలివిగా సంభాషణను పక్కదారి పట్టించాడు.

★ ★ ★

నీరజ వచ్చి వారం రోజులయినా అన్నపూర్ణమ్మగారు తను ప్రస్తావించిన విషయానికి రెస్పాన్స్ ఇవ్వకపోవడంతో పరంధామయ్య అహం గాయపడింది. తనంతటతానుగా నీరజని కోడలిగా చేసుకుంటాననడంలో తొందరపడ్డాడా అన్పించింది.

ఆరోజు అన్నపూర్ణమ్మ వరలక్ష్మికి అరిసెలు వండడానికి సాయం వచ్చినప్పుడు పరంధామయ్య, శేఖర్‌కి వచ్చిన సంబంధాల గురించి ఆవిడ దగ్గర ప్రస్తావించాడు.

"ఈ సంవత్సరం శేఖర్ పెళ్ళి చేసెయ్యాలనుకుంటున్నాను'' అన్నాడు.

ఆయన పరోక్షంగా శేఖరానికి నీరజనిచ్చే విషయంలో ఆవిడ అభిప్రాయాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాడని ఆవిడకి తెలుసు. ఆయనంతట ఆయనగా నీరజని కోడలిగా చేసుకుంటానని ముందుకి వచ్చినప్పుడు తను కనీసం అంగీకారాన్నో, అనంగీకారాన్నో తెలియచెయ్యకుండా వుండడం మర్యాద కాదనిపించింది.

"శేఖరం విషయంలో నీరజ అభిప్రాయాన్ని అడిగాను అన్నయ్యా! అది అప్పుడే పెళ్ళిచేసుకోదుట. అమెరికా వెళ్ళి ఇంకా పెద్ద చదువేదో చదవాలనుకుంటోందిట!"

"అమెరికా వెళ్తుందా?" పరంధామయ్యకి తింటున్న అరిసెలు చేదుగా అనిపించాయి.

'అమెరికా వెళ్ళి పెద్ద చదువులు చదివిన పిల్ల తన కొడుకుని చేసుకుంటుందా?'

"ఎందుకమ్మా ఆడపిల్లకి అంతంత చదువులు! ఎంత చదివినా ఆడపిల్లకి పెళ్ళి తప్పదు కదా!" అన్నాడు నచ్చచెబుతున్నట్టు.

"నేనూ అదే చెప్పాను. అది వినడంలేదు'' అందావిడ నిస్సహాయంగా. "మీరు చెప్పండి... మీ మాట వింటుందేమో?"

"ఏమని? నువ్వు అమెరికా వెళ్ళవద్దు. మా శేఖరాన్ని పెళ్ళిచేసుకో అనా?" అదోలా నవ్వుతూ అన్నాడాయన.

"శేఖరాన్ని కాకపోయినా, మరొకరినైనా చేసుకోవలసిందేగా అన్నయ్యా. అమెరికా వెళ్ళినవాళ్ళు ఒక్కళ్ళైనా ఈ దేశానికి తిరిగి రావడం చూస్తున్నామా. అక్కడేం అయిస్కాంతం వుందో వెళ్ళిన వాళ్ళు అక్కడే వుండిపోతున్నారు. నీరజ అమెరికా వెళ్తే తిరిగి వస్తుందనే నమ్మకం నాకేం లేదు. ఆయన పోయిన దగ్గరనుంచి దానిమీదే ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నాను. అది అమెరికా వెళ్ళిపోతే ఇక్కడ నేను ఒక్కర్తినీ ఎలా వుండాలి? మీరు నీరజని శేఖరానికి చేసుకుంటానన్నప్పుడు అమ్మాయి, అల్లుడు నాకళ్ళముందే వుంటారని వాళ్ళ అండన నా శేషజీవితం నిశ్చింతగా వెళ్ళదియ్యవచ్చని ఎన్ని ఊహించాను? అయినా దానికిదేం పిచ్చి? అంత దూరం వెళ్ళి ఇంకా చదవకపోతేనేం?" ఆవిడ కన్నీళ్ళతో గాద్గదికంగా అన్న మాటలకి పరంధామయ్య చలించిపోయాడు.

"చిన్నపిల్ల! తెలిసో, తెలియకో ఏదో అంటుంది. నేను నచ్చచెబుతాను. నువ్వు బెంగపడకు!" ఓదార్పుగా అన్నాడు.

నీరజ ఆయన మాట వింటుందనే నమ్మకం లేకపోయినా, ఆ మాటలు ఆవిడకెంతో ఓదార్పునిచ్చాయి.

★ ★ ★

పుస్తకం గుండెలమీద పెట్టుకునే పడుకున్న నీరజని చూసి ఆ పుస్తకం తీసింది అన్నపూర్ణమ్మ. పుస్తకంలోనుంచి జారిపడిన ఆ ఫొటోని చూసి ఆవిడ కళ్ళు విస్ఫారితాలయ్యాయి.

ఫొటోలో అందమైన ఆ యువకుడు నవ్వుతున్నాడు. ఆవిడ ఆశ్చర్యంగా అపనమ్మకంగా ప్రశాంతంగా నిద్రపోతున్న కూతురిని, ఫొటోని మార్చిమార్చి చూడసాగింది. క్రమేపీ ఆవిడ కళ్ళలోని ఆశ్చర్యం స్థానంలో అనుమానం మొలకెత్తింది. పుస్తకం పేజీల మధ్యలో కూతురు అపురూపంగా దాచుకున్న ఆ ఫొటో ఆవిడకి అనేక కథలు చెప్పింది. సవ్వడి చెయ్యకుండా ఫొటోని పుస్తకంలో పెట్టేసి ఆవిడ బయటకి వెళ్ళిపోయింది.

నీరజ నిజానికి నిద్రపోవడంలేదు. గౌతమ్‌తో తను గడపబోయే సుందరమైన భవిష్యత్తుని గురించి అందమైన ఊహలల్లుకుంటోంది. తల్లి గదిలోకి రావడం, గుండెల మీదున్న పుస్తకాన్ని తియ్యడం ఆమెకి తెలుసు. ఆవిడ గౌతమ్ ఫొటోని చూసిందని కూడా ఆమెకి తెలుసు. గౌతమ్ విషయం తల్లితో ఎలా చెప్పాలా అని మధనపడుతున్న ఆమెకి ఆవిడ అతని ఫొటోని చూడడంతో సమస్యకి పరిష్కారం దొరికినట్టే అనిపించింది.

బారెడు పొద్దెక్కాక లేచిన కూతురికి కాఫీ అందిస్తూ అడిగిందావిడ సూటిగా.

"రాత్రి నువ్వు చదువుతున్న పుస్తకంలో ఒక అబ్బాయి ఫొటోని చూశాను. అతనెవరు?"

"నీకు నచ్చాడా?" అతి మామూలుగా అడిగింది.

"నాకు నచ్చడమేమిటి?"

"అమ్మా! నీకీవిషయం ఎలా చెప్పాలా అని చాలారోజులుగా ఆలోచిస్తున్నాను. ఆ




ఫొటోలోని అబ్బాయి పేరు గౌతమ్. నాతోబాటు ఇంజనీరింగ్ చదివాడు. మేమిద్దరం ఒకర్ని ఒకరం ఇష్టపడుతున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం!"

"అతనెవరో, అతని కుటుంబం మంచి చెడ్డలేమిటో తెలుసుకోకుండా అన్నీ నిర్ణయించేసుకున్నావన్నమాట!"

"అన్నీ తెలుసుకునే నేను ఈ నిర్ణయానికి వచ్చాను''

"ఏమిటే నువ్వు తెలుసుకున్నది, అతని కులమేమిటో గోత్రమేమిటో'

"అతనిది మనకులమే''

"అయితే మాత్రం! అతను నిన్ను నిజంగా ఇష్టపడుతున్నాడో, నీ వెనకాల వున్న ఆస్తికోసం ఆశపడి చేసుకుంటానన్నాడో'

"మామయ్య మాత్రం! నీ ఆస్తికి ఏకైక వారసురాలిననేగా నన్ను కోడలిగా చేసుకుంటానని ఆయనంతట ఆయనగా ముందుకి వచ్చాడు''

"నోర్ముయ్! ఏమిటా గొంతు చించుకోడం! మామయ్య వింటే బాధపడతారు. ఆయనకేం డబ్బు తక్కువయిందనా, నీలాంటి రంభ దొరకదనా నీకోసం వెంపర్లాడడం? ఏదో తెలిసివున్న సంబంధం కదా అని అనుకున్నారంతే!" కోపంగా అంది ఆవిడ.

నీరజ నిర్లక్ష్యంగా తల తిప్పుకుంది. ఆవిడ అంతా నా కర్మ అని నుదురు కొట్టుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణమ్మ, నీరజల మధ్య జరిగిన వాగ్వివాదాన్ని నీరజని పెళ్ళికి వప్పించడానికి వచ్చిన పరంధామయ్య ఒక అక్షరం కూడా పొల్లుపోకుండా విన్నాడు.

"నీ ఆస్తికి ఏకైక వారసురాలిననేగా నన్ను కోడలిగా చేసుకుంటానని ఆయనంతట ఆయనగా ముందుకి వచ్చాడు'' అన్న నీరజ మాటలు ఆయన ముఖాన్ని ఎర్రబడేలా చేసాయి. ఆయన వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

నీరజని శేఖరానికి చేసుకోవాలనుకోడానికి ముఖ్యకారణం అదే అయినా తన మనసుని ఆమె చదివినట్టుగా చెప్పడంతో ఆయనకి సిగ్గేసింది.

"ఆయనకేం డబ్బు కొదవనా, నీలాంటి రంభ దొరకదనా నీకోసం వెంపర్లాడడం" అన్న అన్నపూర్ణమ్మ మాటలు ఆయన అహాన్ని సంతృప్తి పరిచాయి.

తను తలచుకుంటే నీరజ కంటే అందమైన అమ్మాయిని, స్థితిపరుల సంబంధాన్ని కొడుక్కి తేగలడు అనుకున్న ఆయన అన్నపూర్ణమ్మ, నీరజల సంభాషణను తను విన్న విషయం భార్యతో కూడా చెప్పలేదు. ఈ పరిస్థితిలో నీరజ కోరుకున్న అబ్బాయితో ఆమె పెళ్ళికి పెద్దరికం వహించడమే హుందాగా వుంటుందని నిర్ణయించుకున్నాడు.



**"ఆంటీ!"** అంటూ తలుపు తోసుకుని లోపలకి వచ్చిన పల్లవి మంచంమీద ఒళ్ళెరగని జ్వరంతో పడివున్న పార్వతమ్మని చూసి హడిలిపోయింది. గాభరాగా సుశీల

మ్మ ఇంటి తలుపు తట్టింది.

"ఆంటీకి బాగా జ్వరంగా వుందండీ!"

"పార్వతమ్మగారికా?" సుశీలమ్మ కూడా కంగారుపడిపోయింది.

"రాత్రి బాగానే వున్నారే! పద, చూద్దాం!" అంటూ ఆమెని అనుసరించింది.

"డాక్టరు దగ్గరకి తీసుకెళ్దాం. ఇది మామూలు జ్వరంలా లేదు'' అంది సుశీలమ్మ. ఆవిడ సహాయంతో పార్మతమ్మని డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళింది పల్లవి. డాక్టరు ఆవిడని పరీక్షించి ఫ్లూజ్వరం కావచ్చని గాభరాపడనవసరం లేదని మందులు రాసిచ్చారు.

తనకి కాఫీ కలిపి అందిస్తున్న పల్లవిని అభిమానంగా చూస్తూ అంది పార్వతమ్మ.

"అనవసరంగా గాభరాబడి హాస్పిటల్‌కి తీసుకెళ్ళావమ్మా! కాస్త జ్వరానికే ఇంత హడావుడా''

"కాస్త జ్వరమా! ఇంకా నయం! మీకసలు స్పృహేలేదు. నేనెంత గాభరాపడ్డానో"

నిర్జీవంగా నవ్వింది. "మీరెప్పుడు వచ్చారు వూరునుంచి''

"నిన్న... మిమ్మల్ని, ఉమని చూడాలనిపించింది.మిమ్మల్ని తీసుకుని ఉమా వాళ్ళింటికి వెళ్దాం అని వస్తే ఇదీ పరిస్థితి. ఉమ వాళ్ళిల్లు ఎక్కడో చెప్పండి. వెళ్ళి దాన్ని తీసుకొస్తాను. మీరు ఈ పరిస్థితిలో ఒంటరిగా వుండడం మంచిదికాదు''

"ఎందుకమ్మా చిన్న జ్వరానికే ఇంత హడావుడి. రేపీపాటికల్లా నయమయిపోతుంది''

"పోనీ ఉమా వాళ్ళింట్లో మిమ్మల్ని దింపుతాను. నాలుగు రోజులు అక్కడే వుండి, మీకు బాగా తేలికగా వున్నాక ఇక్కడకి వద్దురుగాని''

"అయ్యో! వద్దమ్మా!"

"మీకు అక్కడకి వెళ్ళడానికి మొహమాటమైతే ఉమనే ఇక్కడకి తీసుకొస్తాను''

"వద్దు... నన్ను ఈ స్థితిలో చూసి ఉమ తట్టుకోలేదు'' పార్వతమ్మ కళ్లలో నీళ్ళూరాయి.

పల్లవి క్షణం వూరుకుని అంది, "అయితే మా ఇంటికి రండి. జ్వరం తగ్గేవరకూ మా ఇంట్లో వుండండి''

"వద్దమ్మా! నాకేం ఫర్వాలేదు. డాక్టరు మందులిచ్చారుగా! తగ్గిపోతుంది''

"మా అమ్మే ఈ స్థితిలో వుంటే ఒంటరిగా వదిలేసి వెళ్తానా చెప్పండి'' ఎంతో ఆదరంగా అన్న ఈ మాటలకి చలించిపోయింది పార్వతమ్మ.

"రండి ఆంటీ'' ఆమెని లేవదీసింది పల్లవి.

★ ★ ★

"ఊళ్ళో తను వుండగా మిమ్మల్ని మా ఇంటికి తీసుకొచ్చినందుకు ఉమ బాధపడుతుందేమో! పల్లవిని పంపి ఉమతో చెప్పమంటాను'' అంది అరుంధతి.

"వద్దమ్మా! ఉమకి చెప్పవద్దు'' ఆమె ముఖంలో నీలినీడలను చూసి అరుంధతి అడిగింది.

"మీ వ్యక్తిగత విషయంలో జోక్యం చేసుకుంటున్నందుకు ఏమీ అనుకోకండి. ఉమని మీ ఇంటికి పంపడం మీ అల్లుడికి ఇష్టంలేదా?"

"అది నాకు తెలియదు కాని, నేను వాళ్ళింటికి వెళ్ళడం మాత్రం ఇష్టంలేదు''

"మీకెలా తెలుసు? ఉమ చెప్పిందా?" నిర్ఘాంతపోయింది అరుంధతి.

"ఆ విషయం ఉమకి తెలియదు'' అంటూ ఆవిడ ఉమ పెళ్ళయిన మరునాడు రుక్మిణి భాస్కర్‌తో అన్న మాటలని తను విన్న విషయం చెప్పింది.

"ఏ ఆధారమూ లేని నా బాధ్యత వాళ్లపై పడుతుందని వాళ్ళ భయం. అయినా నా దగ్గరేముందని నన్ను గౌరవించడానికి?" ఆవిడ పెదవులపై విరిగిన పాలలాంటి నవ్వు




కదలాడింది.

"అంటే! డబ్బుకి తప్ప మనిషికి విలువ నివ్వని సంస్కార హీనులన్నమాట వాళ్ళు! మీ స్థితిగతులేమిటో ఉమని పెళ్ళి చేసుకునే టప్పుడు తెలియవా? సంబంధం కలుపుకున్నప్పుడు కోటీశ్వరులయినా, పేదవాళ్ళయినా అత్తమామలని గౌరవించి తీరాలి. భార్యగా ఉమ పనికివస్తుందికాని, ఆమెకి జన్మనిచ్చిన తల్లి మీరు పనికి రాలేదా?" ఆవేశంగా అంది అరుంధతి.

"పోనిద్దురూ! వాళ్ళిద్దరూ సుఖంగా వుంటే చాలు! నాదేం వుంది? ఎలాగో బతుకునీడ్చేస్తాను''

"ఎన్నాళ్ళు? ఇవాళ జ్వరం వస్తేనే పట్టించుకోని మనుషులు మీ వృద్ధాప్యంలో మీకు ఆసరా అవుతారా?"

"నాలాంటివాళ్ళకోసం వృద్ధశరణాలయాలు వున్నాయమ్మా!" నిర్లిప్తంగా వుంది ఆవిడ స్వరం.

"అందుకే ఉమ పెళ్ళి విషయంలో తొందరపడలేదు. మిమ్మల్ని ఆదరించే వ్యక్తి దొరికే వరకు పెళ్లి చేసుకోనన్నది. మీరు తొందరపడి..."

"రేపోమాపో రాలిపోబోయే నా కోసం దాని బంగారు భవిష్యత్తుని నాశనం చేసుకుంటానంటే ఎలా ఒప్పుకోగలనమ్మా? మంచి సంబంధం దాన్ని వెతుక్కుంటూ వచ్చింది'' క్షణం ఆగి అంది. "ఈ విషయాలన్నీ మనసులో పెట్టుకోకండి అరుంధతమ్మా! పల్లవితో చెప్పకండి. వాళ్ళిద్దరూ ప్రాణస్నేహితులు. ఉమతో పల్లవి ఈ విషయం చెప్తే ఉమ బాధపడుతుంది''

"అలాగే! నాకామాత్రం తెలియదా? చెప్పనులెండి'' అంది అరుంధతి.

కాని, వాళ్ళిద్దరి సంభాషణ పల్లవి విందని ఆ ఇద్దరికీ తెలియదు.

★ ★ ★

వైజాగ్ వెళ్ళి గౌతమ్‌ని చూసివచ్చిన అన్నపూర్ణమ్మ, పరంధామయ్య నీరజ ఎంపిక సరైనదేనని సంతోషించారు. పరంధామయ్యకి నీరజ తన కొడుకుని తిరస్కరించిందని మొదట్లో వున్న ఆగ్రహం క్రమేపీ మంచులా కరిగిపోయింది. నీరజ మనసుపడిన వ్యక్తితో ఆమె పెళ్ళి జరిపించడం ధర్మం. ఇందులో నీరజ తప్పులేదు. ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా అనవసరపు ఆశలు కల్పించుకోవడం తన తప్పు అనుకున్నాడు.

పరంధామయ్య దంపతులు, అన్నపూర్ణమ్మ కూర్చుని పెళ్లికి ఎంతవుతుందో అంచనా కడుతుండగా వచ్చింది నీరజ.

"అమ్మా! ఇప్పుడే చెబుతున్నాను. పెళ్ళి ఏదో అయిందనిపించడం కాదు. గౌతమ్ తరపు బంధువులంతా బాగా వున్నవాళ్లు. వాళ్ళ స్టేటస్‌కి తగ్గట్టు ఘనంగా పెళ్లిచెయ్యాలి. అర్థమయ్యిందా?"

"అలాగేనమ్మా! నాకు మాత్రం పది మంది పిల్లలున్నారనా? నువ్వొక్కర్తివేగా? ఉన్నంతలో ఘనంగానే చేద్దాం!" అంది అన్నపూర్ణమ్మ.

"పెళ్లి కాకినాడలో చేస్తే బాగుంటుంది. ఇది పల్లెటూరు. వాళ్ళిక్కడకి వచ్చినా, మనం వాళ్ళకి తగినట్టు సౌకర్యాలు చెయ్యలేం" అన్నాడు పరంధామయ్య.

"కాకినాడ ఏమైనా పెద్ద సిటీనా? వైజాగ్‌లోనే చెయ్యండి''

నీరజ మాటలకి తెల్లబోయారు అందరూ.

"వైజాగ్‌లోనా? అక్కడ మనకి నా అనేవాళ్ళు ఎవరున్నారని? అంత దూరం వెళ్ళి ఏం చెయ్యగలం? పెళ్ళంటే మాటలా? ఎన్ని ఏర్పాట్లు చెయ్యాలి? వంటబ్రాహ్మణులని మాట్లాడాలి''

మధ్యలోనే అడ్డుపడింది నీరజ. "నీదంతా చాదస్తం! ఈ రోజులలో డబ్బు పడేస్తే దొరకనిదంటూ లేదు. భోజనాలు కేటరింగ్ వాళ్ళకో హోటల్‌కో ఆర్డరిస్తే సుఖంగా

మనం వేళకి వెళ్ళి భోజనం చేసిరావడమే!"

"కాని ఖర్చు కూడా రెట్టింపవుతుంది నీరజా!" పరంధామయ్య అన్నదానికి నీరజ నవ్వుతూ అంది.

"అయితే అవుతుంది. జీవితంలో ఒక్కసారి వచ్చే పెళ్ళికి ఆమాత్రం ఖర్చు పెట్టక పోతే ఎలా?"

పరంధామయ్య దంపతులు ముఖాలు చూసుకున్నారు.

★ ★ ★

"తాంబూలాలకే ముప్పైవేలకి పైగా ఖర్చయింది. పెళ్లికి ఎంతవుతుందో?" అంది అన్నపూర్ణమ్మ.

"రోలులో తలదూర్చాక రోకలి పోటుకి వెరుస్తామా?" నవ్వాడు పరంధామయ్య. "పెళ్ళివారేమీ మాట్లాడ్డం లేదు. నీరజ అన్నిటికీ పేచీ పెడుతోంది. ఏది ఎలా జరిపించాలో తనే నిర్ణయించుకుని అన్నీ జరిపించుకుంటోంది'' అనుకున్నాడు మనసులోనే.

"నీరజ చాలా మారిపోయింది'' అన్నాడు భార్యతో.

ఇంజనీరింగ్ చదవడానికి వైజాగ్ వెళ్ళడానికి ముందు నీరజ వేరు. ఇప్పటి నీరజ వేరు.

"అవును'' అంది వరలక్ష్మి. "అప్పట్లో నీరజ ఎంతో బాధ్యతగా వుండేది. తల్లి ఎక్కడ కష్టపడుతుందోనని ప్రతి పైసా ఎంతో జాగ్రత్తగా ఖర్చుపెట్టేది. ఇప్పుడు అలాగ కాదు. ఎందుకు ఖర్చు పెట్టవన్నట్టు మాట్లాడుతోంది!"

"నీరజని మన అబ్బాయికి చేసుకోలేదని మనమేమీ బాధపడనవసరంలేదు. ఆ పిల్ల కోరికలు తీర్చలేక మన పొలం కూడా అమ్ముకోవలసివచ్చేది'' అన్నాడాయన.

"వదినా!" అని పిలుస్తూ బయటే ఆగిపోయిన అన్నపూర్ణమ్మని చూసి ఇద్దరూ మాట్లాడ్డం ఆపి "లోపలకి రండి'' అని ఆహ్వానించారు.

"బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు తీసుకొస్తాను. నీరజకి బట్టలు, నగలు కొనాలికదా!"

"బ్యాంక్‌కి నువ్వెందుకమ్మా? నేను తెచ్చి పెట్టనూ?" అన్నాడాయన అభిమానంగా.

"ఫర్వాలేదులెండి అన్నయ్యా! నీరజ కూడా వస్తానంది. వెళ్తాను'' అని ఆవిడ బయటకి వచ్చేసింది.

నీరజ అసహనంగా తల్లికోసం నిరీక్షిస్తున్నదల్లా ఆవిడ వాళ్ళ ఇంట్లోంచి బయటికి రావడం చూసి "బ్యాంక్‌కి వెళ్ళినా వాళ్ళ కో చెప్పే వెళ్ళాలా?" అనుకుంది పళ్ళు కొరుకుతూ.

పొద్దుట ఆ విషయమ్మై తల్లీకూతుళ్ళ మధ్య వాగ్వివాదం చెలరేగింది.

"అంత డబ్బు ఇద్దరం వెళ్ళి తేవడం మంచిది కాదు. మామయ్యగారిని సాయం తీసికెళ్దాం" అంది అన్నపూర్ణమ్మ.

"ఏమీ అక్కర్లేదు. మన దగ్గర ఎంత డబ్బు వుందో మనం ఎంత విత్‌డ్రా చేసుకున్నామో ఆయనకి తెలియాలా?" అంది నీరజ ధుమధుమలాడుతూ.

ఆవిడ కూతురితో వాదించదలచుకోలేదు. ఆవిడని నీరజలోని ఎవరూ అక్కర్లేదనుకునే మనస్తత్వం భయపెడుతోంది.

"పట్టుచీరలు, నగలు ఇక్కడ కొనద్దు. మెడ్రాస్ వెళ్దాం" అంది నీరజ.

"మెడ్రాసా? అక్కడ మనకేం తెలుసని? ఎవరున్నారక్కడ?"

"ఎవరు వుండాలి? మనం వుండడానికి హొటల్స్ వున్నాయి. తిరగడానికి టాక్సీలున్నాయి. నోట్లో నాలుక, చేతిలో డబ్బు వుంటే క్షణాలలో ప్రపంచం చుట్టి రావచ్చు!"

"దగ్గరలో కాకినాడ వుంది. లేదంటే రాజమండ్రి వెళ్దాం! నీ ఫ్రెండ్ పల్లవి కూడా అక్కడే వుంది. ఆ అమ్మాయిని నీ పెళ్ళికి పిలిచినట్టు వుంటుంది. నీ బట్టలు కొనడం




అవుతుంది''

"అబ్బబ్బ! నీసోది ఆపుతావా? నీకు రావాలని లేకపోతే చెప్పు. నేను ఒక్కర్తినే మెడ్రాస్ వెళ్తాను. డబ్బు పడెయ్యి నాకు''

ఆవిడ కూతురి మొండితనాన్ని బాగా ఎరిగి వున్నదవడంవలన గత్యంతరం లేక ఆమె ఇష్టానికి తలవంచింది. నీరజ పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళేసరికి శారీరకంగా, ఆర్ధి కంగా కూడా అలిసిపోయింది అన్నపూర్ణ మ్మ.

★ ★ ★

పల్లవిని కౌగలించుకున్నంతపని చేసింది ఉమ. "ఎన్నాళ్ళకెన్నాళ్ళకు ఇలా చిక్కిపో యావేమిటే?"

"నా సంగతి సరే. నీ సంగతేమిటి? కొత్త సంసారం ఎలా వుంది?"

"కొత్త సంసారంకదా! బాగానే వుంది'' నవ్వింది ఉమ.

"మీరంతా వూరునుంచి ఎప్పుడొచ్చా రు?"

"రెండు రోజులయింది. వచ్చిన దగ్గర నుంచి నిన్నూ, నిన్ను వరించిన రాజకుమా రుడిని చూడాలని ఎంతగానో అనుకుంటే ఇదుగో ఇప్పటికి తీరిక దొరికింది''

"ఆయన బ్యాంక్‌కి వెళ్ళారు. సాయంకా లందాకా రారు''

"పోనీ మీ పెళ్లి ఫొటోలయినా చూపించు. ఆయన్ని చూడ్డానికి మళ్ళీ వస్తానులే!"

"సరే!" ఉమ నవ్వుతూ ఆల్బమ్ అందించింది. "రాజకుమారుడు కాకపోయి నా, మీ ఆయన బాగానే వున్నాడులే. పేరే మిటి, భాస్కర్ కదూ?"

ఉమ నవ్వింది. "నువ్వు కాస్త కూడా మారలేదే!"

"మారలేదా? కాస్త ఒళ్ళొచ్చిందనుకుంటా నే'

"నీ మొహంలే! ఆ హాస్టల్ తిండితో చిక్కి సగం అయ్యావు!" అంది పెద్దరికాన్ని అభిన యిస్తూ.

ఇద్దరూ ఫక్కున నవ్వుకున్నారు. దగ్గరగా వేసివున్న తలుపులని తోసుకుంటూ రుక్మిణి వచ్చింది.

"మాటలు విన్పిస్తుంటే మీ అమ్మగారు వచ్చారనుకున్నాను''

"తను పల్లవి! నా ఫ్రెండ్! మా ఆడపడు చు'' పరస్పరం పరిచయం చేసింది ఉమ.

"అరుంధతిగారమ్మాయివి కదూ? మీ అమ్మగారు ఉమ పెళ్లిలో నీ గురించి చెప్పా రు. ఉమా! నీ ఫ్రెండ్‌కి కాఫీ, టిఫిన్‌లాంటిది ఏమైనా ఇచ్చావా? ఊర్కెనే కబుర్లతో కడుపు నింపేస్తావా?"

"నేనిప్పుడే వచ్చానండి. కాఫీ ఇప్పుడు తాగను'' అంది పల్లవి. పల్లవి, ఉమ కబు ర్లలో పడిపోయారు. రుక్మిణి కాస్సేపు వాళ్ళ దగ్గరే కూర్చుని తర్వాత లేస్తూ అంది.

"చాలాకాలం తరువాత కలుసుకున్న స్నే హితులు. మీ మధ్య నేనెందుకు? మాట్లాడు కోండి'' అంటూ వెళ్ళిపోయింది.

"ఈవిడేమిటి ఉమా! చెప్పాపెట్టకుండా సుడిగాలిలా వచ్చిపడింది! రోజూ వస్తుందా?"

"ఆc! ఇంచుమించు ప్రతీరోజూ వస్తారు. మావారు చాలారోజులు ఆవిడ దగ్గరే వున్నా రు. తమ్ముడంటే ఆవిడకి చాలా అభి మానం"

"కొంతమంది మనుషులు అభిమానాలు, బాంధవ్యాలు వాళ్ళకే పరిమితం అనుకుంటా రు. ఎదుటివాళ్ళ దగ్గర కొచ్చేప్పటికి అవేవీ గుర్తురావు. కొంతకాలం తన దగ్గరవున్న తమ్ముడింటికి స్వతంత్రంగా వచ్చే ఆవిడ, జన్మనిచ్చి ఎంతో కష్టపడి నిన్ను పెంచి పెద్దచేసిన మీ అమ్మగారు నిన్ను చూడ్డానికి రావడం సహించలేదు. ఎంత దారుణం?" అనుకున్న పల్లవి పైకి మాత్రం ఇలా అడి గింది.

"మీ అమ్మగారిని ఆదరించే మనిషి దొరికేవరకు పెళ్ళి చేసుకోనన్న నీ శపథం నెరవేర్చుకున్నావా? మీ ఆయన ఏమంటాడు? అతనికి తల్లీతండ్రీ లేరుకదా, మీ అమ్మగారిని తల్లిలా ఆదరిస్తాడేమోలే!"

ఉమ ముఖం గంభీరమయింది.

"ఎన్నో అనుకుంటాం. ఏవీ జరగవు పల్లవీ! పెళ్ళికి ముందు ఆయన్ని కలుసుకుని మా అమ్మని ఆదరించగలిగే సహృదయుడైతేనే పెళ్లి చేసుకుంటానని చెబుతానన్నాను. అమ్మ ఒప్పుకోలేదు. అతను నా షరతుకి అంగీకరించకపోతే పెళ్లి మానుకుంటావా అని కేకలేసింది. ఆవిడముందున్న పెద్ద సమస్య నా పెళ్ళి. పైసా కట్నం కూడా కోరకుండా నన్ను చేసుకోడానికి ముందుకి వచ్చిన అతన్ని నిరాకరించడం మూర్ఖత్వం అంది అమ్మ. ఆవిడ పట్టుదలకి తలవంచక తప్పలేదు. ఆయన మంచివారు. నన్ను ప్రేమగా చూసుకుంటారు''

"అది సరే, మీ అమ్మగారిని గౌరవంగానే చూస్తారా?"

"మా అమ్మ కడుపు కట్టుకుని అప్పులు తీరుస్తుంటే నేనిక్కడ సుఖంగా ఎలా వుండగలను చెప్పు? ఆ అప్పు తీరితే ఆవిడ రెండుపూటలా కడుపునిండా భోజనం చేస్తుంది. మా అమ్మ పడుతున్న కష్టం గురించి ఆయనతో చెప్పాను. విని మౌనంగా వూరుకున్నారు. మరి ఆయన మనసులో ఏముందో తెలియదు."

"ఆయన తాలూకు రిమోట్ కంట్రోల్ మీ ఆడబడుచు చేతిలో వుంటే! పాపం! ఆయనేం మాట్లాడతారు?"

"ఏమిటీ!" ఉలిక్కిపడింది ఉమ.

"ఏం లేదులే' పల్లవి తను నోరుజారినందుకు నాలుక కరచుకుంది.

"అయినా తెలుసుకుని ఏంచేస్తావ్?"

"నీకేదో తెలిసింది. అదేమిటో చెప్పు"

"ముందిది చెప్పు! మీ అమ్మగారు ఈ నెలరోజులలోను నిన్ను చూడ్డానికి ఒక్కసారే ఎందుకొచ్చారు?"

"అమ్మకి పగలంతా సంగీతం పాఠాలతో ఖాళీ వుండదు పల్లవీ!"

"కాదు... ఆవిడ మీ ఇంటికి రావడం మీ ఆడబడుచుకి ఇష్టం లేదు కాబట్టి. మీ ఆయన సంగతి నాకు తెలియదు''

"ఏమిటీ, నువ్వనేది?" షాకింగ్‌గా వుంది ఆమె స్వరం. పల్లవి ఉమ పెళ్ళయిన మరునాడు రుక్మిణి పార్వతమ్మగారి గురించి భాస్కర్‌తో అన్న మాటలు చెప్పింది.

"ఈ విషయం ఆంటీ మా అమ్మతో చెబుతుంటే విన్నాను''

ఉమ వెక్కివెక్కి ఏడుస్తోంది.

"క్షమించు ఉమా! నేను ఈ విషయాన్ని నిన్ను బాధపెట్టాలనో మీ ఆడబడుచుపట్ల నీకున్న గౌరవాన్ని పాడుచెయ్యాలనో చెప్పడంలేదు. మీ అమ్మగారు ఎంత ఆత్మాభిమానం కల మనిషి! నాలుగురోజుల కిందట ఒళ్లు తెలియని జ్వరంతో పడివున్న ఆవిడ నిన్ను తీసుకొస్తానన్నా, మీ ఇంటికి ఆవిడని తీసుకొస్తానన్నా వద్దన్నారు''

"అమ్మకి జ్వరమా?" దిగ్గున తల ఎత్తింది.

"ఇప్పుడు తగ్గింది. ప్రస్తుతం మా ఇంట్లోనే వున్నారు''

"మీ ఇంట్లోనా?"

"ఆవిడ మా ఇంటికి రావడానికి కూడా అంగీకరించలేదు. ఒకరకంగా నేనే బలవంత పెట్టి తీసుకెళ్లాను''

"కన్నకూతురిని నేను వుండీ అమ్మకేమీ చెయ్యలేకపోయాను పల్లవీ!" ఉమ హృదయవిదారకంగా ఏడుస్తోంది.

"చెయ్యవలసిన రోజులు ముందు ముందు చాలా వున్నాయి. ఈలోగా నీ భర్తగారు అతని అక్క చెప్పుడు మాటలతో పూర్తిగా చెడిపోకుండా చూడు. తన తల్లికి, భార్య తల్లికి ఎలాంటి బేధం లేదని తెలియచె





ప్పు"

"ముందు అమ్మని చూడాలి. పద, వెళ్దాం"

"మీ అమ్మగారిని చూడవలసింది నువ్వొక్కర్తివే కాదు. నీ భర్తతో కలిసి సాయంకాలం రా''

"ఆయన వస్తారంటావా?"

"మనిషైతే వస్తాడు'' పదునుగా అంది పల్లవి.

ఉమ నిస్తేజంగా కూర్చుండిపోయింది. పల్లవి వెళ్ళడానికి ఉద్యుక్తురాలవుతూ అంది.

"ఓ.కె. సాయంకాలం కలుసుకుందాం. ఒకవేళ అతను రాకపోతే, నువ్వురా!"

ఆమె "వస్తాను'' అంది బలహీనంగా.

★ ★ ★

సాయంకాలం భాస్కర్ వచ్చేప్పటికి ఉమ తయారైవుంది.

"ఏమిటి విశేషం? మనం 'టైటానిక్' సినిమాకి వెళ్లబోతున్నామని నీకు కల వచ్చిందా?" హుషారుగా అడిగాడతను.

"మా అమ్మని చూడ్డానికి వెళ్దాం. సినిమాకి వద్దు''

"ఇంకా నయం! గంటసేపు క్యూలో నిలబడి టిక్కెట్లు సంపాదిస్తే సినిమాకి రానంటావేమిటి?"

"మా అమ్మకి జ్వరంగా వుంది. పల్లవి వాళ్ళింట్లో వుంది!"

"పల్లవి వాళ్లింట్లోనేగా! ఏమీ ఫర్వాలేదు. వాళ్ళు ఆవిడని బాగానే చూసుకుంటారు''

"కన్నకూతురిని నేను వుండీ మా అమ్మ దిక్కులేనిదానిలా వాళ్లింట్లో వుంది. వాళ్ళు కూడా ఆదరించకపోతే ఆవిడ ఏమయ్యేది?"

"ఇంతకీ నువ్వు సినిమాకి వస్తావా, రావా?" అసహనంగా వుంది భాస్కర్ స్వరం.

"మా అమ్మగారికి జ్వరంగా వుంటే ఆవిడని ఆవిడ కర్మానికి వదిలేసి మీరు సినిమా చూస్తారా?" అని అడగాలన్నంత ఆవేశం! మళ్ళీ ఏదో సంకోచం! పెళ్ళయి నెలరోజులు కాకుండానే అతన్ని ఎదిరిస్తే అనవసరంగా గొడవవుతుందేమో, అతని స్వభావం ఎలాంటిదో తెలియదు.

"నాకు సినిమా చూసే మూడ్ లేదు. మీరు వెళ్ళండి. నేను మా అమ్మని చూసివస్తాను'' అంది.

భాస్కర్ బయటికి వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేశాడు. తన తల్లికి జ్వరమని తెలిసీ అతను ఆదుర్దా ప్రకటించకపోవడం కనీసం ఆవిడని చూడ్డానికి రాకపోవడం ఉమకి ఆశ్చర్యంతో బాటు బాధని కలుగచేశాయి. ఆమె ఇంటికి తాళంవేసి బయలుదేరింది.

★ ★ ★

"మీ ఆయన రాలేదా?" వాకిట్లోనే ఎదురుపడిన పల్లవి అడిగింది.

"ఆయనకి బ్యాంక్‌లో పెండింగ్ వర్క్ వుందట. వీలుకాదని చెప్పి మళ్ళీ బ్యాంక్‌కి వెళ్ళిపోయారు'' చెప్పింది ఉమ తడుముకోకుండా. మ్లానమైన ఆమె ముఖాన్ని చూసి పల్లవి వాళ్ళ మధ్య ఏం జరిగివుంటుందో ఊహించింది. నీరసంతో తూలి పోతున్న తల్లిని చూసి బావురుమంది ఉమ. "ఇలాగైపోయావేమిటమ్మా? అసలు నీకు జ్వరం వచ్చిన సంగతి నాకు చెప్పలేదెందుకని? నేను పరాయిదాన్నయిపోయానా?"

"కాస్త జ్వరానికే హడావుడి చెయ్యడమెందుకమ్మా? కొత్తకాపురం. నువ్వు వచ్చి నాకు చాకిరీ చేస్తూ ఇక్కడవుంటే అల్లుడికి కోపం వస్తుందని భయపడ్డాను. అయినా, పల్లవివుంది కదా! నన్ను జాగ్రత్తగా కంటికి రెప్పలా చూసుకుంది''

ఉమకి దుఃఖం ఆగడంలేదు. 'రుక్మిణి తన తల్లి గురించి అవమాన పూర్వకంగా అన్నమాటలు మనసులో ముల్లులా గుచ్చుకున్నాయి. ఆమె పెద్దగా చదువుకోలేదు. చాదస్తంగా ఏదో అందే అనుకున్నా భాస్కర్! అతను చేసిందేమిటి? తల్లికి జ్వరం



వచ్చిందని తెలిసినా కనీసం చూడ్డానికి రాకుండా సినిమాకి వెళ్తాడా?'

పల్లవి ఉమని తన గదిలోకి తీసుకెళ్ళింది. "ఏమంటాడు మీ ఆయన? మీ అమ్మగారిని చూడ్డానికి రానన్నాడా?"

"అలా అని అనలేదు. కానీ, సినిమాకి వెళ్ళారు'' అంటూ ఆమె జరిగినదంతా చెప్పింది.

పల్లవి ఆశ్చర్యంగా చూసింది. "అదే అతని తల్లి ఇలాంటి స్థితిలో వుంటే ఆవిడనలా వదిలేస్తాడా?"

"అదే అడుగుదామనుకున్నాను. కానీ, ధైర్యం చాలలేదు''

"నువ్వుత్త పిరికిదానివే!"

"చుక్కానిలేని పడవలాంటివే మాలాంటి వాళ్ళ జీవితాలు! భవిష్యత్తుపై ఆశలుండవు మాకు. భయం తప్ప ప్రణాళిక అసలే వుండదు. నా జీవితాన్ని ఉదాహరణగా తీసుకుని నువ్వయినా జాగ్రత్తపడు. నువ్వా మీ అమ్మగారికి ఒక్కర్తే అమ్మాయివిగా! అయినా లక్షలకొద్దీ ఆస్తికి ఏకైక వారసురాలివి. నీతోబాటు నీ తల్లిదండ్రులని కూడా నెత్తినపెట్టుకుని పూజిస్తాడులే నిన్ను పెళ్ళి చేసుకున్నవాడు''

"డబ్బు వుంటే మరో సమస్య వస్తుంది'' అంది పల్లవి ఆలోచిస్తూ.

"ఇంతకీ మీ ఆయన సినిమానుంచి ఇలా వచ్చి మీ అమ్మగారిని చూసి, నిన్ను తనతో ఇంటికి తీసుకెళ్ళవచ్చుగా?"

"ఏమో నేను అడగలేదు. నేను ఇప్పుడు ఇంటికి వెళ్ళి రేపుపొద్దుటే వచ్చి అమ్మని నాతో తీసుకెళ్తాను''

"మీ ఇంటికా?"

"కాదు. మా అమ్మ మా ఇంటికి రాదు. ఆవిడని రమ్మని నాలుగు రోజులుంచుకునే స్వతంత్రం నాకూలేదు. అమ్మ వుంటున్న ఇంటికే. ఒక వారం రోజులు ఆవిడ దగ్గరే వుండి, ఆవిడ బాగా కోలుకునే దాకా వండిపెడతాను''

"ఇక్కడ బాగానే వుందికదే! అక్కడికెందుకు?"

"అమ్మకి నాకు చేతనైన సేవ చేశాననే తృప్తి కోసం" ఉమ కళ్ళల్లో నీళ్ళు కదలాడాయి.

"నీ ఇష్టం" అంది పల్లవి.

ఉమని పల్లవి ఇంటిదగ్గర దింపేసరికి భాస్కర్ అప్పటికే ఇంటికి వచ్చి టి.వి. చూస్తున్నాడు. తనని దింపి వెళ్లబోతున్న పల్లవితో అంది.

"ఆయన ఇంట్లోనే వున్నారే?"

"మరోసారి చూస్తానులే!" అందామె కారు బ్యాక్ చేస్తూ. నిజానికి ఆమెకి భాస్కర్‌పై ఇంట్రెస్ట్ పోయింది. ఉమని కోరి పెళ్ళి చేసుకున్న అతనిపై ఒక రకమైన గౌరవ భావం వుండేది ఆమెకి. ఆమె దృష్టిలో అతనొక హీరో. కాని ఇప్పుడాభావం మటుమాయమైపోయింది.

ఉమ రావడం చూసి అతను టి.వి. ఆఫ్ చేస్తూ అన్నాడు.

"వచ్చావా? అమ్మయ్య! నాకు చాలా ఆకలిగా వుంది. అన్నంపెట్టు'' అన్నాడు.

అప్పుడయినా అతను తన తల్లి అనారోగ్య విషయం అడుగుతాడనుకున్న ఆమెకి నిరాశే ఎదురయింది. అన్నింటికంటే ఆమెకి అంతులేని అసహ్యాన్ని కలగచేసినది అతను భోజనానంతరం ఆరాత్రి తన నుంచి శారీరక సుఖాన్ని కోరడం.

తెల్లవారింది. ఉమ మౌనంగా తన పనులు చేసుకుంటోంది. తన ధోరణి ఆమెకి ఆగ్రహాన్ని కలుగచేస్తోందని భాస్కర్‌కి తెలుసు. కాని తను ఆమె తల్లి అనారోగ్య విషయాన్ని అడిగితే ఆమె బరస్టయిపోతుంది. ఆవిడని తమ ఇంటికి తీసుకురాక తప్పదు. ఒకసారి తీసుకొస్తే మళ్ళీ మళ్ళీ తీసుకురావాలి. ఇంక ఆవిడ శాశ్వతంగా తమ దగ్గర సెటిలయిపోవడం తప్పదు.




అక్క చెప్పిన మాటలు మనసులో మెదులు తుంటే అతనికి అత్తగారిని ఒకపూట భోజనానికి పిలవడానికే భయమేస్తోంది.

ఉమ అతనికి కాఫీ ఇస్తూ చెప్పింది, "నేను నాలుగురోజులు మా అమ్మదగ్గర వుండివస్తాను''

"నీ ఇష్టం" పొడిగా అన్నాడు.

ఉమకి అతను క్లుప్తంగా మాట్లాడుతున్న ధోరణి ఆగ్రహాన్ని, అంతకుమించి బాధని కలుగచేస్తోంది. ఆమె చేతిసంచీలో అతనికెదురుగా రెండు చీరలు పెట్టుకుంది.

"నేను వెళ్తున్నాను'' అంది గోడకి చెప్పినట్టు.

భాస్కర్ జేబులోనుంచి పదిరూపాయల కాగితం తీశాడు.

"రిక్షాలో వెళ్ళు''

"అక్కర్లేదు. నేను నడిచి వెళ్తాను'' ఆమె అతనివైపు చూడకుండానే ముందుకు నడిచింది. భాస్కర్‌కి చాలా బాధనిపించింది. కానీ తను కాస్త మెత్తబడితే అత్తగారు శాశ్వతంగా ఇక్కడే సెటిలవుతుంది. అతను లేచి బ్యాంక్‌కి వెళ్ళడానికి తయారవసాగాడు.

రోడ్డుమీద వారగా నడుస్తున్న ఉమకి చుట్టూ వున్న పరిసరాలన్నీ కళ్ళలో నిండిన నీళ్ళకి అలుక్కుపోయినట్టు కన్పిస్తున్నాయి. భర్త ఆంతర్యమేమిటో ఆమెకి అర్థమవుతూనే వుంది. తన తల్లిని గురించి అతనేమనుకుంటున్నాడో ఊహిస్తే ఆమెకి సిగ్గుతో ప్రాణం పోతున్నట్టన్పిస్తోంది. తనతనికి భార్యగా పనికివస్తుంది! కానీ తన తల్లిని కనీసం పలుకరించే మానవత్వం లేదు. ఏమిటితని మనస్తత్వం?

★ ★ ★

భాస్కర్ బ్యాంక్‌కి వెళ్తూ దారిలో రుక్మిణి దగ్గరకి వెళ్ళాడు.

"వంటయిందా? నాకు భోజనంపెట్టు''

"అదేం? ఉమ లేదా?"

"లేదు. వాళ్ళమ్మగారికి జ్వరంగా వుందని నాలుగు రోజులు అక్కడే వుంటానని వెళ్ళింది''

"బాగుంది'' దీర్ఘం తీస్తూ అంది. "నువ్వు వెళ్ళమన్నావా? తనే వెళ్తానందా?"

"తనే వెళ్తానంది''

"నువ్వు వెళ్ళి ఆవిడని చూసొచ్చావా?"

"ఎందుకిన్ని ప్రశ్నలు వేస్తున్నావ్?" చిరాగ్గా అడిగాడు... తను అత్తగారిని కనీసం చూడ్డానికైనా వెళ్ళలేకపోయాడే అనే గిల్టీ ఫీలింగ్‌తో బాధపడుతున్న భాస్కర్.

"నువ్వు వెళ్తే ఆవిడని అలా ఒంటరిగా వదిలేసి వస్తే నలుగురూ ఏమైనా అనుకుంటారు''

"వెళ్ళకపోయినా అనుకుంటారు''.

"ఏమీ అనుకోరు. మహా అయితే ఆవిడ పెళ్ళిలో ఏదో మర్యాద లోటు చేసింది. అందుకే అల్లుడు అలిగి చూడ్డానికి రావడం లేదు అనుకుంటారు. ఇప్పుడు నువ్వు వెళ్తే ఆవిడకి వైద్యం చేయించడం మాట అటుంచి, ఆవిడని తెచ్చి నీ ఇంట్లో వుంచుకోవలసి వస్తుంది. ఒకసారి అలవాటయితే అది పీకకి చుట్టుకుంటుంది. మా పక్కింట్లో భాగోతాన్ని చూడడంలేదూ? రోజూ ఆవిడ మొగుడితో యుద్ధమే! ఆయన కన్నతల్లిని తెచ్చి పెట్టుకున్నందుకు ఆవిడ తన తల్లిని తెచ్చి పెట్టుకుంది. ఆయన తల్లికి ఒక చీర కొంటే ఆవిడ రెండుచీరలు కొంటుంది తన తల్లికి. అదుగో... మళ్ళీ ఏదో యుద్ధం మొదలయింది. నీ చెవులతో నువ్వే విను'' అంది రుక్మిణి.

భాస్కర్ పక్క ఇంట్లోనుంచి తారాస్థాయిలో వినవస్తున్న అరుపులని అప్రయత్నంగానే వినసాగాడు.

"ఇప్పుడు మీ అమ్మగారిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళి టెస్ట్‌లవీ చేయించడం దేనికి? ఆవిడ బాగానే వున్నారుగా?"

"మా అమ్మ దుక్కలా వుందా? దెయ్యపు

కంటికి పేలాపుగింజ పెద్దదని ఆవిడ మీ కళ్ళకి ఆరోగ్యంగా కన్పిస్తోందా? మీ అమ్మగారికి కాస్త ఆయాసం వస్తే హాస్పిటల్‌కి తీసుకెళ్ళి ఇ.సి.జి., ఎక్స్‌రే అంటూ ఎంత హడావుడి చేశారు? ఏం మీ అమ్మలాంటిది కాదా మా అమ్మ?"

"నాకలాంటి భేదంలేదు. మా అమ్మనొకలా, మీ అమ్మనొకలా చూడ్డం నాకు చేతకాదు. తగినంత అనారోగ్యం వుంటే ఎలాగూ తప్పదు. ఇప్పుడు అనవసరపు ఖర్చు ఎందుకని?"

"అదే! ఆ అనవసరం అనే మాటే వద్దు. టెస్ట్‌లు అవసరమో కాదో నిర్ణయించవలసింది డాక్టర్లు. మీరు కాదు''

ఇరుగు పొరుగు వింటారనే స్పృహేనా లేకుండా గట్టిగా రౌద్రంగా అరుస్తోందావిడ.

వింటున్న భాస్కర్‌కి మతిపోయింది.

"అబ్బ! ఏం నోరు! ఏం మనిషి?" అప్రయత్నంగా పైకే అనేశాడు.

"ఇవాళ ఏం చూశావులే! ఆయన తల్లిని తీసుకొచ్చిన నాడు, చూడాలి. ఆవిడ శివమెత్తినట్టు వూగిపోయింది''

"సరేగానీ, నాకు భోజనం పెట్టు. బ్యాంక్‌కి వెళ్ళాలి''

"ఆయన స్నానం చేస్తున్నారు. రానియ్యి. ఇద్దరికీ కలిపి పెడతాను''

జగన్నాథం హడావుడిగా తడి ఒంటిమీదే బట్టలు వేసుకుంటూ అతన్ని పలుకరించాడు.

"ఏవోయ్, ఏమిటీ హఠాత్ ఆగమనం?"

"ఉమ వాళ్ళమ్మగారి దగ్గర నాలుగు రోజులుండి వస్తానని వెళ్ళింది. తను వచ్చేదాకా మీ ఇంట్లో వారం చెప్పుకుందామని వచ్చాను'' తమాషాగా అన్నాడు.

"ఛ! ఏం మాటలోయ్ అవి! వారం ఏమిటి? అసలు అక్కడ ఒంటరిగా వుండడం ఎందుకు? ఉమ వచ్చేదాకా ఇక్కడే వుండు''

"అలా చెయ్యరా'' అంది రుక్మిణి.

"అలాగేలే! సాయంకాలం నా బట్టలవీ తెచ్చుకుంటాను'' అన్నాడు.

★ ★ ★

నీరజకి గౌతమ్ సాహచర్యంతో రోజులు క్షణాల్లా దొర్లిపోతున్నాయి. ప్రేమగా చూసుకునే భర్త, తల్లికంటే ఎక్కువగా చూసుకుంటున్న అత్తగారు, కారు, మేడ, ఒంటినిండా నగలు, ఈ ప్రపంచంలో తనంత అదృష్టవంతురాలు మరెవరూ వుండరు!

ఆ రాత్రి అతని గుండెలపై తలానించి పడుకుని, అతని పెదవులపై వేలితో రాస్తూ గోముగా అడిగింది.

"మనం అమెరికా ఎప్పుడు వెళ్దాం గౌతమ్?"

"అమెరికానా? ఎందుకు?"

"పెళ్ళికి ముందు నువ్వే చెప్పావుగా? పెళ్ళయ్యాక మనం అమెరికా వెళ్ళి ఎమ్.ఎస్. చేద్దామని?"

"అదా! అన్నాను. కానీ ఇప్పుడు ఆ ఆలోచనే లేదు. మనమే స్వంతంగా ఒక ఇండస్ట్రీ పెడదాం!"

"ఇండస్ట్రీయా?"

"అవును. అమెరికా వెళ్ళినా, అక్కడకూడా ఎవరిదగ్గరో చాకిరీ చెయ్యవలసిందే! అక్కడంతా స్పీడ్... మెకానికల్ లైఫ్! ఇక్కడే మనమో ఇండస్ట్రీ పెడితే లాభమో, నష్టమో మనమే భరించవచ్చు''

"గుడ్ అయిడియా!" నీరజ మనసులో అమెరికా వెళ్ళడంలేదనే బాధ వున్నా భర్తతో ఏకీభవించాలి కాబట్టి పైకి అలా అంది.

మరునాడు ఉదయం కాఫీ తాగుతుండగా, అమరేశ్వరి అంది.

"ఇవాళ ఒక గంట బజారులో పని వుందిరా!"

"దేనికమ్మా?" అడిగాడతను.

"మరి నాలుగు రోజులలో ఆషాఢమాసం! తరువాత వచ్చేది శ్రావణమాసం! నీరజకి





వరలక్ష్మి వ్రతానికి పట్టుచీర, తనకి నచ్చిన నగలు కొనాలి!"

"అలాగేలేమ్మా సాయంకాలం వెళ్దాం"

మురిపెంగా అత్తగారి వంక చూసింది నీరజ.

"అన్నట్టు నిన్న క్లబ్బులో సుమిత్రాదేవిగారు కనిపించారురా! వాళ్ళ అల్లుడికి ఆషాఢపట్టీగా పాతికవేల రూపాయలు, సూటు ఇస్తున్నారుట"

"ఆహా..." కాఫీ కప్పు బల్లమీద పెట్టి లేస్తూ అన్నాడు.

"ఇంతకీ ఆషాఢమాసం అని నీరజ పుట్టింటికి వెళ్ళిపోతుందా?"

"నాకలాంటి చాదస్తాలేం లేవురా! తనకి వుంటే తను వెళ్తుంది''

నీరజ నవ్వి వూరుకుంది. "అమ్మకి ఉత్తరం వ్రాయాలి'' అనుకుంది.

నీరజ నుంచి వచ్చిన ఆ ఉత్తరాన్ని చదివి మ్రాన్పడిపోయి కూర్చుంది అన్నపూర్ణమ్మ.

"ఎక్కడ నుంచి వదినా ఆ ఉత్తరం?" మ్లానమైన ఆమె ముఖాన్ని చూసి కీడు శంకించిన వరలక్ష్మి అడిగింది.

"నీరజ రాసింది''

"కులాసాగా వుందా? ఆషాఢమాసానికి వస్తుందా?"

"ఆషాఢపట్టింపు వాళ్లత్తగారికి లేదుట. అందుకని రానని రాసింది. కాని ఆషాఢపట్టీగా వాళ్లాయనకి ఖరీదైన బట్టలు కొనేందుకు పాతికవేల రూపాయలు ఇవ్వాలని రాసింది."

"పాతికవేలే' వరలక్ష్మి కళ్ళు పెద్దవయ్యాయి.

"అలా ఇవ్వాలని వాళ్ళు అడిగారో, లేక దీని పెత్తనమో నాకు తెలియదు. పెళ్ళికే చాలా అయింది. ఇప్పుడు ఆషాఢపట్టీ! తరువాత తొలిపండగ. ఆ తరువాత సంక్రాంతి ఇలా వేలకి వేలు పోస్తూ పోతే ఇక మిగిలేదేముంది? ఇక ఊడ్పులు మొదలయితే కూలి ఖర్చు, తరువాత చేనుకి ఎరువులు..." నిస్సహాయంగా వుందామె స్వరం.

"నిజంగా వాళ్ళు అడిగారంటారా వదినా? కట్నమే వద్దన్న వాళ్ళు ఈ లాంఛనాలన్నీ జరిపించమంటారా?"

"వాళ్ళు అడగక్కర్లేదు. నీరజే జరిపించాలనుకున్నా, ఆశ్చర్యపడక్కర్లేదు. పెళ్ళికి చూశావుగా, రూపాయి ఖర్చుపెట్టే చోట పదిరూపాయలు ఖర్చు చేయించింది''

"నీరజని రమ్మని రాసి గట్టిగా మందలించండి''

"అది వింటుందనే నమ్మకం లేదు. ఇంజనీరింగ్ చదువుతానంటే ఒక్కర్తే పిల్లకదా అని సరే అన్నాను. డొనేషన్ లేకుండా సీటు వచ్చినా హాస్టల్‌కి, బట్టలకి చాలా ఖర్చయింది. మధ్యమధ్య ఫ్రెండ్స్‌తో టూర్లు, పార్టీలు అంటూ అడిగినప్పుడల్లా డబ్బు ఇస్తూనే వున్నాను. కట్నం లేదని సంబరమే కానీ, పెళ్లికి రెట్టింపు ఖర్చయింది. ఇంక పండుగలకి, ఆషాఢమాసం అని ఇలా వేలకి వేలు ఖర్చు చేస్తే ఎలాగ? ఏడాదికో, రెండేళ్ళకో పిల్లలు పుడితే సీమంతం అని, బారసాల అని ఎంత ఖర్చు? ఈ లెక్కన నేను భూమి అమ్ముకోవలసిందే''

"అందుకే నా మాట విని నీరజని రమ్మని ఉత్తరం రాయండి. మీరు రాస్తే రాదేమోలే నేనే రాస్తాను'' అంది వరలక్ష్మి.

★ ★ ★

తల్లికి ఒంట్లో బాగా లేదని వరలక్ష్మి రాసిన ఉత్తరాన్ని అందుకున్న నీరజకి కాళ్ళు చేతులు ఆడలేదు.

"నువ్వు వెళ్ళిరా నీరజా! మీ అమ్మగారి పరిస్థితి ఎలా వున్నది నాకు ఫోన్ చెయ్యి. అవసరమైతే నేనూ వస్తాను'' అన్నాడు గౌతమ్.

నీరజ వెంటనే బయలుదేరింది. ఆమె ఇంటికి వచ్చేటప్పటికి అన్నపూర్ణమ్మ వంట చేస్తోంది.



"అదేమిటమ్మా, నీకు ఒంట్లో బాగా లేదని వరలక్ష్మి అత్త ఉత్తరం రాసింది. మరి నువ్వు..."

"ఇప్పుడు బాగానే ఉందిలే" అంది ఆవిడ కూతురికి మంచినీళ్ళిస్తూ. ఆవిడ ముఖం నీరసంగానే వున్నా అనారోగ్య చిహ్నాలు కనబడలేదు.

"ఎందుకమ్మా. ఇలా చిన్న అనారోగ్యాని కే పక్కింటివాళ్లచేత ఉత్తరాలు రాయించి, హడలగొట్టడం" ధుమధుమలాడుతున్న కూతుర్ని చూసి ఆవిడ నొచ్చుకుంది.

భోజనాలయ్యాక ఆవిడని అడిగింది. "నా ఉత్తరం అందిందా?"

"అందింది"

"ఆషాఢమాసం ఎల్లుండినుంచే మొదల వుతుందని అత్తయ్యగారు చెప్పారు. నువ్వు పాతికవేల రూపాయలు, బట్టలు తీసుకువ చ్చి మా ఆయనకియ్యి. అంతడబ్బు ఇస్తు న్నాం కదా బట్టలుమంచివి ఎందుకు కొ నడం అని కక్కుర్తిగా చవకరకం బట్టలు కొనకు. మంచి బట్టలు మూడువేలు పెడితే వస్తాయి"

"ఆషాఢపట్టీగా పాతికవేలు ఇమ్మని మీ అత్తగారు అడిగారా?"

"వాళ్ళేమీ అడగరు. నేనే అడుగుతున్నా ను" తేలిగ్గా ఊపిరి తీసుకుంది ఆవిడ.

"అంత డబ్బు ఇప్పుడు ఇవ్వలేను నీర జా! పెళ్ళికే చాలా ఖర్చయింది" తల్లి మాట పూర్తికాకుండానే గయ్‌మంది.

"డబ్బు లేదా? పొలం మీద వస్తున్న రాబడి అంతా ఏం చేశావు?"

నీరజ అలా అడగగలదని ఊహించని ఆవిడ స్థాణువయింది. "నీ చదువుకి, పెళ్ళికి ఖర్చుపెట్టిన డబ్బు ఎక్కడనుంచి వచ్చిందమ్మా? వ్యవసాయం ఆకులో వడ్డించిన అన్నంకాదు. ప్రకృతి అనుకూలించాలి. కిందటి సంవత్సరం దిగుబడి అంతంతమాత్రంగా ఉంది"

"అయితే ఏమంటావ్? ఆషాఢపట్టీగా అంతడబ్బు ఇవ్వలేనంటావ్! ఏ వెయ్యో, రెండు వేలో ఇచ్చి చేతులు దులుపుకుందామ నా నీ ఉద్దేశ్యం? పెద్ద సంబంధాలు చెయ్యగానే సరికాదు. వాళ్లస్థాయికి తగినట్లు ముచ్చట్లు జరపక్కర్లేదా? వాళ్ళ స్టేటస్‌కి తగినట్టు కానుకలు ఇవ్వద్దా? లేకపోతే వాళ్ళకెంత తలవంపులు?"

"నీ అత్తగారు కోటీశ్వరులే కావచ్చు. నిజంగా మనం పాతికవేలు బహుమతిగా ఇచ్చినా అది వాళ్ళకో లెక్కా? వాళ్ళు కార్లలో తిరుగుతున్నారని నేను కారు బహుమతిగా ఇవ్వగలనుటే!" నిస్సహాయంగా అడిగింది.

"నీకే పదిమంది పిల్లలున్నారని అలా బీద అరుపులు అరుస్తావు? నీ ఒక్కగానొక్క కూతురిని. నా సరదా తీర్చవలసిన ధర్మం నీకులేదా?"

"లేకేం? వుంది కానీ, చేతిలో డబ్బు లేనప్పుడు ఏం చేస్తాను? బ్యాంకులో యాభై వేలు మాత్రం మిగిలాయి. ఇంక ఊడ్పులు మొదలయితే కూలి ఖర్చు, ఎరువుల ఖర్చు ఎంతవుతుంది? ఇప్పుడు ఆషాఢపట్టీ తరువాత పండుగలు ఇలా వరసగా అల్లుడికి ఏదో ఇస్తూనే వుండాలి. అందుకే చెబుతున్నాను. మన తాహతుని బట్టి ఇద్దాం!"

"వ్యవసాయంలో దిగుబడి లేదంటూ ఎందుకమ్మా ఆ పొలం? అమ్మి బ్యాంక్‌లో వేసుకో! డబ్బూ కనిపిస్తుంది. నీకీ చాకిరీ తప్పుతుంది"

అన్నపూర్ణమ్మ నిశ్చేష్టురాలయి చూ స్తోంది.

"పొలం అమ్మేయ్యాలా? భర్త పోయిన ప్పుడు 'ఆడదానివి నువ్వు వ్యవసాయం చేయించలేవు. పొలం అమ్మి డబ్బు బ్యాంక్‌లో వేసుకో. వడ్డీలు పెడితే నువ్వు, నీ కూతురు హాయిగా కాలుమీద కాలు వేసుకుని తినచ్చు' అని బంధువులు సలహా ఇచ్చినప్పుడు కూడా ఆవిడకి పొలాన్ని అమ్మాలనే ఆలోచనే కలుగలేదు. ఆ పొలం





తన భర్త ప్రాణం! కూలీలతో సమానంగా పనిచేసి నిజమైన రైతు అనిపించుకున్నాడా యన. అలాంటి పొలాన్ని అమ్మమని సలహా ఇస్తోంది కూతురు. అదీ ఆపదలో అవసరమై కాదు. లేనిపోని గొప్పలకోసం, తన భేషజాన్ని ప్రదర్శించడంకోసం" ఆవిడ కళ్ళు గండిపడ్డ చెరువులయ్యాయి.

మరునాడు ప్రయాణమై వెళ్తున్న నీరజ చేతిలో ముప్పై వేలు పెట్టింది అన్నపూర్ణ మ్మ.

"అడిగిన వెంటనే ఇవ్వవచ్చుగా? డబ్బు లేదని ఎంత గొడవ చేసింది?" మనసులోనే మూలుక్కున్న నీరజ మాట్లాడకుండా ఆ డబ్బు తీసుకుంది.

"రెండెకరాల పొలం అమ్మేయ్యాలను కుంటున్నాను అన్నయ్యా'' అంది అన్నపూర్ణ మ్మ నీరజ వెళ్ళిన గంట తర్వాత.

"దేనికమ్మా?" పరంధామయ్య దంపతు లు నీరజ డబ్బుకోసం తల్లిని వేధించడం తెలిసినా తెలియనట్టే అడిగారు.

"డబ్బు సరిపోవడంలేదు. తొలి పండుగ కి అల్లుడిని, నీరజని, వియ్యపురాలిని పిలిచి బట్టలు పెట్టాలి. అదీగాక ఊడ్పులు ఎరువు లు... మీకు తెలియనిదేముంది''

"భూమి అమ్మితే మళ్ళీ కొనగలమా చెల్లెమ్మా''

"పెద్దవాడిని... నీ శ్రేయస్సుకోరి ఒక మాట చెబుతున్నాను. విను. భూమి ఇప్పుడు అమ్మవద్దు. ఇప్పుడు వున్నట్టుండి అమ్మజూ పినా నష్టానికే అమ్మవలసి వస్తుంది''

"కానీ ఖర్చులకి డబ్బు చాలడం లేదన్న య్యా! ఇప్పుడే నీరజకి ముప్పైవేలు ఇచ్చి పంపాను''

"నేను ఇస్తాను. ధాన్యం అమ్మగానే నా డబ్బు నాకిద్దువుగాని''

"నన్ను మరీ రుణగ్రస్తురాలిని చేస్తున్నార న్నయ్యా'' కన్నీళ్లతో అంది.

"అయినవాళ్ళమధ్య రుణాల ప్రసక్తి దేని కి? నిన్ను నేను ఎప్పుడూ పరాయి దానిగా భావించలేదు. అది నీకూ తెలుసు'' పరంధా మయ్య అభిమానంగా అన్నాడు.

"అత్తవారిని పీడించే అల్లుడిని దశమ గ్రహం అంటారు. మరి తల్లినుంచి ఎంత లాక్కుందామా అని ఆలోచించే నీరజలాంటి కూతుళ్ళని ఏమంటారో'' అనుకుంది వరల క్ష్మి.



ఉమ ముఖం మామూలుగా లేకపోవడం, ఆమె చాటుగా కన్నీళ్ళు తుడుచుకోవడం గమనించిన పార్వతమ్మ మనసు జరగరాని దేదో జరిగినట్టు కీడు శంకించింది.

"నువ్వసలు అల్లుడు ఇష్టపడ్డాకే ఇక్కడకి వచ్చావా?" అడిగింది తనకి కాఫీ అందిస్తు న్న కూతురిని.

"ఎందుకొచ్చిందమ్మా నీకా అను మానం" నవ్వబోయింది.

"మీ ఇద్దరూ గొడవపడ్డారా?" మరో ప్రశ్న వేసింది.

"అదేం లేదమ్మా! నేను నీ దగ్గర నాలుగు రోజులుండి వస్తానన్నాను. సరే అన్నారు''

"మరి నువ్వెందుకు అదోలా వున్నావ్''

ఆప్యాయంగా తల్లి ప్రశ్నించగానే ఉమకి కన్నీళ్ళు వచ్చాయి.

"నీకు ఒంట్లో బాగాలేదని తెలిసీ... ఆయన ఒక్కసారైనా నిన్ను చూడ్డానికి రాలేదు, చూశావా''

"పని వత్తిడివలన రాలేకపోయి వుంటాడు. అయినా నేనేమీ మరణశయ్యమీద లేను కదా''

"పని వత్తిడి కాదు. చూడ్డానికి వస్తే నీకు వైద్యం చేయించవలసిన బాధ్యత నెత్తిమీద పడుతుందని. అంతే కాదు. నిన్నిక్కడ ఒంటరిగా వదిలేసి వెళ్తే నలుగురూ ఏమైనా అనుకుంటారు. తనతో ఎక్కడ అతని ఇంటికి తీసుకెళ్ళవలసి వస్తుందోననే భయంతోనే ముఖం చాటేశాడు." పదునుగా వున్న ఉమ స్వరంలోనుంచి ఏహ్యత, తిరస్కారం కలగలిపిన ఆ మాటలు విన్న పార్వతమ్మ మౌనం వహించింది.

"మొన్న నేను నీ దగ్గరకి వస్తుంటే అతను నాకు ఎంత ఇవ్వబోయాడో తెలుసా? రిక్షాలో వెళ్ళమని పదిరూపాయలు... ఏం రెండు వందలిచ్చి నీకు మందులు కొనిస్తే ఆయన ఆస్తి తరిగిపోతుందా?"

"ఉమా!" తీవ్రంగా పిలిచింది. "అతనిస్తే మాత్రం నేనెలా పుచ్చుకుంటాననుకున్నావ్? అంత అభిమానం చంపుకున్నానా''

"నువ్వు పుచ్చుకున్నావా లేదా అన్నది వేరే విషయం. ఇవ్వవలసిన బాధ్యత అతనికి వుందా లేదా? అతని తల్లి ఇదే స్థితిలో వుంటే ఇలాగే వదిలేసేవాడా?"

"అతను నా కొడుకు కాదు. నా అల్లుడు''

"అయితే మాత్రం!" ఆమె అసహాయమైన కోపంతో వణికిపోతోంది. అసలు ఇలాంటి మనిషని తెలిస్తే నేను పెళ్ళే చేసుకోకపోదును''

"ఉమా! నీకు పెళ్ళయి ఇంకా రెండు నెలలైనా కాలేదు. అప్పుడే భర్తని విమర్శించడం అతనితో గొడవపడడం బాగుండదు. నా కారణంగా నువ్వతనితో గొడవపడేమాటయితే నువ్వసలు నా ఇంటికి రావద్దు''

"నేను అతనితో గొడవపడదలచుకోలేదు. తన తల్లిలాంటిదే భార్య తల్లి కూడా అని అతను తెలుసుకునేలా చేస్తాను''

"ఉమా!" అరిచింది పార్వతమ్మ. "అదే... ఆ మొండితనమే వద్దన్నది. నిన్ను కోరి పెళ్ళి చేసుకున్నందుకు అతను పశ్చాత్తాపపడేలా చెయ్యవద్దు. నిన్నతను ప్రేమగా చూసుకుంటున్నాడు. అది చాలు. చాలామంది అల్లుళ్ళలా నీద్వారా అది కావాలి, ఇది కావాలి అని నన్ను సాధించడంలేదు. అది చాలు నాకు. నా గురించి అతనితో గొడవపడ్డావంటే నేను చచ్చినంత ఒట్టు!"

ఉమ ఏడుస్తూ అంది "నువ్వు నా పెళ్ళి విషయంలో తొందరపడ్డావమ్మా! ఇంకాస్త నిదానిస్తే మంచివాడు నా భర్తగా దొరక్కపోయేవాడా?"

"భాస్కర్ కూడా మంచివాడే ఉమా!"

"పైకి కన్పించేటంత మంచివాడు కాదమ్మా అతను! అతని చుట్టూ ఒక పరిధి వుంది. ఆ పరిధిలో అతను, అతని అక్క అతని భార్యనయినందుకు నాకు తప్ప మరెవరికీ చోటులేదు. అత్తగారిని తల్లిలా ఆదరించలేని కుసంస్కారుడు''

"ఇది జీవితం ఉమా! సినిమా కాదు. ఆ మాటకొస్తే ఎంతమంది కోడళ్ళు తమ అత్తగార్లని తల్లిలా ఆదరిస్తున్నారు''

'తల్లి చెప్పినట్టుగా అతనితో గొడవపెట్టుకోడం అనవసరం! మంచితనంతో అతనిలో మార్పు తీసుకురావాలి' అనుకుంది ఉమ.

★ ★ ★

"ఇప్పుడీ పెళ్ళిచూపులేమిటమ్మా?" అసహనంగా అంది పల్లవి. "నాకింకా చదువుకోవాలని వుంది''

"చదువుకో! ఎవరొద్దన్నారు? పెళ్ళిచూపు




లయినంత మాత్రాన పెళ్ళయిపోతుందా''

"ముందు పెళ్ళి చూపులంటారు. ఆ తరువాత అబ్బాయి నచ్చాడా అని మొదలుపెడతారు. నేనసలు ఇంట్లోనే వుండను'' అంది పల్లవి కోపంగా.

"బాగుందే! వచ్చినవాళ్ళు నన్ను చూస్తారా? నిన్నా''

"నాకేం తెలియదు. నన్ను అడిగి ఈ పెళ్ళిచూపులు ఏర్పాటు చేశారా'' దూకుడుగా గదిలోనుంచి బయటకి వచ్చిన పల్లవి ఎదురుగా నిలబడివున్న తండ్రిని చూసి ఆగింది.

"పల్లవీ! ఇటురా రామ్మా!" బాగా గారం చెయ్యాలనుకున్నప్పుడు మురళీధరరావు కూతుర్ని అలాగే పిలుస్తాడు.

"ఏమిటి నాన్నగారూ''

"ఇలా రామ్మా, నీతో మాట్లాడాలి'' ఆయన తన గదిలోకి నడిచాడు. ఆమె అనుసరించింది.

"సాయంకాలం నువ్వెక్కడికైనా వెళ్ళాలా''

"అవును నాన్నగారూ''

"అయ్యో! మరి వాళ్ళని మన ఇంటికి రమ్మని ఆహ్వానించానే! చూశావా, నీతో చెప్పి. నీకు వేరే ప్రోగ్రామ్స్ ఏవీ లేకపోతేనే వాళ్ళని రమ్మనాల్సింది''

పల్లవి వస్తున్న నవ్వుని ఆపుకుంది అమాయకత్వం నటిస్తున్న తండ్రిని చూసి,

"పోనీ, ఇవాళ వద్దులే! వాళ్ళని రేపు రమ్మననా''

"ఇవాళ వద్దు. రేపూ వద్దు''

"ఏం?"

"అదంతే! నాకెవరినీ చూడాలని లేదు''

"బాగుంటుందా? తీరా వాళ్ళని రమ్మని పిలిచి, ఇప్పుడు రావద్దంటే ఏమనుకుంటారు''

"మా అమ్మాయికి ఇంట్రెస్ట్ లేదని చెప్పెయ్యండి''

"బాగుండదమ్మా! జస్ట్ అయిదు నిముషాలు. వూరికే కూర్చుని వెళ్ళిపో!"

"అసలు నన్ను అడగకుండా ఎందుకు నాన్నగారూ ఈ తతంగాలన్నీ''

"ఎప్పటికైనా పెళ్ళి చేసుకోవలసిందే! అలాంటప్పుడు మంచి సంబంధాన్ని వదులుకోవడమెందుకమ్మా? బాగా ఆస్తిపరులు వాళ్ళు. అబ్బాయి అమెరికాలో ఎమ్.టెక్, పిహెచ్‌డి చేసి మైసూర్‌లో ఒక పెద్ద కంపెనీలో ఇంజనీర్‌గా వర్క్‌చేస్తున్నాడు. చాలా అందగాడు కూడా.

"నాకింకా చదువుకోవాలని వుంది''

"చదువుకో! వద్దన్నదెవరు''

"సరే! పెళ్ళిచూపులవరకే మీ ఇష్టం. తరువాత పెళ్ళి విషయంలో నన్ను బలవంతపెట్టి ఇబ్బందిపెట్టవద్దు''

"ఛ! ఎందుకు బలవంతపెడతానమ్మా? నచ్చచెబుతాను కాని''

చిరుకోపంగా చూస్తూ అంది. "నన్ను మాటలతో బురిడీ కొట్టించాలని చూడవద్దు''

మురళీధరరావు నవ్వుకున్నాడు.

★ ★ ★

పెళ్ళిచూపులలో పల్లవి ఒకే ఒక్క నిముషం అతనివైపు చూసింది? ఆ ఒక్క నిముషంలోనే అతని కళ్ళు ఆమెని పలుకరించాయి. ఆమె గుండెకి గేలంవేసి తనతో పట్టుకుపోయాయి.

పల్లవి గుండె రెట్టింపు వేగంతో కొట్టుకుంటూండగా కళ్ళు దించుకుంది. అతను మన్మథుడో, జయంతుడో, వసంతుడో, నలకూబరుడో అన్నట్టు వున్నాడు. గౌతమ్ కూడా అందగాడే! కాని అతన్ని చూసినప్పుడు ఇప్పటిలా తనలో సంచలనం కలుగలేదు. పల్లవి మనశ్శరీరాలు ఏదో తెలియని అనుభూతికి లోనవుతున్నాయి. అది కొద్దిక్షణాల సేపే! అంతలోనే ఎట్టి పరిస్థితులలోను

చలించని మేరుపర్వతంలాంటి మనోనిగ్రహం వెన్నుతట్టింది.

"ఇదేమిటి, తన మనసిలా వశం తప్పుతోంది? ఎవరో ముక్కు, ముఖం తెలియని అపరిచిత యువకుడు తనని పెళ్ళిచూపులు చూడ్డానికి రాగానే తనెందుకిలా అతని అందం చూసి మైమరచిపోతోంది'' తననితనే మందలించుకున్న పల్లవి క్షణాలలో తనని తాను సంబాళించుకుంది.

పెళ్ళిచూపుల తతంగం ముగిసి వాళ్ళటు వెళ్ళగానే తల్లి బలవంతంమీద కట్టుకున్న ఆ పట్టుచీరా, నగలూ తీసేసి చుడీదార్ వేసుకుని లైబ్రరీకని బయలు దేరింది.

ఆ రాత్రి భోజనాల దగ్గర మురళీధరరావు భార్యతో అన్నాడు.

"అబ్బాయి చాలా అందంగా వున్నాడు కదూ? మగవాళ్ళలో అంత అందమైనవాళ్ళని అరుదుగా చూస్తాము. అతని ముఖం చూస్తే మన పల్లవి అతనికి నచ్చినట్టే వుంది. ఈ సంబంధం కుదిరితే మనం అదృష్టవంతులమే."

పల్లవి చురుగ్గా తండ్రివైపు చూసింది.

"అంటే నాకతను నచ్చనవసరం లేదా?"

"నీకతను నచ్చలేదా?"

"అందగాడే! కాని అతని మనస్తత్వమెలాంటిదో తెలుసుకోకుండా పెళ్ళికి ఎలా ఒప్పుకుంటాను''

"అందం పైకి కనిపించేది. మనసు ఎలాంటిదో ఎలా తెలుస్తుంది పల్లవీ! ఒకటి మాత్రం చెప్పగలను. అతని కుటుంబం చాలా మంచిది. మర్యాదస్తులు... అబ్బాయి విషయంలో ఏ వంకా పెట్టడానికి వీలు లేదు''

"అది చాలదునాన్నా!"

"మరి?"

"నేను చెబుతాను'' అంతవరకు మౌనంగా వున్న అరుంధతి అంది. "మనని ఆదరించగలిగే వాడయివుండాలి. మనకా మగపిల్లలు లేరు. పల్లవి భర్త కొడుకు లేని లోటు తీర్చాలి. అంతేగా పల్లవీ''

"కరెక్ట్''

"పార్వతమ్మగారిని చూశాక కొత్తగా పల్లవికీ భయం పట్టుకుంది''

"కాదు... నాకీ భయం ఆంటీని చూశాక కాదు. ముందునుంచీ వుంది. నాకు తోబుట్టువులు లేరని నేనెప్పుడూ బాధపడలేదు. నేను పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే మిమ్మల్ని ఎవరు చూస్తారనే నా బాధ"

"మమ్మల్ని వృద్ధాప్యంలో ఆదరిస్తేనే నీకు మా అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తానని షరతు పెట్టడం అసహ్యంగా వుంటుంది కదా'' మురళీధరరావు అన్నాడు.

"అందుకే పెళ్ళి విషయంలో నేను తొందరపడదలచుకోలేదు నాన్నగారూ! అలాంటి మంచివ్యక్తి తారసపడితేనే పెళ్ళిచేసుకుంటాను. లేకపోతే నేనసలు పెళ్ళే చేసుకోను'' పల్లవి చెయ్యి కడుక్కోడానికి లేచింది.

మురళీధరరావుకి ముద్ద దిగడంలేదు. కంచంలో చెయ్యిపెట్టుకుని అలాగే కూర్చుండిపోయాడు.

"మీకు కొంచెం కూర వెయ్యనా'' అరుంధతి అడిగింది.

"మంచి సంబంధం అరుంధతీ! పల్లవి ఇలా అంటుందేమిటీ?"

"అది అన్న మాటలలో నిజం లేకపోలేదండీ! మనని కొడుకులా ఆదరించే అల్లుడు కావాలని దాని ఆశ"

ఆయనని ఆ సంబంధం వూరిస్తోంది. ఒకవైపు పల్లవి పట్టుదల మరోవైపు వృద్ధాప్యంలో తమ గతి ఏమిటనే ప్రశ్న భూతంలా భయపెడుతున్నాయి.

★ ★ ★

ఆరోజు ఉదయమే సుడిగాలిలా వచ్చిపడ్డాడు మాధవరావు. ఆయన మురళీధరరావుకి బాల్యమిత్రుడు. పల్లవిని చూసిన పెళ్ళి




సంబంధం వాళ్ళకీ, ఆయనకీ దూరపు చుట్ట రికం. అంతకుమించిన స్నేహం వున్నాయి.

"ఏరా, మురళీ! ఇంట్లో స్వీట్లేమయినా వున్నాయా, లేకపోతే గుప్పెడు పంచదార యినా నా నోట్లో పొయ్యి''

"నీకు డయాబిటిస్ కదరా, వున్నట్టుండి స్వీటు పైకి మనసు పోయిందేమిటి?"

"పోనియ్యరా! సుఖంగా ఇవాల్టికి స్వీటు తినేస్తాను. శుభవార్త తెచ్చానురా! జగపతిరావుగారి కుటుంబం అంతటికి ముఖ్యంగా అబ్బాయి అరుణ్‌కి పల్లవి బాగా నచ్చింది. మరి మీరుకూడా అంగీకరిస్తే తాంబూలాలు పుచ్చుకుందామని'' చెప్పారు.

"పల్లవి ఒప్పుకోడం లేదురా!" నిర్లిప్తంగా అన్నారాయన.

"ఏమిటీ'' ఆశ్చర్యంగా చూశాడాయన.

"పల్లవి ఒప్పుకోడంలేదా? అంటే తనకీ సంబంధం నచ్చలేదా''

పల్లవి ఎందుకు ఇష్టపడడం లేదో చెప్పారాయన.

"ఓస్!" అంతా విని ఫకాల్న నవ్వేడాయన. "అదా అమ్మాయి భయం! ఏదీ పల్లవి?" ఆయన పిలిచాడు.

"పల్లవీ''

"ఏమిటంకుల్''

"నీలా తల్లిదండ్రులని గురించి ఆలోచించే ఒక్క ఆడపిల్ల వున్నా చాలమ్మా! పున్నామనరకం నుంచి తప్పిస్తారనే కన్నకొడుకులు భూమిమీదే నరకం చూపిస్తున్నారు. నువ్వు పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే మీ అమ్మ నాన్నలని ఎవరు చూస్తారని, నీ భర్త వాళ్ళని వృద్ధాప్యంలో ఆదరించడేమోననే భయంతో పెళ్ళే చేసుకోనంటున్నావా? నీ భయం సహజమే. కాని జగపతిరావుగారి కుటుంబం చెప్పుకోదగినది. ఆయనకి ఇద్దరమ్మాయిలు ఇద్దరు అబ్బాయిలు. తెలుసుగా? పెద్దబ్బాయికీ బాగా కలిగిన వాళ్ళ సంబంధమే చేశారు. ఆ అమ్మాయి కూడా తల్లిదండ్రులకి ఒకర్తే సంతానం. నాలుగేళ్ళ కిందట ఆమె తండ్రి చనిపోయాడు. జగపతిరావుగారి పెద్ద బ్బాయి శ్రీరామ్ సహృదయంతో అత్తగారిని తనదగ్గరే వుంచుకున్నాడు. పెళ్ళిచూపులరోజు ఆవిడ కూడా వచ్చారు. నువ్వు చూడలేదా''

"ఆరోజు చాలామందే వచ్చారు. ఎవరెవరో నాకు తెలియలేదంకుల్''

"నువ్వు భయపడడంలో అసహజం ఏమీ లేదమ్మా! తల్లిదండ్రులని వృద్ధశరణాలయంలో వదిలేస్తున్న రోజులివి. కొంత జన్మతః వచ్చిన సంస్కారం కొంత మన పెంపకాన్నిబట్టి వుంటుంది. కాని వీళ్ళ కుటుంబం చాలా మంచిదమ్మా!ఆవిడనిఅదే పెద్దబ్బాయి అత్తగారిని పరాయి మనిషిలా ఎవరూ చూడరు ఆ ఇంట్లో. వాళ్ళ కుటుంబ సభ్యురాలిలాగే చూస్తారు. అరుణ్ విషయంలో కూడా నువ్వేలాంటి సందేహాలూ పెట్టుకోనవసరంలేదు. అతను కూడా చాలా మంచివాడు. నేను చిన్నప్పటినుంచి అతన్ని బాగా ఎరుగుదును. నువ్వు కావాలంటే విడిగా అతన్ని కలుసుకుని మాట్లాడవచ్చు''

"ఏమని? మా అమ్మా నాన్నల బాధ్యత నీదేననా? ఛ! అసహ్యంగా వుంటుంది''

మురళీధరరావు వెంటనే అడ్డుపడ్డాడు. "నువ్వు చెప్పావుగా? ఇంక పల్లవి ఇష్టం! లేదంటే తనకి బాగా నచ్చిన, మమ్మల్ని తల్లిదండ్రులలా ఆదరించగలడు అనే నమ్మకం కలిగిన ఏ పేద ఇంటి అబ్బాయైనా ఫర్వాలేదు. పల్లవికి బాగా నచ్చాలి. అంతే!"

"ఏమ్మా, పల్లవీ, ఏమంటావు'' మాధవరావు అడిగాడు.

"నేను ఆలోచించుకోవాలి అంకుల్'' అని అక్కడ నుంచి వెళ్ళిపోయింది పల్లవి.

★ ★ ★

కాలింగ్ బజర్ మోగిన శబ్దంవిని మెలకువ వచ్చింది ఉమకి. భాస్కర్ కూడా లేచాడు. టైము చూస్తే రెండుగంటలు కావ

స్తోంది.

"ఇంతరాత్రివేళ ఎవరు వచ్చి వుంటారు'' అని ఆలోచిస్తూ కిటికీ దగ్గరకి వెళ్ళి చూశాడు.

జగన్నాథం!

ఛరాలున వెళ్ళి తలుపు తీస్తూ "ఏమిటి బావగారూ, ఇంత రాత్రివేళ వచ్చారు'' అని అడిగేడు.

"మీ అక్కకి బాగా జ్వరంగా వుంది. నిన్ను చూడాలని ఒకటే కలవరింతలు. నాకు భయం వేసి నిన్ను తీసుకెళ్దామని వచ్చాను''

"పదండి'' భాస్కర్ చప్పున బట్టలు మార్చుకోడానికి వెళ్ళాడు. ఉమ అతని వెనకాలే వెళ్ళింది.

"నేనూ వస్తానండి. పాపం! చిన్న పిల్లలు, వాళ్ళేం భయపడుతున్నారో' అంది.

"సరే, రా'' అన్నాడతను. ఉమ జుట్టు పైపైన దువ్వుకుని చేతిసంచీలో రెండు చీరలు పెట్టుకుని బయలుదేరింది.

రుక్మిణికి జ్వరం ఎక్కువగానే వుంది. పైగా పిచ్చిపిచ్చి కలవరింతలు! పిల్లలిద్దరూ నిద్రకళ్ళతో భయం భయంగా చూస్తూ మంచానికి చెరొకవైపు నిలబడ్డారు.

ఉమ వెళ్తూనే పరిస్థితిని అర్థం చేసుకుని ఫ్రిజ్‌లోనుంచి ఐస్‌క్యూబ్స్ తీసి ఆమె ఒళ్ళంతా తుడిచింది. టెంపరేచర్ వంద డిగ్రీలకు వచ్చేవరకు అలా ఓపికగా తుడుస్తూనే వుంది. ఆవలిస్తూ కూర్చున్న మగవాళ్ళిద్దరినీ చూస్తూ అంది.

"మీరు వెళ్ళి పడుకోండి. వదినగారి దగ్గర నేనుంటాను''

ఉమ తెల్లవారేవరకు అలాగే రుక్మిణి పక్కలో కూర్చుని మధ్య మధ్య టెంపరేచర్ చూస్తూనే వుంది.

రెండు రోజులలో ఆమెకి జ్వరం తగ్గింది. ఆ ఉదయం వంటచేస్తున్న ఉమ బెడ్‌రూమ్‌లో నుంచి వినవస్తున్న రుక్మిణి, జగన్నాథంల సంభాషణలో తన పేరు వినపడడంతో అప్రయత్నంగానే వినసాగింది.

"నీకు ఒళ్ళు తెలియని జ్వరంతో వున్నప్పుడు ఉమ ఎంత శ్రద్ధగా చూసిందో! నువ్వు కాళ్ళు నెప్పులు పెడుతున్నాయంటే కాళ్ళు కూడా పట్టింది. భాస్కర్ అదృష్టవంతుడు. మంచి అమ్మాయి భార్యగా లభించింది''

"ఏమిటి, దాన్ని తెగపొగిడేస్తున్నారు? అదేమైనా కట్నం తెచ్చిందా, లాంఛనాలు తెచ్చిందా? ఏమీ లేకపోయినా నా తమ్ముడు పెళ్ళి చేసుకున్నందుకు అది జీవితమంతా వాడిపట్ల కృతజ్ఞతతో అణగిమణగి పడివుండాల్సిందే. వాడు ఆ పిల్లని చేసుకుంటానన్నప్పుడు నేనుకాని వద్దని గట్టిగా పట్టుబడితే అసలు దాన్ని చేసుకునేవాడా! వాళ్ళ పెళ్ళికి పరోక్షంగా కారకురాలినైన నా ఋణం అది ఎన్ని జన్మలెత్తితే తీర్చుకోగలదు''

ఉమకి అవమానంతో కన్నీళ్ళు వస్తున్నాయి. ఆడబడుచుకి తనపై ఎంత చిన్నచూపువుందో అర్థమైన ఆమెకి సిగ్గుతో ప్రాణం పోతున్నట్టు అన్పిస్తోంది.

"హుష్! వూరుకోవే బాబూ! నీకు పుణ్యం వుంటుంది. ఆ అమ్మాయి వింటే బాధపడుతుంది'' మందలిస్తున్నాడు జగన్నాథం.

ఆమెకి ఎంత ఆవేశం వచ్చిందంటే ఆ క్షణంలోనే ఆ ఇంట్లోంచి వెళ్ళిపోవాలనిపించింది. కాని క్షణాలలో తనని తాను సంబాళించుకుంది.

"ఛ! సంస్కారం లేని మనిషి ఆమె ఏదో అందని బాధపడడం ఏమిటి? తన తల్లిని గురించి నీచంగా మాట్లాడిన ఆమె తనని గురించి మెప్పుదలగా ఎలా మాట్లాడుతుంది?"

ఉమ కళ్ళు తుడుచుకుని కూర తరగడం మొదలుపెట్టింది.

"ఉమా! వంటయిందా?" బాత్‌రూమ్‌లో




నుంచి తల తుడుచుకుంటూ వచ్చిన భాస్కర్ అడిగాడు.

"అయిపోయింది. ఇదుగో, వదినగారి పథ్యానికి, బీరకాయ కూర చేస్తే అయిపోయి నట్టే!"

"నేను సాయం చెయ్యనా?"

"మీరా!" నవ్వింది.

"ఏం వద్దుగాని వెళ్ళి మీ అక్కయ్యగారి దగ్గర కూర్చోండి చాలు!"

సరిగ్గా పావుగంట తరువాత అందరినీ భోజనానికి పిలిచింది.

భోజనం చేస్తూ అంది రుక్మిణి.

"అన్నట్టు మరిచేపోయానురా, మొన్న ఏం జరిగిందనుకున్నావ్? మా పక్కింటి ఆనందరావుగారు లేరూ?"

"ఆయనెవరు?"

"నేను చెబుతూంటాను కదురా, అత్తగారిని ఇంట్లో పెట్టుకుని పోషిస్తున్న మహానుభావుడు!"

"ఆ గుర్తొచ్చిందిలే!"

"ఆయన తల్లికి కళ్ళు పరీక్ష చేయించి, కళ్ళజోడు మార్పించాడు. ఆవిడకి ప్రతిదానికి వంతేకదూ? వెంటనే ఈవిడ తల్లిని తీసుకెళ్ళి అవసరం లేకపోయినా ఆవిడకి కళ్ళు పరీక్ష చేయించి, రెండొందలు వూడ్చింది. పోనీ, ఆవిడ బుద్ధి గడ్డితిందే అనుకో. ఆవిడ తల్లికి బుద్ధి వుండక్కర్లేదూ? తగుదునమ్మా అని డాక్టరు దగ్గరకి బయలుదేరింది. అయినా నెలల తరబడి కూతురి ఇంట్లోపడి తినడానికి ఆవిడకి సిగ్గనిపించదూ?"

"నీకెందుకే పక్కవాళ్ళ గోల?" జగన్నాథం అన్నాడు.

"నాకెందుకేమిటి? ఆవిడ రెండొందలు నన్ను అడిగి తీసుకెళ్ళి మరీ తల్లిని డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళింది. అయినా ఆవిడదేమైనా చిన్న నోరా? అలగా జనంలా అరుచుకుంటారు. ఈ వీధిలో అందరూ విన్నారు. నేనూ విన్నాను. విన్నది చెప్పాను. అసలు అప్పుచేసి అర్జెంటుగా తల్లిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళవలసిన అవసరం ఏమిటి? ఆవిడ తల్లికి వెనకాల టికాణా లేదు. నాలుగురోజుల కిందట ఆనందరావుగారి తల్లికి నా దగ్గర కళ్ళనీళ్ళ పర్యంతమయింది. కట్నానికి ఆశించకుండా లేని పిల్లని కోడలిగా చేసుకున్నందుకు అది ఏకు మేకై కూర్చుంది అని!"

ఉమకి తింటున్న అన్నం చేదుగా అనిపించింది. ఆ స్వరంలో ఎంత చులకన? ఎంత జుగుప్స! ఆమె అంటున్న ప్రతిమాట పరోక్షంగా తనని ఉద్దేశించి అన్నవే అని ఆమెకి తెలుసు. ఆమె కళ్ళలోనుంచి జారబోతున్న నీటిని బలవంతాన బిగపట్టి తల బాగా దించేసుకుంది.

★ ★ ★

షాపింగ్ పూర్తయ్యాక పార్క్‌చేసి వుంచిన కారు దగ్గరకి వస్తుండగా అరుణ్ కనిపించాడు మురళీధరరావుకు.

"అదుగో అరుణ్!" అనగానే తల ఎత్తి చూశారు అరుంధతి, పల్లవి.

అరుణ్‌తోబాటు నడుస్తున్న నడివయస్కురాలిని చూసి అడిగింది అరుంధతి.

"ఆవిడ అతని అన్నగారి అత్తగారుకదూ?"

"అవును'' అటే చూస్తూ చెప్పాడాయన.

అరుణ్ ఆవిడ చేతిలో బరువుగా వున్న పేకెట్లని తను అందుకుని కారు డోర్ తెరిచి, ఆవిడ ఎక్కాక కారు స్టార్ట్ చేశాడు.

"మాధవరావు చెప్పినదాంట్లో కొంచెం కూడా అబద్ధం లేదు. ఆవిడని షాపింగ్‌కి తీసుకొచ్చినట్టున్నాడు''

"నిజమేనండీ!" అంది అరుంధతి. పల్లవి మౌనంగా వుంది.

ఆ రాత్రి ఆమెకి నిద్రపట్టలేదు. 'అతన్ని కలుసుకుని మాట్లాడాలని వుంది. కాని నా తల్లితండ్రుల బాధ్యత నీదేనని చెప్పడం బాగుండదేమో!'



'అతను అన్నగారి అత్తగారిని షాపింగ్‌కి తీసుకొచ్చాడు. తన తల్లిదండ్రులని మాత్రం అంత గౌరవంగా ఎందుకు చూడడు' అనే భావం మరోవైపు.

ఆలోచనలతో అలసిన ఆమెకి తెల్లవారు ఝాముదాకా నిద్రపట్టలేదు. లేచేప్పటికి బారెడు పొద్దెక్కింది. బ్రేక్‌ఫాస్ట్ తింటూండగా మురళీధరరావు అడిగాడు.

"ఏమ్మా, వాళ్ళకేం చెప్పమంటావు? ఇంకా మనం ఆలస్యం చేస్తే మర్యాదగా వుండదుకదా!"

"నా కిష్టమేనని చెప్పండి నాన్నగారూ'' అంది.

సరిగ్గా నెల తరువాత వాళ్ళ పెళ్ళయింది.



అరుణ్ పదిహేనురోజులపాటు ఉద్యోగానికి సెలవు పెట్టడంవలన పల్లవి అత్తవారింట్లోనే వుండవలసివచ్చింది. ఆమెకి అత్తగారు, ఆడబడుచుల స్వభావాలను అర్థం చేసుకునే అవకాశం లభించింది.

లాయరయిన జగపతిరావుగారు ఎప్పుడూ క్లయింట్లు, లాపుస్తకాలతో బిజీగా వుంటాడు. అత్తగారు శ్యామలాదేవి ఇంట్లో వంటకి, పైపనులు చెయ్యడానికి మనుషులున్నా బొడ్లో స్టోర్‌రూమ్ తాళాలు పెట్టుకుని ఎప్పుడూ ఊపిరి సలపని పనిచేస్తున్నట్టే హడావుడిగా తిరుగుతూ వుంటుంది. పెద్ద ఆడబడచు అయిన ప్రసూన అత్తవారిదీ ఆ వూరే. ఆవిడ భర్త కూడా లాయరే. ఆవిడ అత్తవారింట్లో ఎప్పుడు కాపురం చేస్తుందో తెలియదుకాని, మొగుడిని కోర్టుకి పంపి రోజూ ఠంచనుగా పదయ్యేసరికల్లా పుట్టింటికి వచ్చి సాయంకాలందాకా వుంటుంది. ఆమె భర్త కూడా అత్తవారింటికి తరచుగా వస్తూ వుంటాడు.

రెండవ ఆడబడుచు ప్రమీల భర్త చెన్నైలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. అరుణ్ పెళ్ళికని వచ్చిన ఆమె ప్రస్తుతం ఇక్కడే వుంది. బావగారు శ్రీరామ్ ఛార్టెర్డ్ ఎకౌంటెంట్.

పల్లవి కాపురానికి వచ్చిన వారంరోజులకే ఆ ఇంట్లోవాళ్ళ మనసులు నిజంగా వెన్నపూసలు కావేమోనని అనుకోసాగింది.

ఆరోజు శ్రీరామ్ అత్తగారయిన వసుంధరాదేవి, శ్యామలాదేవి, పల్లవి, ప్రసూన, ప్రమీలలు హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఇంతలో వంట మనిషి వచ్చి అడిగింది. "మధ్యాహ్నం టిఫిన్ క్యాబేజీ వడ చెయ్యమంటారా?"

"చెయ్యండి. నాకు చాలా ఇష్టం!" ప్రసన్న అంది. "నాకు కూడా చాలా ఇష్టం!" చప్పున అంది వసుంధరాదేవి.

"మినప్పప్పు, ఇవ్వండి నానబోస్తాను'' అంది వంటమనిషి.

"స్టోర్ రూమ్ తాళాలు ఇవ్వండత్తయ్యా! నేను ఇస్తాను'' అంది పల్లవి.

"నేను ఇస్తానులే. నువ్వు కూర్చోమ్మా!" శ్యామలాదేవి ఆదరంగా అని లేచివెళ్ళింది. పల్లవి మళ్ళీ కూర్చుంది.

వియ్యపురాలి వెనుకనే వసుంధరాదేవి

లేచివెళ్లింది.

"ఛీ! అసలు సిగ్గులేదు. స్వంత ఇంట్లోలా ఎలా పురమాయిస్తోందో చూశావా? క్యాబేజీ వడ తనకీ ఇష్టంట" ప్రమీల అంది ప్రసన్నతో.

"అసలు వదినని అనాలి? వాళ్ళ నాన్నగారు పోగానే ఆవిడని తెచ్చి మన నెత్తిమీద పెట్టింది. బోలెడు డబ్బు మూలుగుతోందిక దా! వంటకో మనిషిని, పైపనికో మనిషిని పెట్టుకుని ఆవిడ ఇంట్లోనే వుండచ్చుకదా! ఇంకా కాలు చెయ్యి వంగలేదుగా..."

వసుంధరాదేవి రావడం చూసి హఠాత్తుగా మాటలాపేశారు ఇద్దరూ. ప్రసన్న చిరునవ్వుతో అడిగింది.

"మా వదిన ఏం చేస్తోంది? రమ్మనండి. ఇక్కడే కూర్చుంటుంది"

"వాషింగ్ మెషీన్ దగ్గర వుంది" చెప్పిందావిడ స్థిమితంగా కూర్చుంటూ.

పల్లవికి తల తిరిగిపోతోంది. క్షణం కిందట వాళ్ళ ముఖాలలో ఆవిడపై వ్యక్తమయిన అయిష్టత, ఇప్పుడు మచ్చుకైనాలేదు. చిరునవ్వు అనే రంగుని పూసుకుని, ప్రేమను ఆప్యాయతను సహజంగా నటిస్తున్నారు వీళ్ళు.

పల్లవి వాళ్ళ నాన్నగారు కోర్టుకి వెళ్తే అరుంధతిగారికేమీ తోచదుకదా! ఆవిడని కూడా ఇక్కడకే రమ్మనవలసింది" అంది వసుంధరాదేవి.

"మరే!" నవ్వింది ప్రసన్న.

"అదేమిటోగానీ మా అన్నయ్యలిద్దరికీ కూడా ఒక్కర్తే అమ్మాయి వున్న సంబంధాలే వచ్చాయి" అంది ప్రమీల ఫెళ్ళున నవ్వుతూ.

శ్యామలాదేవి శృతికలిపింది.

"జయా వాళ్ళమ్మగారి గది పక్కన వున్న గది ఖాళీగా వుంచండి. ఎప్పటికైనా పల్లవి వాళ్ళమ్మగారు ఇక్కడకి రావలసిందేగా! ఆవిడకి ఆ గది వుంటుంది" సగం నవ్వుతో పూర్తిచేసింది ప్రమీల.

అదేదో పెద్ద జోక్ అయినట్టు అందరూ పడిపడి నవ్వుకున్నారు. పల్లవికి నవ్వు రావడంలేదు. ఆ మనుషుల మనస్తత్వానికి అసహ్యం, అంతకుమించి బాధ కలిగాయి.

మధ్యాహ్నం అందరూ భోజనాలు చేస్తుండగా శ్యామలాదేవి ప్రమీల అన్న మాటలని రిపీట్ చేసి చెప్పడం నచ్చిన జోక్‌ని మళ్ళీ మళ్ళీ చెప్పుకుని నవ్వుకున్నట్టు అందరూ నవ్వుకోవడం, అందరితోబాటు అరుణ్ కూడా నవ్వడం ఆమెకి ఆశ్చర్యాన్ని కలగచేసింది.

ఆ రాత్రి అరుణ్‌ని అడిగిందామె.

"మీ చెల్లెలు అన్నమాటలు మీకు జోక్‌గా అనిపించాయా?"

"ఏం మాటలు?" అర్థం కానట్టు అడిగాడు.

"వసుంధరాదేవిగారి గది పక్కనే మా అమ్మ కోసం ఒకగది ఖాళీగా వుంచమన్నది"

"జోకేమిటి? అది నిజమేకదా! మీ పేరెంట్స్ ఎప్పటికైనా ఇక్కడకి రావలసిందే కదా!" మరో సమయంలో అయితే అరుణ్ ఆమె అడిగినదానికి ఏం జవాబిచ్చేవాడో కాని, ప్రస్తుతం అతను శృంగారంలో మొదటి దశలో వున్నాడు.

"మా అమ్మ నాన్నలు ఇక్కడెందుకు వుంటారు? నేను ఎక్కడ వుంటే అక్కడ వుంటారు" మనసులో అనుకుంది పల్లవి.

★ ★ ★

'అమరేశ్వరీ ఇండస్ట్రీస్' ప్రారంభోత్సవానికి ఆహ్వాన పత్రికతోబాటు నీరజ వ్రాసిన ఆ ఉత్తరాన్ని పదేపదే చదువుతూ దిగాలుపడి కూర్చుంది అన్నపూర్ణమ్మ.

"ఫ్యాక్టరీ ప్రారంభోత్సవం అయిన మరునాడు మేము సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నాం. పీటలమీద నువ్వు మాకు

బట్టలు పెట్టాలి. కాబట్టి ఇరవైవేలు పట్టు కురా'' నీరజ వ్రాసిన ఉత్తరంలోని సారాంశం ఇది.

"ఆషాఢ పట్టీ పేరు చెప్పి ముప్ఫైవేలు పట్టుకెళ్ళి రెండు నెలలు కాలేదు. మళ్ళీ ఇప్పుడు ఇరవైవేలు తెమ్మంటోంది? ఏమను కుంటోంది అది? తన దగ్గర ధనరాశులు మూలుగుతున్నాయనుకుంటోందా? భర్త లేక పోయినా, ఎంత కష్టపడి వున్న భూమిని పట్టుకుని దాన్ని చదివించింది? ఇదివర కంతా ఎంతో ఆప్యాయంగా వుండే నీరజ తను కష్టపడితే చూడలేనిపిల్ల ఎందుకలా తయారయింది?" ఆవిడ చెంపలమీదనుంచి కన్నీళ్లు కురుస్తున్నాయి.

"ఏమయింది వదినా?" ఏడుస్తున్న ఆవి డని చూసి గాభరాపడిపోయింది అప్పుడే అక్కడకి వచ్చిన వరలక్ష్మి. మౌనంగా చేతి లోని ఉత్తరాన్ని ఆమెకి అందించింది. చదివి మ్రాన్పడిపోయిందావిడ.

"ఏం చెయ్యాలనుకుంటున్నారు?"

"ఏం చెయ్యగలనమ్మా? రెండు నెలల క్రిందటే కదా ముప్ఫైవేలు పట్టుకెళ్ళింది. మళ్ళీ అంత డబ్బు అంటే మాటలా? కష్టం, సుఖం ఆలోచించకుండా వేలకివేలు కావా లని వ్రాస్తే ఎక్కడనుంచి తేగలను?"

"వీలుకాదని వ్రాసెయ్యండి వదినా!"

"వ్రాసినా అది అర్థం చేసుకోదు. దానికి కావలసినది డబ్బు. భూమి అమ్మేసి బ్యాంక్‌లో డబ్బు వేసుకో అని కిందటిసారే చెప్పింది. ఇప్పుడూ అదేమాట చెబుతుంది''

"మరేం చేస్తారు?"

"ఈ పరిస్థితులలో రెండెకరాల పొలం అమ్మెయ్యడం తప్ప గత్యంతరం కనిపించ డంలేదు వదినా?"

"తొందరపడకండి వదినా! ఆలోచిద్దాం"

"ఇంకా ఆలోచించేదేమీ లేదు. అన్నయ్య కే ముప్ఫైవేల రూపాయలివ్వాలి నేను. ఇంక ముందు ముందు పండుగలని అవని, ఇవని ఏదోరకంగా వేలకి వేలు నీరజకి ఇస్తూనే వుండాలి. నా తర్వాత ఇచంతా దానికేగా? ఎప్పుడో ఇచ్చేది ఇప్పుడే ఇస్తాను'' స్థిరని శ్చయం లాంటిది ధ్వనించింది ఆవిడ స్వ రంలో.

ఆవిడ నిర్ణయం విన్న పరంధామయ్య అన్నాడు.

"తొందరపడుతున్నావేమోనమ్మా. ఆలో చించుకో!"

"బాగా ఆలోచించాకే ఈ నిర్ణయానికి వచ్చాను. నాకంటూ ఆప్తులెవరూ లేరు మీరు తప్ప. అందుకని మీరు ఎవరికైనా అమ్మిపె ట్టినా సరే, లేక మీరు కొనుక్కున్నా సరే!"

అన్నపూర్ణమ్మ పైకి మామూలుగా మాట్లా డుతున్నా లోలోన ఎంత చిత్రవధని అనుభ విస్తోందో ఆ ఇద్దరికీ తెలుసు.

"సరేనమ్మా! నీ ఇష్టం! పోనీ నేనే పుచ్చు కుంటాను. నీ పొలానికి, నా పొలానికి మధ్యలో ఆ రెండెకరాలూ ఎవడో పరాయివా డు తీసుకోవడమెందుకు? కాని రేటు ఎలా వుందో ఎవరినైనా అడుగుతానుగాని నువ్వా కనుక్కో'' అన్నాడు.

"సరేనన్నయ్యా!" అంది.

★ ★ ★

"అమరేశ్వరీ ఇండస్ట్రీస్' ప్రారంభోత్సవా నికి చాలామందే వచ్చారు. రకరకాల మను షులు, రకరకాల అలంకరణలు. అన్నపూర్ణ మ్మకి కొత్త ప్రపంచంలోకి వచ్చినట్టుంది. ఆవిడ ఒకపక్కగా కూర్చుండిపోయింది.

అక్కడకి వచ్చేముందు నీరజ తనతో చెప్పిన మాటలు ఆవిడ చెవులలో ప్రతిధ్వ నించసాగాయి.

"నువ్వు ఎవరితోనూ అనవసరంగా ఎక్కువగా మాట్లాడకు. అక్కడకి వచ్చే వా ళ్ళందరు ఖరీదైన మనుషులు. నువ్వు తెలి యక ఏదైనా అవకతవకగా మాట్లాడితే తప్పు పట్టుకుంటారు''

"అలాగేనమ్మా!" అందావిడ.

సాదా జరీచీర ధరించిన ఆవిడని అసంతృప్తిగా చూస్తూ "నీకు ఇంతకంటే మంచి చీరలు లేవా? ఎక్కడకి ఎలా రావాలో కూడా నీకు తెలియదు'' అంది అసహనంగా.

ఆవిడ నొచ్చుకుంటూ అంది. "పట్టుచీర ఒక్కటే వుందమ్మా. అది నీ పెళ్ళిలో కట్టానుకదా అని, వున్నవాటిలో ఖరీదైనది ఈ చీర పెట్లో వేసుకున్నాను. పోనీ, అక్కడకి రావడం మానెయ్యనా?"

"ఏమీ అక్కర్లేదు రా!" అంది ముఖం గంటు పెట్టుకుంటూ.

సరిగ్గా తొమ్మిది గంటల ముప్పై నిముషాలకి కార్మిక సంక్షేమమంత్రిగారి కారు ఫ్యాక్టరీ ఆవరణలో ఆగింది. మరో పది నిముషాలకి ప్రారంభోత్సవం.

మంత్రిగారు ఫ్యాక్టరీ ముఖద్వారానికి కట్టిన సిల్కురిబ్బన్ కత్తిరించగానే మిన్నంటేలా చప్పట్లు! ఫొటోలు! పూలదండలు!

మిషన్ ఆన్ చెయ్యగానే మళ్ళీ ఫొటోలు, పూలదండలు! మంత్రిగారి కిరువైపులా గౌతమ్, నీరజలతోబాటు అమరేశ్వరి కూడా ఫొటో దిగింది. వేరే కార్యక్రమం వుండడంతో ఆయన ఆయనతోబాటువచ్చిన పరివార జనం వెళ్ళిపోయారు.

తరువాత ఆహూతులకి ఫ్యాక్టరీ ఆవరణలో లంచ్! ఒకచేత్తో ప్లేటు పట్టుకుని ఎవరికివారే వడ్డించుకుని తింటున్న ఆ మనుషులని కళ్ళింత చేసుకుని చూస్తోంది అన్నపూర్ణమ్మ.

సర్వెంట్సు భోజనం చేస్తుండగా అప్పుడు తల్లి గుర్తువచ్చింది నీరజకి.

"నువ్వు భోజనం చేశావా?" తల్లి కూర్చున్నచోటకి వచ్చి అడిగింది.

"లేదు. మనందరం ఆఖర్న తినవచ్చుకదా అని ఆగాను''

"అప్పటికే తన భోజనం అయిపోయిందని చెప్పలేదు నీరజ. తల్లిపై అకారణంగా విరుచుకుపడింది.

"అసలేమిటి నువ్వు? అలా ఏదో కోల్పోయినట్టు బెంగ మొహంతో ఒంటరిగా కూర్చోకపోతే కాస్త ముఖాన నవ్వు పులుముకుని నలుగురితోనూ కలవవచ్చుగా?"

"నువ్వేకదమ్మా ఎవరితోనూ మాట్లాడవద్దని చెప్పావు. నలుగురిలోకి వస్తే ఏదో ఒకటి మాట్లాడక తప్పదుగా?"

"మంచిపని చేశావు! ఒక పక్కపనివాళ్ళ భోజనాలు కూడా అయ్యేట్టు వున్నాయి. ఏమైనా మిగిలిందేమో చూస్తానుండు'' నీరజ విసుగ్గా వెళ్ళి ప్లేటులో కాస్త అన్నం కూరలు కప్పుతో పెరుగు పంపింది.

కూతురికి కనీసం ఆమె భోజనం చేస్తున్నప్పుడైనా తను గుర్తురానందుకు అన్నపూర్ణమ్మకి బాధనిపించింది.

ఆవిడ "నాకు ఆకలి లేదు, తినను'' అని ఆ పళ్ళేన్ని తిప్పిపంపింది.

నీరజ ఈసారి స్వయంగా వచ్చి ఆ పళ్ళేన్ని తల్లికి ఇచ్చింది.

"తిను... అందరూ తిన్నారు. నువ్వొక్కర్తివీ తినకపోతే నాకు బాధగా వుంటుంది'' అంది దగ్గరే కూర్చుంటూ. కూతురి బలవంతంపై రెండు ముద్దలు తిని చెయ్యి కడుక్కుంది. తల్లి పట్ల నీరజ ప్రవర్తనని గమనిస్తున్న అమరేశ్వరి, గౌతమ్‌లిద్దరూ తటస్థంగా వూరుకుండిపోయారు.

కన్నతల్లిపట్ల ఆమెకే గౌరవం, అభిమానం లేనప్పుడు తమకేం పట్టిందనే భావం ఆ ఇద్దరిలోనూ స్పష్టమయింది.

ఇంటికి వెళ్ళాక నీరజ కట్టుకున్న పట్టు చీర, నగలు మార్చుకుని తల్లి దగ్గరకి వచ్చింది.

"ఎలా జరిగిందమ్మా ఫంక్షన్'

"చాలా బాగా జరిగిందమ్మా! చాలా మంది వచ్చారు'' మనస్ఫూర్తిగా అంది.



"రేపు వ్రతానికి కూడా వీళ్ళందరూ వస్తారా''

"ఎవరూ రారమ్మా! అత్తయ్యగారు దగ్గర వాళ్ళనైనా పిలుద్దామన్నారు. కాని గౌతమ్ ఒప్పుకోలేదు'' ఆవలిస్తూ అంది. "అబ్బ! వారం రోజులనుంచి ఈ ప్రారంభోత్సవం ఏర్పాట్లలో ఎంత అలసిపోయానో తెలుసా? కాస్సేపు పడుకుంటాను. మళ్ళీ సాయంకాలం షాపింగ్‌కి వెళ్ళాలి. బట్టలు కొనాలిగా? డబ్బు తెచ్చావా''

"తెచ్చానమ్మా'' అన్నపూర్ణమ్మ పెట్టె తెరిచినదల్లా కొయ్యబారిపోయింది. తను తెచ్చిన డబ్బు అందులో లేదు.

"అయ్యో! డబ్బేమయింది'' ఆక్రందనలా వుందావిడ స్వరం. "చీరలకింద పెట్టావేమో, సరిగ్గా చూడు'' నీరజ పెట్టెలోనుంచి తల్లి చీరలన్నీ తీసి మంచంమీద పడేసింది.

డబ్బేలేదు

"డబ్బేమయిపోయింది నీరజా'' ఆవిడ వణికిపోతూ పిచ్చిదానిలా చీరలమడతలు విప్పి చూస్తోంది.

"నువ్వసలు తెచ్చావా'' కూతురు అడిగిన దానికి ఆవిడ దెబ్బతిన్నట్టు చూసింది.

"అంటే! తను డబ్బు తేకుండానే పోయిందని నాటకం ఆడుతోందనా''

"అదేమిటమ్మా అలా అడుగుతున్నావు? నేను చీరలమధ్యలో పెట్టాను. పదులా, వందలా ఇరవైవేలు''

"ఒకవేళ ట్రెయిన్‌లో ఎవరైనా దొంగవెధవ పట్టుకుపోయాడేమో''

"లేదమ్మా! నేను కాకినాడలో రైలెక్కిన దగ్గరనుంచి పెట్టె నాకాళ్ళ దగ్గరే పెట్టుకున్నాను. బాత్‌రూమ్‌కి కూడా వెళ్ళలేదు''

"మరేమయిపోయింది''

"అడగకూడదు కాని నీరజా! ఇంట్లో పనివాళ్ళు మంచివాళ్ళేనా''

"ఇంకా నయం! ఆ మాట గట్టిగా అనేవు. కొంప మునిగిపోతుంది. వాళ్ళందరూ చాలా ఏళ్ళుగా ఈ ఇంట్లో పనిచేస్తున్న వాళ్ళు, చాలా నమ్మకస్తులు''

"అదికాదమ్మా! మనందరం ఫ్యాక్టరీకి వెళ్ళిపోయాం కదా, గదులకు తాళం పెట్టవద్దా అని అడిగితే నువ్వే కదా, అవసరం లేదన్నావు! అప్పుడు పనివాళ్ళెవరైనా ఈ గదిలోకి వచ్చి''

"అంటే! నేను గది తాళంపెట్టక్కర్లేదన్నాను కాబట్టి నావలనే ఆ డబ్బు పోయిందంటావా? అయినా తాళంలేని ఆ డొక్కు సూట్‌కేసు తప్ప నీకు వేరే మంచి పెట్టె కొనుక్కోవాలని తెలియదా? పోనీ, ఏ పెట్టెలో తెచ్చినా ఇక్కడకి రాగానే ఆ డబ్బు నాకు ఇవ్వలేకపోయావా''

"తప్పేచేసాను. కాని నాకెందుకో ఇంట్లో పనివాళ్ళే ఆ పని చేసారనిపిస్తోంది. ఒకసారి అడిగి''

"అమ్మా! నీకు మళ్ళీ చెబుతున్నాను. వాళ్ళు అలాంటి వాళ్ళు కాదు. అడిగినా మర్యాద వుండదు. నువ్వు మా ఇంటికి చుట్టపుచూపుగా వచ్చావు. నీ పెట్లో వున్న అంత డబ్బు పోయిందంటేనే మా అత్తగారి పరువు పోతుంది. ఇంక పనివాళ్ళని అనుమానిస్తే ఆవిడ భరించలేరు''

"మరి ఏం చెయ్యను'' నిస్సహాయంగా వుంది అన్నపూర్ణమ్మ స్వరం.

"రేపు వ్రతం చేసుకున్నప్పుడు మాకు బట్టలు పెట్టడం మానెయ్యి'' అక్కసుగా వుంది నీరజ స్వరం.

"మానెయ్యడం ఎందుకమ్మా? నీ దగ్గర వున్న డబ్బుతో బట్టలు కొనుక్కో. ఈసారికి మామూలు బట్టలు నాలుగైదు వేలల్లో కొనుక్కోండి. నేను ఇంటికి వెళ్లగానే డబ్బు పంపిస్తాను.

"ఏమిటీ! నాలుగైదు వేలల్లోనా? ఎంత చీప్‌గా వుంటుందో ఆలోచించావా? మాపెళ్ళయ్యాక మొదటిసారి మా ఇంట్లో జరిగిన ఫంక్షన్ ఇది. మా అత్తగారి ముందు నా




పరువేమవుతుంది''

అన్నపూర్ణమ్మ పొంగిపొరలి వచ్చే దుఃఖా న్ని అతిప్రయత్నంమీద ఆపుకుంటూ అంది.

"పోనీ, నీకు నచ్చినవే కొనుక్కో! ఇంటికి వెళ్ళగానే డబ్బు పంపిస్తాను''

"సరేలే! నీ డబ్బు పోయిన విషయం ఎవరితోనూ అనకు''

"అలాగే''

"నేను వెళ్ళి కాస్సేపు పడుకుంటాను. అసలే ఫంక్షన్‌లో అలసిపోయి ఇంటికి వస్తే ఈ డబ్బుపోయిన గొడవ ఒకటి'' నీరజ విసుగ్గా వెళ్ళిపోయింది.

గదిలో ఒంటరిగా నిలబడిపోయిన అన్న పూర్ణమ్మ గది తలుపు బిగించి, తనివితీరా ఏడ్చింది.

ఆ సాయంకాలం నీరజ అత్తగారితో, భర్తతో కలిసి బజారుకి వెళ్ళి బట్టలు కొని తెచ్చింది.

చీర తల్లికి చూపిస్తూ "బాగుందా'' అని అడిగింది.

"బాగుంది'' అందావిడ నిరాసక్తంగా.

"కిందకిరా! మా అత్తగారు నువ్విలా గదిలో కూర్చుని వుంటే ఏమైనా అనుకుంటా రు''

ఆవిడ కూతురిని అనుసరించింది.

అమరేశ్వరి ఫోన్‌లో మాట్లాడుతోంది.

"మీరు ఫంక్షన్‌కి రాలేదేమిటి జగదాంబగా రూ! ఏమిటి, ఒంట్లో బాగాలేదా? ఇట్సా ల్‌రైట్! నేనేమీ అనుకోనులెండి. మంచి డాక్ట రుకి చూపించుకోండి. అశ్రద్ధ చెయ్యకండి. మా వియ్యపురాలు వచ్చారు. గౌతమ్, నీర జా రేపు సత్యన్నారాయణవ్రతం చేసుకుంటా రు... ఆవిడ కూతురు అల్లుడితోబాటు నాకు కూడా బట్టలు కొన్నారు. ఇరవైవేలయింది బిల్లు. చాలా సరదా అయిన మనిషిలెండి. రేపు వ్రతానికైనా వీలు చూసుకుని రండి''

అన్నపూర్ణమ్మ పెదవులపై విరక్తి నిండిన చిరునవ్వు కదలాడింది.

"కోడలి పుట్టింటివాళ్ళు ఇరవైవేలుపెట్టి బట్టలు తెచ్చారని చెప్పుకోడం ఆవిడకి గొ ప్ప! ఆవిడ అహాన్ని సంతృప్తి పరచడం నీరజకి గొప్ప!''

★ ★ ★

ఆరోజు పొద్దుటే రుక్మిణి వచ్చింది. ఆది వారం కాబట్టి భాస్కర్ ఇంట్లోనే వున్నాడు.

"ఏమిటక్కా, ఇలా వచ్చావు? బావగారు రాలేదా?" అడిగాడు భాస్కర్.

"రాలేదురా! నేను నీతో కొంచెం మాట్లా డాలి''

"రా, కూర్చో, చెప్పు"

"అమ్మమ్మ పరిస్థితి ఏమీ బాగాలేదురా''

"ఏమయింది అమ్మమ్మకి'' కంగారుప డ్డాడు.

"మామయ్యలిద్దరూ ఆవిడని పట్టించు కోడం మానేసారు. పెద్దమామయ్య 'ఇన్నా ళ్ళూ నేను చూసాను. కొన్నాళ్ళు చిన్నవాడి దగ్గరకి వెళ్ళు' అని చెప్పేసాడుట. మామ య్యలిద్దరూ ఆవిడని చెరొక ఆరునెలలు వుంచుకుందామనుకున్నారుట. మొన్న పెద్ద మామయ్యావాళ్ళు వూరికి వెళ్తూ ఆవిడని చిన్నమామయ్య దగ్గర వదిలిపెట్టి వెళ్ళా రుట. అత్తయ్య పెద్ద గొడవ మొదలుపె ట్టిందిట. ఆరునెలలు అవకుండా ఎందుకొ చ్చావని అరిచిందిట. ఈ వయసులో ఆవిడ కేం కావాలిరా? ఆవిడకి గుప్పెడు మెతుకు లు పెట్టడం కూడా కష్టమేనా? నిన్న అమ్మ మ్మ దగ్గరకి వెళ్తే ఆవిడ ఒకటే ఏడుపు. ఆస్తి పంచుకున్నట్టే నా కొడుకులు నన్ను కూడా పంచుకున్నారు అని. మంచో చెడో పెద్దమా మయ్య దగ్గర వుందామంటే ఆయన బొంబాయి వెళ్ళి కూర్చున్నాడు. చిన్నత్త ఆవిడని ఒక్కనిముషం కూడా వుంచుకోనని చెప్పేసిందిట"

"అయ్యయ్యో''

"జాలేసి నేను ఆవిడని మా ఇంటికి

తీసుకెళ్ళాను''

"మంచి పని చేసావు! పెద్ద మామయ్యావాళ్ళు వచ్చేవరకు నీ దగ్గర వుంచుకో''

"అదెలా వీలవుతుందిరా? వుంచుకోడానికి మా ఆయన ఒప్పుకోవద్దూ? మామయ్య ఎప్పుడొస్తాడో, అసలు వస్తాడో రాడో! ఇరుగు పొరుగు వాళ్ళు అనుకోడాన్నిబట్టి తెలిసినదేమిటంటే మామయ్య ఇంక ఇక్కడకి రాడని బొంబాయిలో కొడుకుదగ్గరే సెటిలయిపోతాడని''

"మరెలాగ, అమ్మమ్మని ఎవరు చూస్తారు?"

"నీ దగ్గర వుంచుకోరా! పెద్దావిడ! నీకూ పెద్దదిక్కుగా వుంటుంది''

భాస్కర్ ఏదో ఆలోచిస్తూ మాట్లాడలేదు.

"పాపం! అమ్మమ్మ, అమ్మ పోయినప్పుడు, ఆ తరువాత మనకి ఎంత చాకిరీ చేసింది! ఆవిడ రుణం మనమెప్పటికీ తీర్చుకోలేం" రుక్మిణి సెంటిమెంటుమీద కొట్టిన ఈ దెబ్బ బాగా పనిచేసింది.

భాస్కర్ అంగీకరించాడు.

★ ★ ★

తులశమ్మ ఇంట్లో అడుగుపెడుతూనే "రండి అమ్మమ్మగారూ'' అని తనని ఆప్యాయంగా ఆహ్వానిస్తున్న ఉమని చూసింది.

కళ్ళు చిట్లించి చూస్తూ, "ఎవర్రా అది భాస్కరం! నీ పెళ్ళామేనా? ఎంత ఒళ్ళొచ్చింది! ఎంత రంగొచ్చిందీ! నేనసలు దాన్ని గుర్తుపట్టలేకపోయాను. పెళ్ళినాడు ఎంత సన్నగా వుండేది. అసలు మన మామిడన్నం వారి తిండి, నీళ్ళు వంట పడితే వెదురు కర్ర కూడా టేకుమానులా ఊరుతుంది''

గుమ్మంలో అడుగుపెడుతూనే ఆవిడ అన్న ఈ మాటలు ఉమ మనసుని చివుక్కుమనేలా చేసాయి. అంటే పెళ్ళికి ముందు





తను తిండికి ముఖం వాచిందనే కదా ఆవిడ మాటలకి అర్థం?

పళ్ళబిగువున ఆ అవమానాన్ని దిగమింగుకుని చిరునవ్వుతో అడిగింది.

"కులాసాగా వున్నారా, అమ్మమ్మగారూ?"

"ఆc! ఏదో పరమేశ్వరుడి దయవలన బాగానే వున్నాను''

తులశమ్మ వచ్చిన రెండు రోజులలోను వాగ్బాణాలతో ఉమ మనసుని తూట్లు పొడిచింది.

వచ్చిన రోజు సాయంకాలమే అడిగింది. "ఏమే అమ్మాయి. మీ అమ్మ పరిస్థితేమిటి? ఎలా గడుస్తోంది పాపం"

"మా అమ్మగారు సంగీతం పాఠాలు చెబుతారు కదండీ'' అంది పళ్ళబిగువున ఆగ్రహాన్ని అదుపుచేసుకుంటూ.

"ఆc! ఏం సంగీతంలే! ఎంతమంది చెప్పించుకుంటారు? ఎన్ని వందలిస్తారు? అయినా ఆవిడ పెద్దావిడ అయిపోతోందిగా? ఇంకా ఎంత కాలమని కష్టపడగలదు? ఏమిటో మా భాస్కరం అదృష్టం అలా వుంది. వెనకా, ముందూ ఎవరూ లేని సంబంధం వచ్చింది''

ఉమకి ఆవిడ ధోరణికి ఒళ్ళు మండిపోతోంది.

'తన తల్లి తిండికి ముఖం వాచిపోతోందని ఆవిడ ఉద్దేశం! ఒక కొడుకు అన్నం పెట్టడానికే ముఖం చూసుకుని, దూరంగా ఎక్కడకో వెళ్ళిపోయి ఇంకో కోడలు తరిమేస్తే తమ ఇంటికి తలదాచుకోడానికి వచ్చిన పెద్దమనిషి ఈవిడ! తన తల్లి ఒక పూట తిని మరోపూట పస్తులుండవచ్చు. కాని దేహీ అని యాచిస్తూ తన ఇంటికే కాదు ఎవరింటికీ వెళ్ళని స్వాభిమాని' అలా అనుకోగానే ఉమకి తల్లి వ్యక్తిత్వం ముందు తులసమ్మ ఎంతో అల్పురాలిలా అనిపించింది.

"అయితే అమ్మాయ్! మీ అమ్మ కాలు, చెయ్యి వంగాక ఎక్కడుంటుందీ? ప్రస్తుతం ఫర్వాలేదనుకో! తర్వాత? ఏమైనా ఆలో

చించారా?"

ఇదే ప్రశ్నని కొన్నాళ్ళక్రిందట సుందరరామయ్య పెళ్ళిచూపులలో అడిగినప్పుడు ఆయన తల తిరిగి పోయేలా జవాబిచ్చిన ఉమ ఇప్పుడు తులసమ్మకీ ముఖం వాచేట్టు జవాబివ్వాలనే అనుకుంది.

'కొడుకులు మహా ఉద్ధరిస్తున్నారేమిటండీ కొడుకులు వుండీ పరాయి పంచన తలదాచుకునే నిర్భాగ్యులు ఎందరో నాకు తెలుసు'' అని జవాబిచ్చి మాడిపోయిన ఆవిడ ముఖాన్ని చూడాలనుకుంది.

"కాని, పెద్దావిడ, కష్టంలో వుండి తమ ఇంటికి వచ్చింది. ఆవిడ ఏదో చాదస్తంగా అడిగితే తను నోరుపారేసుకోడం అనవసరం" అని ఆలోచించింది.

"ఇంకా మా అమ్మ ఓపికగానే వుందండీ! భగవంతుడి దయవలన ఆవిడకోసం ఆవిడ సంపాదించుకునే స్థితిలోనే వుంది. భవిష్యత్తు మన చేతులలో లేదు కదా'' అంది.

"అమ్మమ్మకి కాలక్షేపంకోసం" అంటూ రుక్మిణి రాకపోకలు ఎక్కువయ్యాయి. ఇద్దరూ కలిసి పిల్లిమీద ఎలుకమీద పెట్టి తనని విమర్శించడాన్ని అర్థంచేసుకోలేని అమాయకురాలేమీ కాదు ఉమ.

"ఉమకి ఎంత ఒళ్ళొచ్చిందో చూసావుటే'' తులసమ్మ నోటివెంట ఏ పదిసార్లో వినివుంటుంది ఈ మాట.

"అవును అమ్మమ్మా! పెళ్ళయిన రెండు నెలలకే మనిషి బాగా తేరుకుంది. ముఖంలో ధైర్యం వచ్చింది'' రుక్మిణి వత్తాసు!

ఉమకి నవ్వువచ్చింది.

'ధైర్యం రావడమేమిటో? ఇదివరకు తనేమైనా పిల్లిలా వుండేదా? ఇప్పుడు పులిలా ఉందా?'

తరువాత తరచి ఆలోచించగా ఆ మాటలలోని అర్థం బోధపడింది.

పెళ్ళికాకముందు భవిష్యత్ ఏమిటా అని భయంతో బతికిన తను కలలోనైనా ఊహించని విధంగా మంచి ఉద్యోగస్తుడిని భర్తగా పొంది, నిశ్చింతగా, ధైర్యంగా బతుకుతోందని అర్థం.

ఉమ మనసులో అవ్యక్తమయిన వేదన సుళ్ళుతిరుగుతోంది.

భర్త చిన్నతనంలో తనని చేరదీసిన అమ్మమ్మతో ప్రేమగా వుండడం తప్పుకాదు. కాని ఆవిడ పరోక్షంగా తనని విమర్శిస్తున్నా అతను ఆవిడ ఏదో జోక్ చేసినట్టు నవ్వడం ఆమెకి అమితమైన బాధని కలుగచేసింది. తన ఇల్లే తనకి పరాయిగా అనిపించసాగింది.

★ ★ ★

కొత్తకాపురం, కొత్త పరిసరాలు భర్త అనురాగంతో పల్లవికి రోజులు క్షణాల్లా గడచిపోతున్నాయి. చదివిన చదువుని సార్థకం చేసుకోవాలనే ఆమె కోరికను అరుణ్ బలపరచడంతో ఆమె కూడా ఒక పబ్లిక్ సెక్టార్‌లో ఇంజనీర్‌గా పనిచేస్తోంది.

సంక్రాంతి వచ్చింది మొదటి పండుగకి రమ్మని తల్లీ, తండ్రి ఇద్దరూ విడివిడిగా ఉత్తరాలు రాసి ఫోన్‌లో ఆహ్వానించడంతో అరుణ్, పల్లవిలు ఇద్దరూ బయలుదేరారు. బయలుదేరేముందు అత్తగారికి, ఆడబడుచులిద్దరికి, తోటికోడలికి మంచి గంధపు పెట్టెలు తన స్వంత సంపాదనతో కొంది. తల్లి ఎన్నాళ్ళుగానో మనసుపడి కొనుక్కోవాలనుకుంటున్న శ్రీరామ పట్టాభిషేకం మంచి గంధం చెక్కలో మలచినది కొంది.

రాజమండ్రిలో రైలు దిగిన రోజే అందరికీ తనుతెచ్చిన బహుమతులు ఇచ్చింది.

"చాలా బాగున్నాయి పల్లవీ! మీ అమ్మగారికి కూడా ఏమైనా కొనకపోయావా?" అడిగింది ప్రసన్న.

"కొన్నానండీ'' అంటూ తల్లికి కొన్న ఆ బొమ్మని చూపించింది.

"చాలా బాగుంది'' మెచ్చుకుంది.

ఆ సాయంకాలం మురళీధరరావు వచ్చి పండుగ మరునాడే కాబట్టి అందరినీ తమ

ఇంటికి రమ్మని ఆహ్వానించాడు.

"మీరిద్దరూ ఇవాళ రండమ్మా! మీ అమ్మ నిన్ను చూడాలని తపించిపోతోంది''

పల్లవి అరుణ్‌వైపు చూసింది.

"రేపు ప్రొద్దుట మా చెల్లెలు వాళ్ళు వస్తున్నారు. మేమంతా కలిసివస్తాం. కావాలంటే నువ్వు వెళ్ళు''

"నిజంగా వెళ్ళనా?" పల్లవి సంబరంగా అడిగింది.

"వెళ్ళు'' అన్నాడు. ఆమె చిన్నపిల్లలా గెంతుకుంటూ మేడమీదకి వెళ్ళి తన పెట్టెని సర్దుకోడం మొదలుపెట్టింది.

వెనకాలే వచ్చాడు అరుణ్.

"నేను వెళ్ళమనగానే పెట్టె సర్దుకోడం మొదలుపెట్టావన్నమాట" సీరియస్‌గా వున్న అతని స్వరం ఆమె చేస్తున్న పని ఆపేసేలా చేసింది.

"మీరే వెళ్ళమన్నారు కదండీ''

"అంతే మాత్రం! రేపు మా చెల్లెలు వచ్చేదాకా ఆగవన్నమాట"

"రేపు మీరందరూ కలిసి ఎలాగా మా ఇంటికి వస్తారు కదా అని''

"అయితే మాత్రం! ఆయన పిలవగానే వెళ్ళిపోడమేనా? మా చెల్లెలు వస్తున్నా ఆగవా''

ప్రమీల ఆ ఇంటికి రావడం మొదటిసారి కాకపోయినా అతను ఎందుకు ఆమె రావడానికి, తను పుట్టింటికి వెళ్ళడానికి ముడిపెడుతున్నాడో ఆమెకి అర్థంకాలేదు. ఆమె మౌనంగా చిరునవ్వు ముఖాన పులుముకుని కిందకి వచ్చింది.

"నేను రేపు మా అత్తగారు వాళ్ళతో కలిసివస్తాను. రేపు మెడ్రాస్‌నుంచి మా ఆడబడుచు కూడా వస్తున్నారు'' అంది తండ్రితో

"సరేనమ్మా!" చేసేదేం లేక వెళ్ళిపోయాడాయన. పల్లవికి అరుణ్ ధోరణి అర్థంకావడం లేదు. అందరిలో వెళ్ళమని చెప్పడం, విడిగా పిలిచి వెళ్ళవద్దనడం. ఒకటి మాత్రం అర్థమయింది. అతనికి తన కుటుంబసభ్యుల తర్వాతే ఎవరయినా. ఆ రాత్రి పల్లవి అతనితో మనస్ఫూర్తిగా మాట్లాడలేకపోయింది. అతను మాత్రం అతి మామూలుగా ప్రవర్తించాడు.

"మిమ్మల్ని ఒక విషయం అడగవచ్చా?"

"అడుగు''

"మీ చెల్లెలు మెడ్రాస్‌నుంచి రావడం రేపు మొదటిసారి కాదు కదా! ఆవిడ పెళ్ళయి అయిదేళ్ళు కావస్తోంది. ఆవిడ వస్తున్నారని నన్ను మా నాన్నగారితో వెళ్ళనివ్వకుండా అడ్డుకున్నారే, మరి నేను! మా అమ్మని చూసి మూడు నెలలయింది. నేను హాస్టల్‌లో వుండి చదువుకునే రోజులలో కూడా మా అమ్మానాన్నలిద్దరూ ఖాళీ దొరికినప్పుడల్లా వచ్చేవారు. అసలు ఇన్నాళ్ళు వాళ్ళిద్దరినీ చూడకుండా ఎప్పుడూలేను. మరి నాకెంత బెంగవుండాలి?"

అతనోక్షణం ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"నోర్మూసుకుని నేను చెప్పినట్టు వినడమే! ఇంక నాతో వాదించవద్దు'' అతను నవ్వుతూనే అన్నా ఆ స్వరంలోని తీవ్రత ఆమెకి అర్థమయింది.

"అతను తనతో వాదించడంలేదు. అతను చెప్పినట్టు వినమని తనని శాసిస్తున్నాడు'' పల్లవి కళ్ళల్లో నీళ్ళూరాయి. ఆమె లేచి బాల్కనీలోకి వెళ్ళిపోయింది.

అరుణ్ మనస్తత్వం తనకి కొంచెం అర్థమయిందనుకుంది. పూర్తిగా అర్థమవడానికి ఇంకెన్నిరోజులు పడుతుందో? ఎవరో అన్నట్టు దిగనిదే లోతు తెలియదు.

మరునాడు అందరూ రెండు కార్లలో బయలుదేరారు. పల్లవి ఇంట్లో అడుగుపెడుతూనే తల్లిని కౌగలించుకుంది. ఆమె కన్నీళ్ళు తల్లి భుజంపై వర్షిస్తున్నాయి.

"పిచ్చా! ఏమిటిది?" అరుంధతి కళ్లలోనూ నీళ్ళూరాయి.




ప్రసూన, ప్రమీల కిసుక్కున నవ్వారు.

ఆ నవ్వు పల్లవి మనసుని మండించింది. పెళ్ళయి అయిదేళ్లయినా మెడ్రాస్ వెళ్తూ ఆమెతల్లిని కౌగలించుకుని ఏడవడం గుర్తుకువచ్చింది. ఆరోజు పసిపిల్లలా ఏడ్చిన ఆమెకి ఇప్పుడు తనుఏడుస్తుంటే నవ్వొస్తోందా? చాలామంది అంతే! ప్రేమ, మమతలు, అనుబంధాలు తమకే పరిమితం అనుకుంటారు. ఒక్కొక్క సంఘటన ఆ మనుషుల మనస్తత్వాలను బట్టబయలు చేస్తూ వాళ్ళపై వున్న గౌరవాన్ని పోగొడుతుంది.

మధ్యాహ్నం భోజనం అయ్యాక అందరూ తమకి కేటాయించిన గదులలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఫోన్ మోగింది. డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి ఫోన్ మాట్లాడిన పల్లవి ఆ ఫోన్‌కాల్ ప్రసన్న భర్త చేశాడని ఒక నిముషం మాట్లాడి ఆమెని పిలవడానికి గది దగ్గరికి వచ్చింది.

"పల్లవి వాళ్ళమ్మగారికి శాండల్‌వుడ్‌తో చేసిన శ్రీరామ పట్టాభిషేకం తెచ్చింది. ఎంత బాగుందో?" అంటోంది ప్రసన్న.

"ఆరువేల పైచిలుకే! మొన్ననే మా ఆయన ఎవరికో ప్రెజంట్ చేశారు'' ప్రమీల అంటోంది.

"పల్లవికి పంచుకోడానికి, వంతుకి రావడానికి ఎవరూ లేరులే! తను వాళ్ళమ్మగారికి తెచ్చినదల్లా ఎలాగా తనకే' అంటోంది అత్తగారు.

పల్లవి స్థాణువయింది. ఆమెకి ఆ మనుషుల మనస్తత్వానికి అసహ్యం వేస్తోంది. తనలో చెలరేగే ఏహ్యతని, తిరస్కారాన్ని అతిప్రయత్నం మీద సంబాళించుకుని తలుపు తట్టింది.

"నువ్వా! పల్లవీ లోపలికి రా! కాస్సేపు పడుకోలేకపోయావా?" అంది ప్రసన్న ఎంతో ఆప్యాయంగా నవ్వుతూ.

ఆమె అడిగిన దానికి సమాధానం ఇవ్వకుండా "అన్నయ్యగారు ఫోన్ చేశారు. లైన్‌లో వున్నారు'' అని అక్కడనుంచి వచ్చేసింది.

అత్తగారి మాటలు చెవులలో ప్రతిధ్వనిస్తుంటే ఆమెకి ఆవిడ సంకుచిత మనస్తత్వానికి కంపరంగా వుంది.

"తనకి పంచుకోడానికి ఎవరూ లేరు కాబట్టి తనెంత ఖరీదైన బహుమతి తెచ్చి తల్లికి ఇచ్చినా ఫర్వాలేదుట. తనకి తోబుట్టువులు వుంటే తన సొమ్ము బయటికి పోతుందనేగా అర్థం? ఛీ ఛీ!"

ఆ సాయంకాలమే అందరూ ప్రయాణమయ్యారు. అందరితోబాటు ప్రయాణమవుతున్న అరుణ్‌తో అన్నాడు మురళీధరరావు.

"రేపు సంక్రాంతి! ఈ రెండు రోజులూ ఇక్కడే వుండవచ్చు కదా!"

"లేదండీ! మా చెల్లెలు వచ్చింది కదా! మేం మా ఇంట్లోనే వుంటాం. మళ్ళీ ఎన్నాళ్ళకి కలుస్తామో! కావాలంటే పల్లవిని వుంచుకోండి''

అతను చెప్పినది విన్న పల్లవి అతను గదిలో బట్టలు మార్చుకుంటూంటే అడిగింది.

"నేనూ వచ్చేస్తాను''

"ఎందుకు? కావాలంటే నువ్వు వుండు''.

"నిన్న మా నాన్నగారి ఎదురుగా వెళ్ళమని విడిగా నన్ను పిలిచి వెళ్ళవద్దన్నట్టేనా ఇదీను''

"కాదు..." వెంటనే అన్నాడు. "నువ్వు రేపు ఎల్లుండి ఇక్కడే వుండిరా. శనివారంనాడు మన ప్రయాణం"

"సరే' అంది.

అందరూ వెళ్ళాక తల్లి దగ్గర కూర్చుంటూ అంది.

"ఎంత ప్రశాంతంగా వుందమ్మా! ఆ మనుషులు, ఆ మాటలు... అబ్బ! సినిమాలలో చూసి, పుస్తకాలలో చదివి అత్త ఆడబ

డుచులు ఇలా వుంటారా అని ఆశ్చర్యపడేదా న్ని. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను''

"అప్పుడే అత్తవారిపై మొహం మొత్తిందా తల్లీ'' మురళీధరరావు అడిగాడు.

"మొహం మొత్తడం కాదు నాన్నగారూ! వాళ్ళ మనస్తత్వాలకి విసుగేస్తోంది''

"మనుషులందరూ ఒకలాగే వుంటారా? ఒక తల్లికి పుట్టిన బిడ్డలలోనే రకరకాల మనస్తత్వాలు, భిన్న అభిప్రాయాలు. వేరు వేరు కుటుంబాలలోని వ్యక్తులు కలిసి వున్నప్పుడు భేదాభిప్రాయాలు రావడం సహజమే. పెళ్ళి అంటే ఇద్దరు వ్యక్తులని కలిపేది కాదు. రెండు కుటుంబాల కలయిక. ఒక కుటుంబంలోని అమ్మాయిని వేరొక కుటుంబంలోని అబ్బాయిపెళ్ళి చేసుకుని ఆ రెండు కుటుంబాల మధ్య బంధుత్వాన్ని, అంతకుమించి స్నేహాన్ని వృద్ధి చెయ్యాలి. చూడమ్మా పల్లవీ! నీకు తోబుట్టువులెవరూ లేరు. నీ భర్త అక్కచెల్లెళ్ళే నీ అక్కచెల్లెళ్ళు. అతని అన్నదమ్ములే నీ అన్నదమ్ములు. నీ అక్కయ్యో, అన్నయ్యో నిన్ను విమర్శిస్తే వాళ్ళపట్ల ఏహ్యాభావాన్ని పెంచుకుంటావా?'' నచ్చచెబుతున్న ధోరణిలో అన్నాడు.

"వాళ్ళూ నన్ను అంత అభిమానంగానూ చూడాలి కదా నాన్నా'' అందామనుకున్న పల్లవి అతి ప్రయత్నం మీద తననితాను సంబాళించుకుంది.

"పండుగ రోజున అతనక్కడ, నువ్విక్కడ వుండడం ఏమిటి? నువ్వూ అక్కడే వుండమ్మా'' అంది అరుంధతి.

"నాకు ఇక్కడే వుండాలనిపిస్తోందమ్మా'' అంది పల్లవి తల్లి ఒడిలో పడుకుంటూ.

"దాని మనసులో ఏదో బాధ వుంది'' అనుకుంది అరుంధతి తడి కళ్లతో ఆదుర్దాగా చూస్తూ.

★ ★ ★

పల్లవి ఆదమరచి నిద్రపోతోంది. పగలంతా ఇంటిపని, వంటపని, ఆఫీసు వర్క్‌తో అలసిపోయిన ఆమెకి రాత్రి పదిదాటితే ఒళ్ళు తెలియని నిద్ర ముంచుకొచ్చేస్తుంది.

అరుణ్‌కి వంట చేయడం తెలుసును. అమెరికాలో వుండగా అతను శాకాహారి కావడంవలన బయట రెస్టారెంట్స్‌లో అది దొరకదు కనుక తనే స్వయంగా వండుకునేవాడు. ఇప్పుడు కూడా తనకి నచ్చిన వంటకాలని తనే చేస్తాడు. కానీ పల్లవి ఒక్కర్తీ వంటింట్లో సతమతమవుతుంటే సహాయం చెయ్యడు.

చదువుకునే రోజులలో సెలవులకి ఇంటికి వచ్చినప్పుడు తల్లి వెనుక చిన్న చిన్న పనులు చెయ్యడం అలవాటున్నా ఒక్కసారిగా గృహబాధ్యత నిర్వహించవలసి వచ్చేసరికి పల్లవి అలసి పోతోంది.

ఒళ్ళు తెలియనంత గాఢనిద్రలో వున్న పల్లవి తన నడుముమీద ఎవరో గట్టిగా గిల్లేసరికి ఉలిక్కిపడి కళ్ళు విప్పింది.

ఎదురుగా అరుణ్.

అతని చేతిలో ఫోన్ వుంది. మౌత్‌పీస్‌ని అరచేత్తో మూసి పట్టుకున్న అతను "బయటికి వెళ్ళు'' అన్నాడు.

నిద్రమత్తులో వున్న పల్లవికి తనని గిల్లినది అతనే అని అర్థమయ్యేసరికి అరనిముషం పట్టింది. ఆపైన అతనేమంటున్నాడో అర్థమయ్యేసరికి మరో నిముషం పట్టింది.

"నీకే చెప్పేది. బయటికి వెళ్లు. మా చెల్లెలు మద్రాస్ నుంచి ఫోన్ చేసింది. నేను మాట్లాడాలి. అవతలకి వెళ్ళు''

పల్లవికి నిద్రమత్తు ఎగిరిపోయింది. విచిత్రంగా అతన్నోసారి చూసి బయటికి వెళ్ళిపోయింది. ఆమె వెనుకనే అతను తలుపు ధడాల్న మూసిన చప్పుడు.

ఆమె అయోమయంగా అక్కడున్న సోఫాలో కూలబడింది. "ఏమిటంత తను వినకూడని రహస్యం? తను వింటుందనే భయంతో గాఢనిద్రలో వున్న తనని గిల్లి లేపి బయటికి పంపి తలుపు మూసుకుని మరీ




చెల్లెలితో మాట్లాడవలసిన అవసరం ఏమిటి?" ఆలోచిస్తున్న కొద్దీ పైకి అందంగా, హుందాగా ఎంతో సంస్కారవంతునిలా కనిపించే అరుణ్‌లోని మరో మనిషి వికృతరూపంతో కనిపిస్తున్నాడు. అతను గిల్లినచోట చురుక్కుమని మంట పెడుతోంది.

పావుగంట తరువాత అతను తలుపు తెరిచాడు.

"లోపలికిరా''

పల్లవికి అతను అతి మామూలుగా పిలవడం ఆశ్చర్యాన్ని కలుగచేసింది. ఆమె కూర్చున్న చోటనుంచి లేచే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. అతనే ఆమె దగ్గరికి వచ్చాడు.

"మా చెల్లెలు ఎలా వుందని అడగవేం?"

ఆమె మాట్లాడలేదు.

ఆమె మౌనంతో అతను ఇరిటేట్ అయ్యాడు.

"ఏమిటి, మాట్లాడవా? నేను ఇంత వాగుతున్నా మాట్లాడకపోవడానికి అర్థం ఏమిటి? నిర్లక్ష్యమా, పొగరుబోతు తనమా?" అరిచాడు.

"ముందిది చెప్పండి. హాయిగా నిద్రపోతున్న నన్ను గిల్లి లేపి బయటికి పంపవలసిన అవసరం ఏమిటి?"

"మా కుంటుంబ వ్యవహారాలు లక్ష మాట్లాడుకుంటాం. నువ్వు వినవలసిన అవసరం లేదు''

"రహస్యాలను పొంచివుండి వినే కుసంస్కారం నాకులేదు. నేను మంచి నిద్రలోవున్నానని మీకూ తెలుసు. తెలిసే పనిగట్టుకుని నన్ను లేపడం ఎందుకు?"

"నిద్రపోతున్నావో, నిద్ర నటిస్తున్నావో నాకేం తెలుసు?"

పల్లవి ఒళ్ళు తెలియని కోపంతో నిలువెల్లా వణికింది.

"నటించడం నాకంటే మీ అక్కచెల్లెళ్లకే బాగా చేతనవును. మనసులో అయిష్టాన్ని నింపుకుని పైకి ప్రేమను నటించే గొప్ప నటులు'' అక్కసుగా అంది.

"నోర్ముయ్!" అరుణ్ చెయ్యెత్తి బలంగా ఆమె చెంపపై కొట్టాడు. పల్లవి చెంపపట్టుకుని శిలా ప్రతిమలా నిలబడిపోయింది.

"అతను తనని కొట్టాడు. అంతకంటే దారుణంగా మనసుని గాయపరిచాడు'' ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి. కానీ, మనసు మండిపోతోంది.

అరుణ్ విసురుగా బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయాడు.



పార్వతమ్మ డాక్టరుగారి ఇంటి తలుపు తట్టింది. డాక్టరుగారి భార్య శ్యామసుందరి ఆవిడని చూస్తూనే ముఖం చిట్లించింది.

"ఇన్నాళ్ళూ ఏమయిపోయారు పార్వతమ్మగారూ?" విసుగుదలగా అడిగింది.

"జ్వరం వచ్చిందండీ! రాలేకపోయాను'' చెప్పిందావిడ.

"కనీసం కబురైనా పంపకపోతే ఎలాగండీ? మీరు వస్తారని రోజుల తరబడి ఎదురుచూస్తూ కూర్చోవాలా? మా అమ్మాయికి ఒకవైపు పరీక్షలు దగ్గరపడుతున్నాయి.

మీరు ఇలా అమావాస్యకి, పౌర్ణమికి వచ్చి పాఠం చెబితే ఎలా పాసవుతుంది?"

"ఇవాళ్టినుంచి మరోగంట ఎక్కువ చెబుతానమ్మా! మీ అమ్మాయి సూక్ష్మగ్రాహి. సహజంగా సరస్వతీ కటాక్షం వున్నపిల్ల. ఎంత కష్టమైన రాగాన్నైనా ఇట్టే ఆలాపిస్తుంది''

"చాలు చాలు... ఈ పొగడ్తలకేంగానీ అమ్మాయికి వారం కిందటే కొత్త టీచరు కుదిరారు''

పార్వతమ్మ కాళ్ళకింద భూమి కంపించింది "ఒక పాఠం పోతే వంద రూపాయలు నష్టపోయినట్టే తను. అప్పు ఎలా తీర్చాలా అని సతమతమవుతుంటే భగవంతుడు ఇలా పరీక్షిస్తున్నాడేమిటి?"

ఆవిడ నోరు తెరిచి ఏదో చెప్పబోయేంతలో శ్యామసుందరి లోపలకి వెళ్ళిపోయింది.

కాళ్లీడ్చుకుంటూ ఇంటిదారి పట్టిందావిడ.

నిధి చాలా సుఖమో.

రాముని సన్నిధి చాల సుఖమో నిజముగ

బల్కు మనసా...

అంటున్న త్యాగరాజు గుర్తు వచ్చాడు. "నిధికూడా అవసరమే. ఈ ప్రపంచం డబ్బు చుట్టూ తిరుగుతోంది. డబ్బుతో చాలా కొనవచ్చు. డబ్బులేనిది అవడం వలనే కదా తనని అందరూ ఆకుకూరలో పురుగులాగా విదిలించి వేస్తున్నారు'' ఆవిడ పెదవులపై విషాద రేఖ కదలాడింది. అడుగులు నీరసంగా పడుతున్నాయి.

దారికి అడ్డంగా నడుస్తున్న ఆమె వెనుకనుంచి వస్తున్న స్కూటర్ని చూసుకోలేదు. స్కూటర్ నడుపుతున్న యువకుడు సడన్ బ్రేక్ వేశాడు.

స్కూటర్ తనని గుద్దేస్తోందనే భయంతోనో, చాలా రోజులుగా పోషకాహారం లేని నీరసంతోనో ఆవిడకి స్పృహతప్పింది.

కళ్ళు తెరిచేప్పటికి ఆవిడ హాస్పిటల్ బెడ్మీద వుంది. చేతికి సెలైన్ ఎక్కుతోంది. స్టెతస్కోపుతో పరీక్షిస్తున్న డాక్టరు కళ్ళు దయని వర్షిస్తున్నాయి.

"నేను ఎక్కడ వున్నాను?" ఆవిడ స్వరం నూతిలోనుంచి వచ్చినట్టుగా వుంది.

"మీరు రోడ్డుమీద స్పృహతప్పి పడిపోయి వున్నారుట. ఎవరో ఒకతను మిమ్మల్నిక్కడ చేర్పించాడు. ఇది గవర్నమెంటు హాస్పిటల్' చెప్పాడాయన.

"మీరు చాలా ఎనీమిక్గా వున్నారు. బలవర్ధకమైన ఆహారం తీసుకోవాలి. మందులు కూడా వాడాలి''

పార్వతమ్మ పెదవులపై విరిగిన పాలలాంటి నవ్వు కదలాడింది. మరో గంటకల్లా ఆవిడ డిశ్చార్జి చెయ్యబడింది.

హాస్పిటల్ గేటు దాటుతూ అనుకుందావిడ.

'తనని హాస్పిటల్లో చేర్పించిన ఆ మహానుభావుడెవరో, అతనికి దేముడు ఆయురారోగ్యాలని ప్రసాదించాలి'

ఆ మహానుభావుడు తన అల్లుడు భాస్కరేనని ఆవిడకి తెలియదు.

★ ★ ★

భాస్కర్ తన స్కూటర్కి అడ్డంగా వచ్చిన ఆ నడివయస్కురాలిని చూసి కంగారుపడి సడన్ బ్రేక్ వేశాడు. పరిశీలనగా చూస్తే ఆవిడ తన అత్తగారు. అప్పటికే ఆవిడ స్పృహ కోల్పోయి వుంది.

రోడ్డుమీద జనం చుట్టూ చేరిపోతున్నారు.

"పెద్దావిడని గుద్దేశాడు''

"పోలీసులని పిలవండి. వాళ్ళే చూసుకుంటారు''

"కళ్ళు నెత్తిమీద పెట్టుకుని డ్రైవ్ చేస్తున్నాడు కాబోలు'' జనంలో నుంచి రకరకాల వ్యాఖ్యానాలు వినిపిస్తున్నాయి.

"నేను కరెక్టు సైడునే వస్తున్నాను. ఆవిడ స్కూటర్కి అడ్డంగా వచ్చింది. నేను బ్రేక్ వేసేప్పటికే ఆవిడ పడిపోయి వుంది. నా




స్కూటర్ ఆవిడని గుద్దలేదు. ఆవిడకి భయంతో స్పృహ తప్పివుంటుంది'' వివరణ చెప్పాడు భాస్కర్.

జనంలోనుంచి ఒక వ్యక్తి వచ్చి ఆవిడని పరీక్షించి "నిజమే! దెబ్బలేమీ తగలలేదు. కానీ హాస్పిటల్‌కి తీసుకెళ్తే మంచిది'' అని సలహా ఇచ్చాడు.

భాస్కర్‌కి పచ్చి వెలక్కాయ గొంతులో ఇరుక్కున్నట్టయింది. "హాస్పిటల్ అంటే పెద్దఖర్చు. అవసరం వున్నా లేకపోయినా టెస్ట్‌ల పేరు చెప్పి వందలకి వందలు గుంజుతారు.

'గవర్నమెంటు హాస్పిటల్‌లో చేర్పిస్తే సరి. డబ్బు ఖర్చు వుండదు'' అనుకున్న అతను "ఎవరైనా ఆవిడని సాయం పట్టండి. హాస్పిటల్‌కి తీసుకెళ్తాను' అన్నాడు.

జనంలోనుంచి ఒక వ్యక్తి ముందుకొచ్చాడు. అత్తగారు కూర్చున్న ఆ రిక్షాని స్లోగా స్కూటర్ మీద ఫాలో అవుతున్న భాస్కర్ "ఆవిడకి తను అక్కడ వుండగా స్పృహరాకూడదు'' అని భగవంతుని ప్రార్థించాడు. భగవంతుడు అతని మొర ఆలకించాడు.

ఆవిడని గవర్నమెంటు హాస్పిటల్‌లో వదిలేసి వస్తున్న భాస్కర్ కళ్ళు అప్రయత్నంగానే చెమర్చాయి. ఏ మనిషి అయినా తను చేస్తున్నపని సబబే అని తనని తాను మభ్యపెట్టుకోవచ్చు. కానీ అంతరాత్మని మభ్యపెట్టుకోలేడు. భాస్కర్‌కి తను చేసిన పని తప్పు అని తెలుసు. కానీ ఆవిడకి స్పృహ వచ్చేదాకా ఆగితే అక్కగారు చెప్పినట్టు నేలది తీసి నెత్తికి రాసుకున్నట్టు అవుతుందేమో! ఎందుకొచ్చిన గొడవ? అతను అంతరాత్మ నోరు నొక్కి స్కూటర్ స్టార్ట్ చేశాడు.

ఇంటికి వచ్చేటప్పటికి తులసమ్మ నీరసంగా మంచంమీద పడుకుని వుంది.

"ఏమయింది? ఎందుకలా వున్నావ్ అమ్మమ్మా?..."

ఆదుర్దాగా అడిగాడు.

'పొద్దుటనుంచి ఒకటే విరేచనాలురా! నీరసంతో ప్రాణం పోయేట్టువుంది'' మూలుగుతూ చెప్పింది.

"ఉమా!" అతను పిలుస్తూ పెరట్లోకి వెళ్ళాడు.

తులసమ్మ పంచె ఉతుకుతున్న ఉమ "వస్తున్నానండి'' అంది.

"ఏమిటి, ఈ వేళప్పుడు బట్టలు ఉతుకుతున్నావ్?"

"అమ్మమ్మగారికి పాపం పంచెలోనే విరేచనమయిపోయింది. ఉతుకుతున్నాను''

ఆ సమాధానం భాస్కర్ గుండెని తాకింది. భార్య తల్లిని నిర్దాక్షిణ్యంగా గవర్నమెంటు హాస్పిటల్‌లో చేర్పించి కనీసం ఆవిడకి స్పృహ వచ్చేవరకు అయినా వుండకుండా ముఖం చాటేశాడు తను. కానీ, ఉమ తన అమ్మమ్మ బట్టలని ఉతుకుతోంది. అతని మనసుని పశ్చాత్తాపం రగిలించింది.

"నువ్వెందుకు ఆ బట్టలు ఉతుకుతున్నావ్? పనిమనిషి చేత ఉతికించలేకపోయావా?"

"అడిగాను. ఉతకనంది'' ఉమ పంచె ఆరేసి కాళ్ళు చేతులు సబ్బుతో కడుక్కొని వచ్చి కాఫీకోసం స్టవ్‌మీద పాలు పెట్టింది.

ఈలోగా రుక్మిణి స్వరం వీధివాకిట్లో బిగ్గరగా వినిపించింది.

"అయ్యో! అమ్మమ్మా! అంత నీరసంగా వున్నావేమిటి? జ్వరమా?"

"కాదే తల్లీ! మాయదారి విరేచనాలు పట్టుకున్నాయి''

"నువ్వంత నీరసంగా వుంటే ఉమ ఏం చేస్తున్నట్టు?"

"ఉమా'' తీవ్ర స్వరంతో పిలిచింది.

"వస్తున్నానండీ'' ఉమ భాస్కర్‌కి కాఫీ ఇచ్చి ఇవతలకి వచ్చింది. "ఇప్పుడే వచ్చారా? కాఫీ తెస్తాను'' అంటూ తిరిగి వంటింట్లోకి వెళ్లబోయింది.



"చాలు ఈ మర్యాదలకేం గానీ, అమ్మమ్మకి పొద్దుటనుంచి విరేచనాలు. ఎంత నీరసించిపోయిందో చూశావా? డాక్టరు దగ్గరకి తీసుకెళ్లకుండా ఏం చేస్తున్నావ్?"

"ఆవిడే వద్దన్నారండీ! అజీర్తి విరేచనాలే కదా అని. వాముపొడి అన్నంలో వేసి పెట్టి కొంచెం సగ్గుజావ ఇచ్చాను''

"గొప్పపని చేశావ్! ఆవిడ వయసెంతో తెలుసా? ఎనభై ఏళ్ళు. జరగకూడనిదేదైనా జరిగితే ఎంత అప్రతిష్ట! తగుదునమ్మా అని ఇంట్లోపెట్టుకున్నాం. రోగమొస్తే డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళకుండా ఆవిడ ప్రాణాలమీదకొస్తే లోకం ముఖాన ఉమ్మి వేస్తారు. రా అమ్మమ్మా... డాక్టర్ దగ్గరకి తీసుకెళ్తాను. నువ్వా రారా! ఇవాళ ఒక్కరోజు పొద్దుటే ఇక్కడకి రానందుకు అంతా తలకిందులయిపోయింది''

భాస్కర్ మారుమాట్లాడకుండా ఆమెని అనుసరించాడు.

ఉమ పెదవి కొరుక్కుంటూ వుండిపోయింది. నిన్న భాస్కర్ పుట్టిన రోజుకదా అని బొబ్బట్లు చేసింది. తులసమ్మకి జిహ్వాచాపల్యం ఎక్కువ. దంతాలు వూడిపోయినా అన్ని రుచులూ కావాలి. నిన్న బొబ్బట్లు కాసిని ఎక్కువే తింది. అవి అరగక కడుపు పాడయింది.

తిని జీర్ణం చేసుకునే శక్తి వుండీ పచ్చడి మెతుకులతో కడుపునింపుకునే తల్లి గుర్తొచ్చి కన్నీళ్ళు వచ్చాయి ఉమకు.

"ఎలా వుందో అమ్మ! వెళ్లి చూడాలి'' అనుకుంది.

★ ★ ★

"మీరు కాస్సేపు వుంటారా? నేను మా అమ్మదగ్గరకి వెళ్ళి గంటలో తిరిగి వచ్చేస్తాను'' అంది ఉమ.

కబుర్లు చెప్పుకుంటున్న రుక్మిణి, తులసమ్మ ముఖాలు చూసుకున్నారు.

"భాస్కర్ వెళ్లమన్నాడా?" అడిగింది రుక్మిణి అదోలా చూస్తూ.

"ఆయన ఇంట్లో లేరు కదండీ! మీతో చెప్పే వెళ్తున్నానుగా?" ఆమెకి ఆడబడుచు ధోరణి ఒళ్ళు మండిస్తోంది. 'ఈవిడగారు మొగుడి పర్మిషన్ తీసుకునే రోజూ తమ్ముడింటికి వస్తోందా?' ఆ మాటే అడగాలనుకుని మళ్లీ తమాయించుకుంది.

"వెళ్తే వెళ్ళు'' అంది రుక్మిణి దయతలచినట్టు.

ఉమ గడపదాటింది.

"అమ్మకి ఏం పట్టుకుపోతోందో' అంది తులసమ్మ.

"చేతిలో పర్సు లేదుగా అమ్మమ్మా?"

"పర్సు ఎందుకే అమాయకపు దానా. రహస్యంగా పట్టికెళ్ళేవాళ్ళు ఇంకోచోట దాచుకుంటారు'' అంది తులసమ్మ జాకెట్టు చూపిస్తూ, అందులో దాచుకోవచ్చని సైగచేస్తూ.

ఉమ లోపలకి వచ్చింది. ఆమె వెళ్లిపోయిందనుకుని బిగ్గరగానే మాట్లాడుకుంటున్న ఆ ఇద్దరూ తేలు కుట్టిన దొంగల్లా మిన్నకుండిపోయారు.

"రుమాలు మరిచిపోయానండి'' అంది ఉమ. భావరహితంగా వున్న ఆమె ముఖం చూసి ఆమె తమ మాటలు విని వుండదని నిర్ధారణ చేసుకున్న ఆ ఇద్దరూ సంతృప్తిగా నిట్టూర్చారు.

ఉమ రుమాలు తీసుకుని వెళ్ళిపోయింది. ఇలాంటి మాటలు వినడానికి అలవాటు పడిపోయినా, తన తల్లిపై, తనపై వాళ్ళకి ఎంత చులకన భావం వుందో అర్థమైనా ఆమెకి ఎప్పటికప్పుడు బాధపడుతోందే తప్ప వాళ్ళని ఎదిరించలేకపోతోంది. ఉమ తలుపు తట్టగానే పార్వతమ్మ తలుపు తీసింది. జ్వరపడినప్పటికంటే ఇంకా చిక్కిపోయిన తల్లిని చూసి ఆదుర్దాగా అడిగింది.

"అదేమిటమ్మా, బాగా చిక్కిపోయావు? మళ్లీ జ్వరం వచ్చిందా?"





"ఇంక ఈ వయసులో నాకు ఒళ్ళు ఎలా వస్తుందే?" పేలవంగా నవ్వుతూ అంది.

ఉమ లోపలకి వచ్చి ఇల్లంతా కలియచూసింది. ఇంట్లో సామాన్లన్నీ మామూలుగానే వున్నాయి. మార్పు వచ్చినదల్లా తల్లిలోనే!

"నువ్వు నిజం చెప్పడంలేదు. నీ ఒంట్లో ఎలా వుంది?"

"నిజమే చెబుతున్నాను. బాగుంది''

"అన్నంతిన్నావా?"

"లేదు. వంట ఇప్పుడే అయింది. ఆకలిగా లేదు. కాస్సేపాగి తింటాను''

"ఇప్పుడు టైమ్ పన్నెండయింది. ఇంకా ఆకలి వెయ్యడంలేదా? తినేసెయ్యి. నేను సాయం కూర్చుంటాను''

పార్వతమ్మ సీసాలోనుంచి కొంచెం వూరగాయ కంచంలో వేసుకుని, నూకలతో చేసిన ఉప్మా పెట్టుకుంది.

"అదేమిటమ్మా! ఇదా నీ భోజనం?" విహ్వాలంగా అడిగింది.

"ఇవాళ గురువారం. సాయిబాబాకి మొక్కుకున్నాను. ఉపవాసం!"

"ఇవాళ గురువారం కాదు. శుక్రవారం"

"అయ్యో! నా మతి'' నుదుటిమీద కొట్టుకుంది. "ఇవాళ శుక్రవారమా?"

చప్పున ఆ చేతిని తన తలపై పెట్టుకుంటూ అడిగింది. "నామీద ఒట్టేసి చెప్పు! ఇంట్లో బియ్యం లేక నువ్వీ ఉప్మా తింటున్నావు కదూ?"

పార్వతమ్మ గంభీరంగా చూస్తూ అంది.

"నీమీద ఒట్టువేసి చెబుతున్నాను. బియ్యం కొనడానికి డబ్బులు లేవు కనుకనే నేనీ ఉప్మా తింటున్నాను. మజ్జిగ పిల్లి తాగేసిందని అబద్ధం చెప్పాను. పాలు కొనడానికి డబ్బు లేక కాఫీ, మజ్జిగ ఇలాంటివి తాగడం మానేశాను. నేనిలా కడుపు మాడ్చుకోవడానికి కారణం అప్పు తీర్చాలి కాబట్టి"

"అమ్మా'' ఆక్రందనలా వుంది ఉమ స్వరం.

"ఈ వయసులో నువ్విలా తింటే నీ ఆరోగ్యం ఏమవుతుంది?"

"ఆరోగ్యం పాడవుతుందని నాకూ తెలుసు''

"తెలిసీ అప్పు తీర్చడంకోసం... అసలు నా పెళ్ళి చెయ్యమని నేను ఏడ్చానా?"

"నీపెళ్ళి చెయ్యకుండా నేను చనిపోతానేమోనని ఏడ్చి నేనే చేశాను. ఉమా! ఒక్క మాట గుర్తుంచుకో! పార్వతమ్మ అప్పు తీర్చకుండానే చచ్చిపోయింది అని ఎవరూ నా గురించి అనుకోకూడదు. అందుకే నేను తినో, తినకో అప్పు తీర్చెయ్యాలనుకున్నాను. తీరుస్తున్నాను''

ఉమకి తను ఇంటిదగ్గర పప్పు, కూర, పెరుగుతో తిన్న అన్నమంతా వాంతి చేసుకోవాలనిపించింది. కన్నీళ్లతో తల్లిని చూస్తోంది.

"ఎప్పుడొచ్చావ్ ఉమా?" సుశీలమ్మ పలుకరింపుతో ఉమ చప్పున కన్నీళ్ళు తుడుచుకుంది.

"రా అత్తా! బాగున్నావా?"

"బాగున్నాను. మీ ఆయన వచ్చాడా?"

"లేదు. సాయంకాలం వస్తానన్నారు'' చప్పున అబద్ధం చెప్పింది.

"మా ఇంటికోసారిరా! మా కోడలు వచ్చింది. నిన్ను చూడాలనుకుంటోంది''

"వస్తాను. కూర్చో అత్తా! నిలబడే వున్నావు''

"పనుంది. నువ్వు వచ్చావని పలుకరించిపోదామని వచ్చాను. కాస్సేపాగి నువ్వు రా'' ఆవిడ వెళ్లిపోయింది.

పార్వతమ్మ కంచం కడిగి పెట్టి చాప పరుచుకుని పడుకుంటూ అంది.

"అత్త పిలిచిందిగా! వాళ్ళింటికి వెళ్ళిరా, నేనీలోగా కాస్సేపు పడుకుని లేస్తాను''

ఉమకి తల్లిని చూస్తే భయం వేస్తోంది. ఆమెలోని పట్టుదల మొండితనంగా కని

పిస్తోంది. ఆమె తలుపు దగ్గరగా లాగి సుశీలమ్మగారింటికి వెళ్ళింది.

"రా, కూర్చో'' ఆహ్వానించింది ఆవిడ.

"లక్ష్మి ఏదత్తా?" లోపలికి చూస్తూ అడిగింది.

"లేదు. పుట్టింటికి వెళ్ళింది. నేను నీతో కాస్త మాట్లాడాలని ఆ వంకన పిలిచాను''

"ఏమిటత్తా?"

"మీ అమ్మని చూశావా? చాలా పాడయిపోయింది''

"అవును'' తలదించుకుంది.

"ఆవిడ పరిస్థితి చూస్తే జాలి, ఆవిడేమయిపోతుంది అనే భయం కూడా వేస్తున్నాయి. ఆవిడ కడుపునిండా తిండి తిని ఎన్ని రోజులయిందో, పాలవాడిని మాన్పించేసింది. కడుపు కట్టుకుని నీ పెళ్ళికైన అప్పు తీరుస్తోంది''

సుశీలమ్మ తమకు ఎంత ఆప్తురాలైనా తల్లిని గురించిన నిజాలు ఆవిడ నోటివెంట వినడం ఆమెకి బాధగా వుంది.

"పోనీ, నీ ఒక్కదానికి రెండు గదులు ఎందుకు? ఒకగది వుంచుకుని, రెండవగది ఖాళీ చేసెయ్యి. కొంత అద్దె అయినా కలిసి వస్తుంది. అంటే వినదే! నువ్వు ఎప్పుడు వచ్చినా ఇలా వచ్చి అలా వెళ్ళిపోవడమే! ఇంక మీ ఆయన పెళ్ళయ్యాక మూడు నిద్రలకి కూడా రాలేదు. నీకు కడుపు వచ్చి, పురుడు వస్తే ఇంకో గది కావాలంటే అప్పటికప్పుడు ఎవరిస్తారు? ఇబ్బంది కదా'' అంటుంది.

ఉమ కళ్లలో తిరగబోతున్న నీటిని బలవంతాన నిగ్రహించుకుంటోంది.

"అసలు ఈ వయసులో ఆవిడ ఒకర్తే వుండడం క్షేమం కాదు, అదీ ఇలాంటి పరిస్థితులలో నామాట విని, మీ ఆయనతో చెప్పి మీ అమ్మని నీతో తీసుకుపో! మీకూ పెద్దదిక్కుగా వుంటుంది. ఆవిడకోసం మీరేమీ వేలకివేలు ఖర్చుపెట్టక్కర్లేదు. ఆవిడకి ఇంకా సంగీతం చెప్పగల ఓపిక వుంది. సంపాదించినదంతా మీకే ఇస్తుంది. తన వాళ్ళ దగ్గర వున్నాననే తృప్తి ఆవిడకీ వుంటుంది''

"మేం మా ఇంటికి రమ్మనే అన్నాం. అమ్మరానంది. తన పట్టుదలే తనది'' భర్తని కించపరచడం ఇష్టంలేని ఉమ అబద్ధం చెప్పింది.

"ఏదీ... నా ముఖంలోకి చూసి ఆ మాట చెప్పు! మీరు మీ ఇంటికి రమ్మనడం, ఆవిడ రాననడం అంతా నిజమేనా? మీ అమ్మకి జ్వరం వచ్చి మంచమెక్కితే మీ ఆయన చూడ్డానికే రాలేదు. ఎందుకే ఆవిడనలా బాధపెడతారు''

ఉమకి దుఃఖం ఆగలేదు. ఏడుస్తూనే తన ఇంటి పరిస్థితి, భర్త గురించి అంతా చెప్పింది.

"ఈ పరిస్థితులలో ఏం చెయ్యాలో నాకు తోచడం లేదత్తా! మా ఆయనతో గొడవ పడవద్దని అమ్మ ఒట్టుపెట్టుకుంది. ఎప్పటికైనా ఆయనలో మార్పు తీసుకురాలేకపోతానా అని నా ఆశ!"

"అతనిలో మార్పు వచ్చి మీ అమ్మని ఆదరించేవరకు ఆవిడ బతికి వుంటుందిటే? ఇదేం సినిమానా? ఒక్క సంఘటనతో అతను మారి మంచివాడై పోవడానికి? అయినా కన్నవాళ్ళ బాధ్యత వహించడానికి మగ, ఆడ తేడా ఏమిటి? భార్యగా నువ్వు పనికివచ్చావు కానీ నిన్ను కన్న మీ అమ్మ పనికిరాదా?"

"అలా అని అతన్ని నిలదీసి అడగాలనే అనుకునేదాన్ని. కానీ నిస్సహాయురాలనైపోయాను. ఏం చెయ్యను? ఆర్థికబలం, అంగబలం, లేనిదాన్ని. నా భర్తతో గొడవపడి ఏం సాధించగలను? నేను గొడవ పడినా అమ్మ సహించదు'' ఉమ ఏడుస్తూ అంది.

"ఏడవడం కాదు. ఈ సమస్యకి పరి




ష్కారం చూడు'' అంది సుశీలమ్మ.

★ ★ ★

ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దం విని హఠాత్తుగా మెళుకువ వచ్చింది భాస్కర్‌కి. పక్కన ఉమలేదు. అతను లేచి లైటువేశాడు. కిటికీ దగ్గర నిలబడి చీకట్లోకి చూస్తూ ఏడుస్తున్న ఉమ గభాల్న కళ్లు తుడుచుకుని అంది.

"నిద్రపట్టలేదు అందుకే..." సంజాయిషీ చెబుతున్నట్టు అంది.

ఆమె స్వరంలో దుఃఖఛాయలు.

"మనసులో బాధ వుంటే నిద్ర ఎలా పడుతుంది?"

ఉమ జవాబివ్వలేదు.

"ఎందుకు ఏడుస్తున్నావ్? నాతో చెప్పకూడదా?" అనునయంగా అడిగాడు. అతని లాలన ఆమె మనసు మారుమూల పొరల లోని దుఃఖాన్ని వెలికి తీసింది. నిస్సహాయంగా ఏడుస్తున్న ఆమెని పొదివి పట్టుకున్నాడతను.

"అరె! ఏమిటిది, చిన్నపిల్లలా! వూరుకో! వూరుకోమంటున్నానా? నాతో చెప్పు. నీ మనసులోని బాధ ఏమిటో?"

ఉమ దుఃఖంలో, వెర్రిబాధలో తల్లి తమ పెళ్ళి ఖర్చులకోసం అప్పుచేసిన సంగతి, ఆ అప్పు తీర్చడంకోసం తిండికూడా మానుకున్న సంగతి చెప్పింది.

భాస్కర్ హృదయం ద్రవించిపోయింది. అతనికి నాలుగు రోజులక్రితం తన స్కూటర్‌కి అడ్డంగా వచ్చి స్పృహతప్పి రోడ్డుమీద పడిపోయిన అత్తగారు గుర్తువచ్చింది. దానికంటే తనావిడకి స్పృహవచ్చేదాకా ఆగకుండా హాస్పిటల్‌లో వదిలి రావడం గుర్తువచ్చి అతని గుండెలో ముల్లు గుచ్చినట్టయింది.

"అమ్మ బియ్యం కొనుక్కోవడానికి డబ్బులు లేక నూకలతో ఉప్మా చేసుకుని తింటోందండీ'' వెక్కిళ్లమధ్య చెబుతోంది. అతని కళ్ళనుంచి రెండు కన్నీటిబొట్లు రాలాయి.

"ఉమతో పెళ్ళయిన తరువాత మళ్లీ తను ఆ ఇంటిగడప తొక్కాడా? కనీసం ఆవిడకి జ్వరం వచ్చినప్పుడైనా వెళ్ళి చూసి వచ్చాడా? ఆ కోపాన్ని మనసులో పెట్టుకోకుండా అమ్మమ్మకి ఉమ ఎంత చాకిరీ చేస్తోంది? అమ్మమ్మ బాధ్యత వహించమని సలహా ఇచ్చిన అక్క తన అత్తగారి విషయంలో అంత అలసత్వం చూపించడానికి కారణం ఏమిటి? తన తల్లి ఎంతో తన భార్య తల్లి కూడా అంతేకదా? అక్కగారి దుర్బోధ మనసులో నాటుకున్న తను అత్తగారి విషయంలో ఎంత క్రూరంగా ప్రవర్తించాడు? ఇప్పటికైనా మించిపోయింది లేదు. తను అత్తగారిని తన ఇంటికి తెచ్చిపెట్టుకుంటాడు. తన తల్లే ఆ స్థితిలో వుంటే వదిలేస్తాడా? ఆ నిర్ణయానికి వచ్చాక భాస్కర్ మనసు తేలికపడింది.

కానీ, అతను ఉమతో అప్పుడే ఆ విషయాన్ని చెప్పదలచుకోలేదు. అత్తగారిని తీసుకొచ్చి ఆమెను సర్‌ప్రైజ్ చెయ్యాలి అనుకున్నాడు.

"వచ్చిపడుకో!" అన్నాడు. తనని ఓదార్చిన భర్త తన దుఃఖానికి కారణం తెలుసుకునీ కనీసం సానుభూతిని కూడా చూపించక పోవడంతో ఆమెకి ఆగ్రహం, బాధ ఉవ్వెత్తున కలిగాయి. ఆమె అతని పిలుపుకి స్పందించలేదు. అలాగే కటికనేలపైన కూర్చుంది.

★ ★ ★

అంత పొద్దుటే వచ్చిన తమ్ముడ్ని చూసి ఆశ్చర్యపోయింది రుక్మిణి.

"ఏమిట్రా... ఇలా వచ్చావ్? అమ్మమ్మకేమయినా..."

"నేను మా అత్తగారిని తెచ్చి నా ఇంట్లో పెట్టుకుంటున్నాను'' నేరుగా విషయం చెప్పాడు.

"భేషైన ఆలోచన. పాపం! ఆవిడకి మాత్రం ఎవరున్నారు?" జగన్నాధం బలపరిచా

డు.

"మీరు మాట్లాడకండి'' రుక్మిణి కసిరింది.

"ఏమిట్రా ఈ ఆలోచన నీకే వచ్చిందా? ఉమ అడిగిందా?"

"నాకే వచ్చింది. ఉమ ఎప్పుడూ అలా అడగదు. అడగలేదు కూడా''

"మరేమిటి కథ? నీకు పిచ్చి ఎక్కిందా?"

"పాపం ఆవిడ పడుతున్న కష్టాలను చూస్తే జాలి వేస్తోందే అక్కయ్యా. నాలుగురోజుల కిందటే రోడ్డుమీద పడిపోయారు. కాస్తలో నా స్కూటర్ కింద పడవలసిందే! పాపం! స్పృహలేకుండా పడివుంటే హాస్పిటల్‌లో చేర్పించాను''

"హాస్పిటల్‌లోనే? ఎన్నివందలు వూడగొట్టుకున్నావ్?" రుక్మిణి గుండెలపై చెయ్యివేసుకుని కళ్ళు పెద్దవి చేస్తూ అడిగింది.

"ఆవిడని పలుకరిస్తేనే ఆవిడ వచ్చి నా నెత్తిమీద కూర్చుంటుందని నాకు నూరిపోశావ్ కదే! అందుకనే రూపాయి ఖర్చులేకుండా గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేసి చేతులు దులుపుకున్నాను'' వ్యంగ్యంగా అన్నాడు.

"మంచిపని చేశావు. లేకపోతే నీకెందుకు అనవసరపు బాదరబందీ. అయ్యో అని జాలి చూపిస్తే నెత్తికెక్కుతారు''

"కానీ మనం మనుషులమే అక్కయ్యా! మదర్ థెరీసాలాగా అనాథలకి, ఆర్తులకి ఎలాగూ సేవ చెయ్యలేం. కనీసం మనకి కావలసిన వాళ్ళకైనా సహాయం చెయ్యకపోతే ఎలా? అందుకే మా అత్తగారి బాధ్యత వహించాలని నిర్ణయించుకున్నాను. అమ్మమ్మతో బాటు ఆవిడా గుప్పెడు మెతుకులు నా ఇంట్లోనే తింటుంది''

"అమ్మమ్మకి, ఆవిడకి పోలిక ఏమిట్రా! అసలావిడ అవతారం చూస్తే రోగిష్టిదానిలా వుండదూ? పోనీ, మంచో చెడో ఇంట్లో పెట్టుకున్నావే అనుకో! ఆవిడ ఏ పక్షవాతంలాంటిదో వచ్చి మంచమెక్కితే? అసలు నా అనుమానం ఏమిటంటే ఈ సరికి ఏ టి.బి.యో వచ్చే వుంటుంది. తిండి లేనివాళ్ళకి వెంటనే వచ్చే జబ్బే అది. గుప్పెడు మెతుకులు పెట్టడం కష్టంకాదు. అలాంటి జబ్బు వస్తే వైద్యం చేయించకుండా వీధిలోకి పొమ్మనలేంకదా! అలాచేస్తే లోకం నీ ముఖాన ఉమ్మి వేస్తుంది. నిజంగా ఆ జబ్బే వస్తే వైద్యం వందలతో అవదు. వేలుకావాలి''

అక్కగారి తర్కంతో మతిపోయింది భాస్కర్‌కి.

"ఆమె మాటలలో నిజం లేకపోలేదు. తనూ ఇప్పుడిప్పుడే ఆర్థికంగా నిలదొక్కుకుంటున్నాడు. ఇంకో మనిషిని జీవితమంతా పోషించడమే కష్టం! ఇంక రోగం వస్తే చెప్పేదేముంది?"

"ఇలాంటివన్నీ ఆవిడని ఇంట్లో తెచ్చిపెట్టుకోకముందే ఆలోచించుకోవాలిరా'' అంది రుక్మిణి తమ్ముడి ముఖంలో మారుతున్న భావాలని ఓరకంట కనిపెడుతూ.

"నిజమేనే నేనంత దూరం ఆలోచించలేదు''

"జాలిపడినా ఏమీ చెయ్యలేమురా, అలాంటి వాళ్ళకి భగవంతుడే దారి చూపించాలి''

"నిజమే'' అన్నాడు.

"చూశావా. అందుకే మనసులోని మాట ఆత్మీయులైన వాళ్ళకి చెప్పుకోవాలంటారు. నువ్వు నాతో చెప్పావు కనుక ఈ సలహా అయినా ఇవ్వగలిగాను''

"నిజమేనే నాకు బ్యాంక్‌కి వెళ్ళడానికి టైమవుతోంది. వెళ్లొస్తాను'' భాస్కర్ ఇంటి మెట్టు దిగాడు.

"ఈ విషయం కొంపదీసి ఉమకి చెప్పావా?"

"లేదు'' అతను స్కూటరు స్టార్టు చేశాడు.





"కడివెడు పాలలో ఒక విషం చుక్క చాలదా అన్నట్టు అతని మనసు విరిచేశావు కదే!" జగన్నాథం అన్నాడు.

"లేకపోతే వాడు అత్తగారిని తెచ్చుకుంటా ననగానే తెచ్చుకోమ్మా, మా బాబే అని వత్తాసు పలకనా? అయినా ఇది మా అక్కాత మ్ముళ్ళ వ్యవహారం. మధ్యలో మీ జోక్యం అనవసరం" నిప్పులు కక్కింది రుక్మిణి.

'తల్లికి, అత్తగారికి ఏమిటో ఆ తేడా? అని అనుకున్నాడు జగన్నాథం. అదే మీ అమ్మ ఆ స్థితిలో వుంటే ఏం చేసేదానివి' అనికూడా అడగాలనుకున్నాడు. కానీ, భార్య ముందు నోరెత్తడానికే అతనికి భయం.

★ ★ ★

ఆ సంఘటనతో పల్లవి మనసు గాయప డింది. అరుణ్‌తో మాట్లాడ్డానికే అసహ్యం వేసింది. అతనితో మనస్ఫూర్తిగా మాట్లాడలే కపోయింది. పైకి హుందాగా, అందంగా సంస్కారవంతునిలా కనిపించే ఆ మనిషిలో మరో మనిషి వున్నాడు. ఆ మనిషి పల్లవిని మాటలతో, చేతలతో చిత్రవధ చెయ్యగలడు. అతనిచుట్టూ ఒక పరిధి వుంది. ఆ పరిధిలో తన తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నద మ్ములకి తప్ప ఇంకెవరికీ ప్రవేశంలేదు. వాళ్ళ ఆనందంకోసం అతనేమైనా చెయ్యగల డు. వాళ్ళు పల్లవిని విమర్శించినా అతను బాధపడడు. పైగా వాళ్లతోబాటు అతనూ ఆమెని విమర్శిస్తాడు. వాళ్ళు ఆమెపై జోక్స్ వేసుకుని నవ్వుకుంటే తనూ నవ్వుతాడు.

వాళ్ళ పెళ్ళయిన మూడు నెలలకే జరి గిందా సంఘటన. ప్రమీల మైసూర్ వచ్చింది. ఆమె వస్తోందని తెలియగానే అతను నాలుగు రోజులు లీవ్ పెట్టాడు.

"నువ్వూ లీవ్ పెట్టు. మా చెల్లెలు వస్తోంది'' అన్నాడు.

"నేను ఉద్యోగంలో చేరిన కొత్తకదా! లీవ్ దొరకదు. ఒక రోజైతే ఫర్వాలేదేమో''

"నీ ఇష్టం" అని వూరుకున్నాడు.

ఆడబడుచు వస్తోందని పల్లవి రెండురో జుల ముందే ఇంట్లోకి కావలిసినవన్నీ తెచ్చి పెట్టుకుంది. ప్రమీల వచ్చింది. వస్తూనే ఇల్లంతా తిరిగి చూసింది.

"ఇల్లు చాలా బాగుందన్నయ్యా! కాని సామాన్లు ఒకటీ పొందిగ్గా లేవు. వదినకి తీరువ తక్కువ" అంది.

"తీరువ తక్కువకాదు. తీరుబడి తక్కువ" ఈ మాటలు వినిపించిన పల్లవి వంటగదిలో నుంచి వస్తూ నవ్వుతూ అంది. "అయినా నా ఒక్కర్తికీ ఇల్లు శుభ్రంగా వుంచాలనే తాపత్రయం వుంటే ఏం లాభం? మీ అన్నయ్యకీ వుండాలిగా? ఎక్కడ విడిచిన బట్టలని అక్కడే పడేస్తారు. అన్నీ నేను సర్దాలి. నాకు వంట వండి పెట్టమనలేదుగా? కాస్త తన పనులేనా తను చేసుకోవచ్చుగా? నేను సాయంకాలం ఆఫీసునుంచి వచ్చేప్ప టికి, ఇల్లంతా ఎలా పడితే అలా వుంటుంది. ఓపిక వుంటే సర్దుతాను. లేకపోతే లేదు''

ప్రమీల అన్నగారి ముఖంవైపు చూసింది. ఆమెకి పల్లవి అలా అనడం నచ్చలేదు.

అరుణ్ ముఖం విసుగ్గా పెట్టి "నామీద పితూరీలు చెప్పడానికి మాత్రం ఎక్కడలేని తీరుబడి వస్తుందేం నోర్మూసుకుని వెళ్ళి నీ పనిచేసుకో' గద్దింపుగా అన్నాడు.

పల్లవి ముఖం ఎర్రబడింది. ఆమె గిరు క్కున వెనుదిరిగి వంట గదిలోకి వెళ్ళిపో యింది.

'ఛ! అనవసరంగా ఎక్కువగా మాట్లాడా ను'' అనుకుంది.

ప్రమీల వున్న నాలుగురోజులూ అరుణ్ రాత్రి వంట తనే చేసేవాడు. మైసూర్‌లో చూడవలసినవన్నీ ఆమెకి చూపించాడు.

ఆ రాత్రి ఏడుగంటలకి పల్లవి ఆఫీసు నుంచి వచ్చేప్పటికి ప్రమీల ఫోన్‌లో మాట్లా డుతోంది. ఆమె మాట్లాడుతున్న ధోరణినిబ ట్టి తల్లితో మాట్లాడుతోందని అర్థమయింది పల్లవికి.

"నేను ఎల్లుండి మెడ్రాస్ వెళ్ళిపోతున్నాను. అన్నయ్య బాగానే వున్నాడు''

"... ..."

"వదినా! ఆవిడకేం? నిక్షేపంగా వుంది. వంటపని మొగుడిపై వదిలి హాయిగా ఉద్యోగం చేస్తోంది. నేను వచ్చిన దగ్గర నుంచి చూస్తున్నాను. రోజూ రాత్రిపూట వంట అన్నయ్యే చేస్తున్నాడు. అసలు తీరువ లేదు. వాడికసలు సుఖం లేదనుకో'

పల్లవి మ్రాన్పడిపోయినట్టు నిలబడిపోయింది.

'అరుణ్‌కి సుఖంలేదుట! ఆయన వండుతుంటే ఉద్యోగం చేసుకుంటూ తను హాయిగా వుందిట! తన వంట నచ్చకో, చెల్లెలి మెప్పు పొందడానికో వంట వండుతున్నాడే కాని మామూలుగా అయితే అసలు కిచెన్‌లోకి తొంగిచూస్తాడా ఈ మనిషి! తన పని తను చేసుకోలేని బద్ధకస్తుడు'

"అదుగో మాటలలోనే వదిన వచ్చింది. ఆమెకి నూరేళ్ళాయుష్షు. వదినా మా అమ్మ నీతో మాట్లాడుతుందిట రా'' ప్రమీల పిలిచేవరకు ఆమె అలాగే నిలబడిపోయింది. ముఖాన చిరునవ్వు పులుముకుని, అత్తగారితో రెండు ముక్కలు మాట్లాడి పెట్టేసింది.

ఆమెకి ప్రమీల ధోరణి అంతులేని ఆశ్చర్యాన్ని, అసహ్యాన్ని కలుగచేస్తోంది.

క్షణంకిందట తనపై వున్నవి, లేనివి కల్పించి తల్లికి చెప్పిన ఈ మనిషి తనని చూడగానే గొంతు మార్చేసి... తనకి నూరేళ్ళు ఆయుష్షుట! ఆమె గతంలో వసుంధరా దేవిపట్ల ప్రమీల వైఖరి ఎరిగివున్నదే అయినా, ఇప్పుడు తననీ అలాగే మాట్లాడ్డం బాధని కలుగచేసింది. ప్రమీలతో మామూలుగా మాట్లాడ్డానికి చాలా కష్టపడింది. ఆ రాత్రి భోజనం చేస్తుండగా ప్రమీలని అడిగింది.

"ఇవాళ ఎక్కడకి వెళ్ళారు? బృందావన్ గార్డెన్స్‌కా?"

"కాదు. బజారంతా తిరిగాం. శాండల్‌వుడ్ బొమ్మలు కొన్నాం. మైసూర్ సిల్క్ చీరలు కూడా. తరువాత చూపిస్తానులే' అంది.

"ప్రమీలా! నేను నీకు కొన్న ఆ మస్టర్డ్ కలర్ చీర ఎంత బాగుంది'' అన్నాడు అరుణ్.

"చాలా బాగుందన్నయ్యా'' సంబరంగా అంది.

పెళ్ళయి మూడు నెలలు కావస్తున్నా మొదటి పండుగకి కూడా అతను తనకి చీర కొనకపోయినా పల్లవి బాధపడలేదు. ఇప్పుడు ప్రమీలకి కొన్నాడన్నా అసూయపడలేదు.

ప్రమీల చీరలు చూపించింది. అరుణ్ ఆమెకే కాకుండా ప్రసన్నకోసం ఒక మెరూన్ కలర్ చీర కొన్నాడు. అవికాక ప్రమీల ఫ్రెండ్స్ తెచ్చిపెట్టమన్నారంటూ అరడజను చీరలు కొంది. వేటికవే ఆకర్షణీయంగా వున్నాయి. ఆ మాటే అంది పల్లవి.

"ఇది నీకు'' అంటూ అరుణ్ ఒక చీర పల్లవికి అందించాడు. పాలపిట్ట రంగుకి నీలం అంచుతో వున్న ఆ చీరని చూడగానే అయిష్టంగా అంది పల్లవి.

"నాకు నచ్చలేదు. నాకీ రంగు అసలు ఇష్టం లేదు''

"కుళ్ళు ముండవి. మా అక్కచెల్లెళ్ళకి మంచి చీరలు కొన్నానని నీ ఏడుపు'' కోపంగా అన్నాడు అరుణ్.

పల్లవి నిర్ఘాంతపోయింది. అతను తనని అంత నీచంగా అదీ చెల్లెలిముందు తిట్టగలడని ఆమె అనుకోలేదు. ఎర్రబడిన ముఖంతో కళ్ళనిండా నీళ్ళతో ఆమె ఆ చీరని అక్కడ పెట్టేసి గదిలోకి వెళ్ళిపోయింది.

కన్నీరు ఆగడంలేదు. మనసులోనుంచి ఎగసిపడే నిప్పురవ్వలని ఆర్పే శక్తి ఆ కన్నీటికి లేదేమో!

రాత్రి పన్నెండుదాకా చెల్లెలితో కలిసి వీడియోలో తెలుగు సినిమా చూసి అప్పుడు గదిలోకి వచ్చాడు అరుణ్. నైట్ బల్బ్ వెలుగులో పల్లవి పడుకున్న భంగిమ అత





న్ని రెచ్చగొట్టింది. ఆమె పక్కనే చోటు చేసుకుని ఆమె నడుముపై చెయ్యివేసాడు.

ఆ చేతిని విదిలించికొట్టి లేచింది పల్లవి.

"ఏమిటి? నీకు నచ్చని చీరకొన్నానని కోపం వచ్చిందా? రేపు షాపుకి వెళ్దాం. ఈ చీర రిటర్న్ చేసి నీకు నచ్చినది కొనుక్కో''

"మీరు నాకు నచ్చిన చీర కొనకపోయినా బాధపడను. కాని ఏమిటా తిట్లు? ముండా, రండా అంటూ? మా పనిమనిషి మొగుడు తాగివచ్చి అలాంటి తిట్లు తిట్టేవాడు. మా ఇంట్లో ఎవ్వరం అలా మాట్లాడం! నాకు ఊహవచ్చాక మా అమ్మ కూడా నన్నెప్పుడూ తిట్టడం కాని కొట్టడం కాని నాకు తెలియదు. అలాంటిది మీరు'' పల్లవి ఆవేశంతో అసహ్యంతో వణికిపోతోంది.

"మీరు నన్ను గదిలోకి పిలిచి లాగి లెంపకాయకొట్టినా బాధపడను. కాని అలాంటి నీచమైన తిట్లు... అదీ మీ చెల్లెలి ముందు'' బాధ, వేదన మనసుని కుదిపేస్తుంటే అవి ఆమె కళ్ళల్లో నీరుగా ప్రతిఫలించాయి.

"సర్లే ఈసారినుంచి ఇంగ్లీషులో తిడతాను కాని వచ్చి పడుకో!" తాపీగా అన్నాడు అరుణ్.

పల్లవి దిమ్మెరపోయింది.

"అతనిలో తప్పు చేసాననే బాధ, పశ్చాత్తాపంలేవు. ఆ తప్పు దిద్దుకోవాలనే సంస్కారం లేదు. పైగా ఇకనుంచి ఇంగ్లీషులో తిడతాడుట. ఇంగ్లీషులో' ఆమెకి ఎంత అసహ్యం వేసిందంటే ఆ గదిలో కూడా వుండబుద్ధికాలేదు. వెళ్ళి బాల్కనీలో కూర్చుంది. రాత్రంతా ఆ చలిలో చీకట్లో అలాగే కూర్చుంది.

అరుణ్‌లోని ఒక్కొక్క రంగే బయటపడే కొద్దీ ఆమెకి భయం వెయ్యసాగింది.

'ఈ మనిషితో జీవితమంతా కలిసి ఎలా గడపాలి' అనుకుంది.



ఆ రోజు అరుణ్ చెప్పాడు. "ఈ ఆదివారం మా కొలీగ్‌ని డిన్నర్‌కి పిలిచాను''

"ఎవరాయన"

"నీకు చెప్పాలా'' అరుణ్‌కి ఛర్రున కోపం వచ్చేసింది.

"నాకు చెప్పక్కర్లేదు కాని ఆ వచ్చే మనిషి ఇష్టాలేమిటో, అభిరుచులేమిటో తెలుసుకోవాలి కదా! ఆయనకి మన వంట నచ్చదేమో అని''

"ఆయన కన్నడం వాడు. పేరు శివప్ప. మన దక్షిణాది వంటకాలంటే ప్రాణం. నువ్వు మామూలుగా చేసే వంట కాకుండా రెండు మూడు స్పెషల్ డిష్ లేవైనా చెయ్యి. స్వీటు నేను చేస్తాను. నువ్వు మాత్రం ఏ ప్రయోగం చెయ్యకు. తగలేస్తావ్''

పల్లవికి అడపాదడపా ఇలాంటి విమర్శలు వినడం మామూలే కాబట్టి పట్టించుకోలేదు.

ఆదివారం ప్రొద్దుటే పల్లవి ముందు ఇల్లు

శుభ్రంచేసే పని పెట్టుకుంది. ఆదివారం వస్తే అసలామెకి తీరిక వుండదు. ఇల్లు క్లీన్ చెయ్యడం, వారం రోజులనుంచి ఉతకని బట్టలు ఉతుక్కోడం, ఇస్త్రీ చేసుకోడం ఇలాంటి పనులతో సతమతమవుతుంది.

ఈరోజు సాయంకాలం గెస్ట్ వస్తున్నారు కాబట్టి మరింత శ్రద్ధగా ఇంటిని అలంకరించడం మొదలుపెట్టింది. ఆమె నడుము విరిగేలా పనిచేస్తుంటే అరుణ్ హాయిగా పుస్తకం చదువుతూ కూర్చున్నాడు.

మధ్యాహ్నం మూడు గంటలకే పల్లవి వంట ప్రయత్నం మొదలు పెట్టింది.

పొద్దుటనుంచి విశ్రాంతి లేకుండా పనిచెయ్యడంవలన కలిగిన అలసటవలన తమ ఇంటికి వస్తున్న మొదటి అతిథికి తన వంట నచ్చుతుందో లేదో అనే టెన్షన్‌తో ఆమెకి తలనెప్పి వచ్చేసింది. అలాగే వంట అంతా చేసింది. ఆమె అన్నీ టేబిల్‌మీద అమరుస్తుండగా అరుణ్ కిచెన్‌లోకి వచ్చాడు.

"పంచదార ఎక్కడుంది?" అడిగాడు స్టవ్ మీద గిన్నెపెడుతూ.

"అలమరలోవుంది''

"వచ్చి ఇయ్యి''

పల్లవి పంచదార డబ్బా అందించింది. "నాకు చాలా తలనెప్పిగా వుంది. కాస్సేపు పడుకుంటాను. ఆ స్వీట్ పూర్తయ్యాక నన్ను పిలవండి. వంటిల్లు క్లీన్ చేస్తాను''

"కాస్త తలనెప్పికే ఏమీ అయిపోవు కాని వచ్చి పిండి జల్లించు''

పల్లవి తప్పనిసరిగా ఆ పని చేసింది. స్వీటు అరుణ్ చేసాడన్న పేరుకేగానీ, ఏలకులనుంచి జీడిపప్పుదాకా ఆమే వలిచి ఇచ్చింది. అంతా అయ్యేప్పటికి టైము ఏడు గంటలయింది.

"ఇంకేం పడుకుంటాను? మరో అర గంటలో ఆయన రానేవస్తారు'' అనుకుంది నీరసంగా.

"ఆయన వచ్చే టైమయింది. జిడ్డోడుతూ అప్పలమ్మలావుండక త్వరగా స్నానంచెయ్యి. ఆయన రాగానే ఫ్రిజ్‌లోనుంచి కూల్ డ్రింక్ ఇయ్యి'' అన్నాడు అరుణ్ బాత్‌రూమ్‌లోకి వెళ్తూ.

పల్లవికి స్నానంచేసే ఓపిక కూడా లేదు. పడుకోవాలని వుంది. ఆమె స్నానం ముగించి, తయారవుతుండగానే కారు హారన్ వినిపించింది.

"పల్లవీ'' అరుణ్ పిలిచాడు. ఆమె బయటకి వచ్చింది. సోఫాలో కూర్చుని వున్న తన కొలీగ్‌ని పరిచయం చేశాడు. అతనికి ఇంచుమించుగా అరుణ్ వయసేవుండవచ్చు.

లేచి మర్యాదగా నమస్కరించాడు. ముగ్గురిమధ్య సంభాషణ ఇంగ్లీషులోనే సాగుతోంది.

మధ్యలో పల్లవి లేచి వెళ్ళి కూల్‌డ్రింక్ తెచ్చింది. ఆమెకి తలనెప్పి మరింత ఎక్కువయింది. ఎవరితోనూ మాట్లాడాలనిలేదు. కళ్ళు మూసుకుని పడుకోవాలనివుంది. ముఖాన చిరునవ్వు పులుముకుని అతిథికి కూల్ డ్రింక్ అందివ్వబోయింది. అదే సమయంలో శివప్ప లేచి డ్రింక్ గ్లాసు అందుకోబోయాడు. అతను గ్లాసు అందుకున్నాడనుకుని పల్లవి ట్రే వెనక్కి జరపడంతో గ్లాసు కిందపడి భళ్ళున బద్దలయింది. డ్రింక్ ఆయన వేసుకున్న తెల్లని లాల్చీనిండా పడింది.

ఊహించని ఈ సంఘటనతో బిత్తరపోయిన ఆమె సిగ్గుపడిపోయి, "ఎక్స్‌క్యూజ్‌మి. నేను చూసుకోలేదు'' అని క్షమార్పణ కోరింది ఇంగ్లీషులో.

"ఇట్సాల్‌రైట్! నాదే పొరపాటు. నేను గ్లాసు అజాగ్రత్తగా పట్టుకున్నాను'' అన్నాడు శివప్ప.

"దొంగ లం... కళ్ళు కనిపించడంలేదా? ఒళ్ళు తెలియడంలేదా?" అరుణ్ ఆగ్రహంగా అన్నాడు.

పల్లవి నిశ్చేష్టురాలయింది. ఆమె ఒంట్లోని రక్తమంతా ముఖంలోకి పొంగివ




చ్చింది.

ఇంటికి వచ్చిన అతిథిముందు అదీ పరాయి మగవాడిముందు అశ్లీలంగా భార్యని తిట్టిన అతను మరునిముషం నవ్వుతూ అతిథితో సంభాషణ కొనసాగించాడు.

పల్లవికి భరింపలేని అవమానంతో గుండెలు పిండేస్తున్నట్టుంది. తరచుగా అరుణ్ నోటివెంట అలాంటి పదాలు వస్తూనే వుంటాయి. కాని ఇంటికి మొదటిసారిగా వచ్చిన అతిథిముందు అతనలా తిట్టడం ఆమెని అక్కడనుంచి పారిపోయేలా చేసింది. దుఃఖం రావడంలేదు. దుఃఖంకంటే బాధాకరమైన స్థితి ఆ స్థితి!

డైనింగ్ టేబిల్ దగ్గర నిస్తేజంగా కూర్చుండిపోయింది.

"భోజనం వడ్డించు'' అరుణ్ వచ్చి పిలిచాడు.

భోజనం మొదలుపెట్టారు. శివప్ప తమకి వడ్డిస్తున్న పల్లవితో అన్నాడు "మీరూ తినండి''

"ఆదివారం ఒకపూటే భోజనం చేస్తానండీ'' అంది పల్లవి.

"పదార్థాలన్నీ చాలా రుచిగా వున్నాయి'' అన్నాడాయన తృప్తిగా తింటూ.

"ఇవాళ మీ అదృష్టం బాగుంది. మామూలుగా అయితే మా ఆవిడ వంట ఎవరూ తినలేరు'' అన్నాడు అరుణ్ గొప్ప జోక్ వేసినట్టు.

"మీరు జోక్ చేస్తున్నారు. ఆవిడకి వంట రాదంటే ఎవరూ నమ్మరు'' అన్నాడు శివప్ప.

పల్లవి నవ్వి వూరుకుంది. మగవాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుంటే పల్లవి అన్నీ సర్ది టేబిల్ క్లీన్ చేసింది.

గంట తరువాత ఆయన వెళ్తున్నాడని అరుణ్ పిలవడంతో ఆమె బయటకి వచ్చింది.

"మీ ఆతిథ్యానికి చాలా థ్యాంక్స్! నా మిసెస్ వూరినుంచి వచ్చాక, మీరిద్దరూ మా ఇంటికి భోజనానికి రావాలి'' అన్నాడాయన మర్యాదగా నమస్కరిస్తూ.

"తప్పకుండా'' అంది పల్లవి చిరునవ్వుతో ప్రతినమస్కారం చేస్తూ.

ఇద్దరూ శివప్పని గేటువరకు సాగనంపారు. ఆయన గేటుబయట ఆపి వుంచిన తన కారు దగ్గరకి వెళ్ళాడు.

పల్లవి లోపలకి వచ్చేసింది. ఆయన కారు ముందుకి కదిలాక, అరుణ్ లోపలకి వచ్చాడు. అతనిరాక కోసమే కాసుకుని కూర్చున్న పల్లవి క్రోధారుణిమనేత్రాలతో అతడిని చూస్తూ అడిగింది.

"ఏమిటి, మీ ఉద్దేశం? ఎన్నిసార్లు చెప్పినా మీ పద్ధతి మార్చుకోరా? అలగా జనంలాగా ఆ తిట్లేమిటి? ఆయన ఏమనుకుంటారు? పొరపాటున గ్లాసు చెయ్యి జారిందని అంత అసహ్యంగా తిడతారా?"

"నేను నిన్ను ఎన్ని బూతులు తిట్టినా ఆయనకేమీ అర్థంకాదులే! ఆయన కన్నడియన్. తెలుగు రాదు'' అన్నాడు అరుణ్ విలాసంగా నవ్వుతూ.

"క్షమించండి'' వెనుకనుంచి తెలుగులో విన్పించింది ఇద్దరూ వెనుదిరిగి చూశారు.

శివప్ప!

"నా ఇంటి తాళం చెవులు మరచిపోయాను. కాస్త దూరం వెళ్ళాక గుర్తు వచ్చి వెనక్కి వచ్చాను'' అన్నాడాయన అక్కడ టీపాయ్‌మీద వున్న తాళంచెవులని అందుకుంటూ స్వచ్ఛమైన తెలుగులో.

పల్లవి నోటమాట రానట్టు చూస్తోంది. "వస్తానమ్మా! నమస్కారం" ఆయన పల్లవికి చెప్పి వెళ్ళిపోయాడు. ఈసారి ముఖం ఎర్రబడడం అరుణ్ వంతయింది.

★ ★ ★

ఆరోజు భాస్కర్ తల్లి ఆబ్దీకం. ఉమ



తెల్లవారి నాలుగు గంటలకే లేచి, పనులన్నీ ముగించుకుని స్నానంచేసి మడిబట్టలు కట్టుకుంది.

రుక్మిణి ఆరోజు ఉదయమే వచ్చింది. వంట గది గుమ్మంలో నిలబడి వంటమనిషికి పురమాయిస్తోంది.

"మా అమ్మకి పనసపొట్టు కూర ఇష్టం. ఆవ పెట్టి చెయ్యండి. గారెలు వండేప్పుడు కొన్ని పాకంలో వెయ్యండి. అలాగే కొబ్బరి పచ్చడి కూడా చెయ్యండి. మా అమ్మకి ఇష్టం"

"అలాగేనండి''

రుక్మిణి వంట గదిలోనుంచి ఇవతలకి వచ్చి తులసమ్మ పక్కనే కూర్చుంది.

"అప్పుడే మా అమ్మపోయి ఇరవైఏళ్ళు నిండిపోయాయి కదమ్మమ్మా!"

"అవునేమ్మా! అది పోయేప్పటికి నీకు పన్నెండు, భాస్కర్‌కి ఆరేళ్ళు. మీ అమ్మ బతికి వున్నన్నాళ్ళూ మీకోసమే తాపత్రయపడింది. చచ్చిపోయేప్పుడు కూడా మిమ్మల్నే కలవరించింది''

ఆవిడ స్వరం రుద్ధమై కన్నీళ్ళు వచ్చాయి.

రుక్మిణి కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఏదో పనిమీద అటుగా వచ్చిన ఉమకీ కన్నీళ్ళొచ్చాయి.

"అమ్మాయిగారూ! బెల్లం ఎక్కడుంది'' వంట మనిషి పిలిచింది.

"వస్తున్నాను'' ఉమ కళ్ళు తుడుచుకుని అటు వెళ్ళింది.

"పాపం! ఎప్పుడో పోయిన అత్తగారిపై ప్రేమ ఒలికిపోతోంది కాబోలు! కన్నీళ్ళు పెట్టుకుంటోంది. ఓవర్‌యాక్షన్ కాకపోతే'' రుక్మిణి మూతి మూడు వంకర్లు తిప్పింది.

"మరీ'' తులసమ్మ వంకరగా నవ్వింది.

గుమ్మంలో నిలబడి ఆబ్దీకం పెట్టించే బ్రాహ్మణులకోసం ఎదురు చూస్తున్న భాస్కర్ చెవిన ఈ మాటలు పడ్డాయి. అతనికి మొదటిసారిగా అక్క, అమ్మమ్మలపై అసహ్యం వేసింది.

"ఛీ! ఛీ!" అప్రయత్నంగా పైకే అన్నాడు. ఆ ఛీత్కారం ఉమ గురించేననుకుని ఆ ఇద్దరూ ఒకరిముఖాలు మరొకరు చూసుకుని గుంభనంగా నవ్వుకున్నారు.

ఆబ్దీకపు తంతు మొదలయింది. భాస్కర్ మడిపంచె కట్టుకుని పీటపై కూర్చుని బ్రాహ్మణుడు చెప్పిన మంత్రాలని వల్లెవేస్తున్నాడు. గంటకి పైగా ఆ కార్యక్రమం సాగాక, భోక్తలిద్దరికీ భోజనం వడ్డించారు.

పప్పు, నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్ళు, పిండివంటలు, పాయసం, పెరుగు, చక్కెరకేళీ అరటిపళ్ళతో తిన్నంత తిని ఆయాసపడి మిగిలినది వదిలేసారు. ఆ విస్తళ్ళు ఎత్తి అవతల పారేస్తున్న ఉమకి నూకల అన్నం తింటున్న తల్లి గుర్తుకు వచ్చింది.

"ఈ మనుషులు అర్ధంలేని మంత్రాలు వ్యర్థమైన ఆచారాలకి ఇచ్చే విలువ దేనికీ ఇవ్వరు! వీళ్ళకి ఆకలిప్రేగుల ఆక్రందనలు తెలియవు'' ఆమె పెదవులపై విరక్తి నిండిన చిరునవ్వు కదలాడింది. బ్రాహ్మణులకి ఘనంగా దక్షిణలు ఇచ్చి పంపాక ఇంట్లో మిగిలినవాళ్ళు కూడా భోజనానికి కూర్చున్నారు.

రుక్మిణి అరిసెలు తింటూ అంది.

"అరిసెలు మాత్రం చాలా బాగా వచ్చాయి''

"పిల్లలకి పట్టుకెళ్ళు'' అన్నాడు భాస్కర్.

"అలాగే! అయినా బావగారిని, పిల్లల్ని రాత్రికి ఇక్కడకే రమ్మన్నాను. భోజనం చేసే వెళ్తాం!"

"మంచిపని చేశావు!"

వీధిలో బిచ్చగత్తె పిలుపు. "అమ్మా రెండు రోజులనుంచి అన్నం తినలేదు. కాస్త అన్నముంటే వెయ్యి తల్లీ!"




"ఏంలేదు పో!" కసిరింది రుక్మిణి.

"అమ్మా! దయగల తల్లి. పసిబిడ్డ ఆకలితో మాడిపోతున్నాడమ్మా!"

"దొంగముండ! ముందు తను తినలేదంది. మనం వెయ్యలేదని మనని సెంటిమెంట్‌తో లొంగదియ్యడానికి పసివాడిని అడ్డం పెట్టుకుని అడుక్కుంటోంది'' పళ్లు కొరుకుతూ అంది రుక్మిణి.

వీధిలోనుంచి బిచ్చగత్తె అరుస్తూనే వుంది. "పోనీ, పాపం, అన్నం చాలా మిగిలింది. కొంచెం అన్నం పెడతానండి'' అంది ఉమ. ఆమె ఎవర్నీ ఉద్దేశించి అనకపోయినా భాస్కర్ వెంటనే స్పందించాడు.

"పాపం! పెట్టు కొంచెం పాయసం, నాలుగు గారెలు కూడా పెట్టు'' అంటూ పిలిచి పిలిచి విసుగెత్తి వెళ్ళిపోతున్న బిచ్చగత్తెని వుండమన్నాడు.

పళ్ళెంలో అన్నం, కూరలు, గారెలు తెస్తున్న ఉమవైపు రుక్మిణి కొరకొరలాడుతూ చూసింది.

ఉమ ఆ చూపులని లెక్కచెయ్యలేదు.

అరుగు చివర్న కూర్చున్న బిచ్చగత్తె దాని చంకలో వున్న ఏడాదిన్నర పసివాడు కడుపునిండా అన్నం తింటూంటే తృప్తిగా చూసింది.

"దీనికి పెత్తనం ఇస్తే ఇల్లు గుల్లే' రుక్మిణి గొణుగుతోంది.

ఉమ పెదవులపై చిత్రమైన నవ్వు కదలాడింది.

"ఈ మనిషికి చచ్చిపోయినవాళ్ళకి తద్దినాలు పెట్టించడం తెలుసు! ఆకలితో వున్న మనిషికి గుప్పెడన్నం పెట్టడం తెలియదు'' విరక్తిగా అనుకుంది.

★ ★ ★

నీరజకి హఠాత్తుగా మెలకువవచ్చింది. ఆమె బద్ధకంగా ఆవలిస్తూ పక్కకి చూసింది. పక్కన గౌతమ్ లేడు. అతను బాత్‌రూమ్‌లో వున్నాడేమోనని కొద్దిసేపు అతని రాకకోసం ఎదురుచూసింది. క్షణాలు నిముషాల్లా మారిపోతున్నా అతను రాలేదు. ఆమె భ్రుకుటి ముడివడింది. అతని కోసం మరికొన్ని నిముషాలు ఎదురుచూసి, కంగారుగా మంచం దిగింది. అనుమానంగా బాత్‌రూమ్‌డోర్ తోసిచూసింది. లోపల అతను లేడు.

"ఎక్కడకి వెళ్ళివుంటాడు గౌతమ్? ఫ్యాక్టరీకా? ఫ్యాక్టరీకి అయితే తామిద్దరూ కలిసే వెళ్ళేవాళ్లు కదా!"

ఆమె ఆలోచిస్తూ కిందకి దిగివచ్చింది.

డ్రాయింగ్ రూమ్‌లోనుంచి గౌతమ్ స్వరం విన్పిస్తోంది.

"ఇప్పటికిప్పుడు అన్ని లక్షలు కావాలంటే ఏం చెయ్యాలో పాలుపోవడం లేదమ్మా? వున్నదంతా వూడ్చి ఫ్యాక్టరీకి పెట్టాను. బ్యాంక్ లోన్ కాకుండా తెలిసివున్న వాళ్ళందరి దగ్గర అప్పులు చేశాను. ఇప్పుడేం చెయ్యాలో తోచడంలేదు''

"మీ అత్తగారు ఇస్తుందేమో! నీరజ ద్వారా అడిగించు''

"ఆవిడ దగ్గర అంత డబ్బు వుంటుందంటావా?"

"లేకపోతే భూమి అమ్మి ఇస్తుందిరా! ఎలాగా వున్నదంతా కూతురికేగా? ఏం చేసుకుంటుంది? ఒంటికాయ, శొంఠికొమ్ములాగ ఒక్కర్తేకదా!"

"అయినా నీరజని పెళ్ళి చేసుకోవడంలో తొందరపడ్డానమ్మా! అది ఫాల్స్ ప్రిస్టేజితో బతికే మనిషని తెలుసుకోలేకపోయాను. వాళ్ళ పొలాల గురించి ఎంత గొప్పగా చెప్పేది. అవన్నీ వర్షాధారపు భూములట. ఎకరం లక్ష రూపాయల ఖరీదు కూడా చెయ్యదట"

"నీ ముఖాన అలా రాసిపెట్టి వుందిరా! పల్లవిని చేసుకుందామంటే అయిందా? ఎంత ఆస్తి! సుమారు నలభైలక్షల పైనే వుంటుంది?" అమరేశ్వరి నిట్టూరుస్తూ అంది.

తల్లి అన్నదానికి సమాధానంగా గౌతమ్ ఏమంటున్నాడో నీరజకి వినిపించలేదు. వినాలనే ఆసక్తి కూడా లేదామెకి. ఆమె నవనాడులూ కృంగిపోయినట్టయింది. "తనని పెళ్ళి చేసుకున్నందుకు అతను పశ్చాత్తాపపడుతున్నాడా?" ఆమె గిర్రున వెనుదిరిగి వచ్చి మంచంమీద వాలిపోయింది. ఆమెకి కన్నీళ్లు వస్తున్నాయి. "అతను పల్లవి అంటే పడిచచ్చేవాడని, ఆమెని పెళ్లి చేసుకోవాలనుకున్నాడని తెలిసే అతన్ని తనెలా కోరుకుంది'' నీరజకి గతం గుర్తుకొస్తోంది.



నీరజకి ముందునుంచి గౌతమ్ ఎడల ఆకర్షణే. అతను పల్లవిపట్ల ఆకర్షితుడై వున్నాడని తెలిసీ ఆమెలో ఆ ఆకర్షణ తగ్గలేదు. దానికి ప్రేమ అనే పేరు పెట్టుకోలేదామె. పల్లవి అతన్ని తిరస్కరించిందని తెలిసిన నీరజకి ఆమె తెలివితక్కువదానిలా కనిపించింది. గౌతమ్‌కి వున్న ఆస్తిపాస్తులు ఐశ్వర్యం గురించి పల్లవి ద్వారానే విని వున్న నీరజకి అతన్ని పల్లవి తిరస్కరించడం ఆమె మూర్ఖత్వం అనుకుంది.





గౌతమ్‌పట్ల నీరజకి వున్న ఆకర్షణ పదింతలయింది. ఆమె తను అతని దృష్టిలో పడడానికి అనేక ప్రయత్నాలు చేసి చివరకి సఫలీకృతురాలయింది.

ఖరీదైన బట్టలు, ఫ్రెండ్స్, రెస్టారెంట్స్. నీరజ అలవాట్లు చూసిన గౌతమ్‌కి ఆమె ధనవంతురాలనే నమ్మకం కలిగింది.

"మా వూళ్ళో మాకు పొలాలున్నాయి. మా అమ్మ స్వంతంగా వ్యవసాయం చేయిస్తుంది. మాకు బోలెడు ఆదాయం వస్తుంది''

"మా పొలం ఒక్క ఎకరం రెండు లక్షలకి పైగానే ఖరీదు చేస్తుంది''

ఇలాంటి డైలాగులు విన్న గౌతమ్‌కి నీరజని చేసుకోవడం లాభదాయకమే అనిపించింది. నీరజ తల్లిని పీడించి అతని అంతస్తుకి తగినట్టుగా పెళ్లి ఘనంగా జరిపించడంతో ఆ అభిప్రాయం మరింత బలపడింది. అత్తగారు వేలకివేలు కానుకలుగా ఇవ్వడంతో మురిసిపోయాడు. కాని నీరజ తనూహించినంత ఆస్తిపరురాలేమీ కాదని తెలియడంతో అతనికి మతిపోతోంది.

నీరజకి ఆ తల్లీకొడుకుల సంభాషణ విన్నాక నిద్రపట్టలేదు. గౌతమ్ తనని పెళ్లిచేసుకోవడం లాభదాయకమా కాదా అని ఆలోచించాడంటే ఆమెకి అతనిపై అసహ్యం, తనమీద తనకే జాలివేస్తున్నాయి. అంతలోనే తనని తాను తమాయించుకుంది.

"వీళ్ళు చాలామంది అత్తవారిలా కట్నం చాలలేదని తనని వేధించడంలేదు. లాంఛనాలు ఇమ్మని అసలే పీడించడంలేదు. మనసులో ఏం వున్నా తనని ప్రేమగానే చూస్తారు. అది చాలు. అనుకుంది. నీరజ బయటపడదలచుకోలేదు. గౌతమ్ కేవలం డబ్బుకోసమే తనని పెళ్లి చేసుకున్నాడని తెలిసినా, ఆ విషయం తనకి తెలియనట్టే ప్రవర్తించాలనుకుంది. భర్తపై ప్రేమ, అత్తగారిపై గౌరవం మరింత ఎక్కువ ప్రకటించాలనుకుంది. ఆమెకి చిత్రంగా వాళ్ళపై కోపం లేదు. తల్లిపై కోపం వచ్చింది.

"పదిహేను ఎకరాల భూమిపై వస్తున్న

ఆదాయమంతా ఏం చేస్తున్నట్టు? ఒక్కగానొక్కర్తి వుండేది పల్లెటూరిలో. ఎప్పుడడిగినా డబ్బు లేదనే జవాబే!"

ఆమెకి తల్లి బ్యాంకులో డబ్బు వేసినా, తీసినా పరంధామయ్యని సంప్రదించడం గుర్తుకొచ్చింది. ఆయన తల్లికి సహాయం చేస్తున్నట్టు నటిస్తూ తమ డబ్బంతా స్వాహా చేస్తున్నాడేమో అనే అనుమానం వచ్చింది. ఆమెకి ఎంత ఆవేశం వచ్చిందంటే అప్పటికప్పుడు వెళ్ళి తల్లిని నిలదీసి అడగాలనుకుంది.

గదిలోకి గౌతమ్ వస్తున్న అలికిడి అవగానే ఆమె కళ్ళు మూసుకుని నిద్ర నటించసాగింది.

రాత్రంతా నిద్రలేని ఆమెకి తెల్లవారుజామున చిన్న కునుకుపట్టింది. ఆ నిద్రలో ఆమెకో కల వచ్చింది. పరంధామయ్య తల్లిని ఇనప్పెట్టె తాళం అడుగుతున్నాడు. ఆవిడ ఇస్తోంది. ఆయన తాళం తీసి నోట్లకట్టలు బ్యాగ్‌లో పెట్టుకుని వెళ్ళిపోతున్నాడు. తల్లి మాట్లాడ్డంలేదు. నవ్వుతూ చూస్తోంది. ఉలిక్కిపడి కళ్ళు విప్పింది నీరజ. అది కలే అని తెలిసినా ఆమె ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. లేచి ముడివడిన భ్రుకుటితో ఆలోచిస్తూ అలాగే కూర్చుంది.

"గుడ్‌మార్నింగ్" గౌతమ్ పలకరింపుతో చివ్వున తల తిప్పింది. అతను చిరునవ్వుతో ఆమెనే చూస్తున్నాడు.

"గుడ్‌మార్నింగ్!" మధురంగా నవ్వుతూ అతని పక్కనే జేరింది.

"ఏమిటి, ఆలోచిస్తున్నావ్?"

"ఇవాళ ఆదివారంకదా! ఈ సాయంకాలం నీతో ఎలా గడుపుదామా అని?"

నవ్వుతున్న గౌతమ్ ముఖం సీరియస్‌గా అయింది.

"ఇవాళ నేను ఒకర్ని కలుసుకోవాలి నీరజా!"

"ఎవరిని?"

"ఆయన డబ్బు అప్పుగా ఇస్తానన్నాడు."

"అప్పుగానా?" తెలియనట్టే అడిగింది.

"బిజినెస్‌లో మనల్ని మనం నిలదొక్కుకోడానికి కొన్ని నెలలు పడుతుంది. ఈలోగా పెట్టుబడి తప్పదుగా? బ్యాంక్‌లో డబ్బేమీ లేదు''

"ఎవరినీ అప్పు అడగద్దు!"

"అప్పు చెయ్యడం నాకూ ఇష్టంలేదు. కాని తప్పదు''

"మా అమ్మని అడుగుతాను''

"మీ అమ్మగారినా? ఛ! బాగుండదు. నేను డబ్బు కోసం ఆవిడని పీడిస్తున్నానని ఆవిడ అనుకోవడం నాకు నచ్చదు'' ఆ క్షణంలో అతని ముఖం చూస్తే లాభనష్టాలు బేరీజు వేసుకునే తనని పెళ్లి చేసుకున్నాడని, కేవలం డబ్బుకోసమే తనని పెళ్లి చేసుకున్నాడని నీరజకి అనిపించలేదు. అంత గొప్పగా నటించాడతను.

"అమ్మ ఎప్పుడూ అలా అనుకోదు. ఆవిడకి మాత్రం నేతప్ప ఎవరున్నారు?" అంది అతనికంటే సహజంగా నటిస్తూ.

"నీ ఇష్టం" అన్నాడు గౌతమ్ అయిష్టతను స్వరంలో వ్యక్తపరుస్తూ. అక్కడికి నీరజ బలవంతంమీదే తను అత్తగారి డబ్బు తీసుకోడానికి అంగీకరించినట్టు.

నీరజ ఆరోజు సాయంకాలమే తల్లి దగ్గరకి ప్రయాణమయింది.

★ ★ ★

హఠాత్తుగా వచ్చిన నీరజని చూసి ఆశ్చర్యపోయింది అన్నపూర్ణమ్మ.

"ఏమిటమ్మా, ఉత్తరమైనా వ్రాయకుండా వచ్చావు?"

"నిన్ను చూడాలనిపించింది'' అంది నీరజ. "ఎలా వున్నావమ్మా?"

ఆ కాస్త పలకరింపుకే పొంగిపోయిందా పిచ్చితల్లి. "నేను బాగానే వున్నానుకాని,

నువ్వేమిటమ్మా అలా బొత్తిగా చిక్కిపో యావ్?"

"అదేంలేదు. ఫ్యాక్టరీకి వెళ్ళి రావడంతో అలసిపోతున్నాను''

అన్నపూర్ణమ్మ కూతురికి ఇష్టమైన వంట లని చెయ్యడంలో సతమతమవుతుంటే నీరజ తల్లిని డబ్బు ఎలా అడగాలా అని ఆలోచిస్తోంది. ఆవిడ వంట పూర్తయ్యేసరికి ఆమె ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి.

భోజనం పూర్తవుతుండగా, వాకిట్లోనుంచి పరంధామయ్య పిలుపు విన్పించింది.

అన్నపూర్ణమ్మ చెయ్యి కడుక్కుని తొంద రగా వెళ్ళింది. "రండన్నయ్యా! నీరజ వచ్చింది''

"ఏమిటి విశేషం?"

"ఊర్కేనే, నన్ను చూడ్డానికి వచ్చింది''

"రేపటినుంచి కోతలు మొదలు పెట్టాలిక దా! కూలీలని మాట్లాడ్డానికి వెళ్తున్నాను. నీకు చెప్పి వాళ్ళకి ఎడ్వాన్స్ ఇద్దామని''

"నాకు చెప్పడమెందుకన్నయ్యా! మీకు ఏది మంచిదన్పిస్తే అది చెయ్యండి. పది రూపాయలు అటు, ఇటు అయినా కోతలు తప్పవుకదా!"

"సరే! నీరజ ఏది? ఒకసారి పలుకరించి వెళ్తాను''

"పిలుస్తాను'' ఆవిడ లోపలకి వచ్చి కూతుర్ని పిలిచింది. నిద్ర నటిస్తున్న నీరజ కళ్ళు విప్పలేదు. ఆవిడ బయటికి వచ్చి చెప్పింది.

"పడుకుందన్నయ్యా!"

"సరేలేమ్మా! రేపు పొద్దుట మాట్లాడతాను లే!"

"కూలీలకి ఎడ్వాన్స్ ఇస్తానన్నారు. డబ్బు ఇస్తానుండండి''

"తరువాత చూసుకుందాములే అమ్మా'' ఆయన వెళ్ళిపోయాడు.





అన్నపూర్ణమ్మ వీధి తలుపు గడియపెట్టి వచ్చింది.

"వెళ్ళాడా ఆయన?" నీరజ లేస్తూ అడి గింది.

"నువ్వు నిద్రపోలేదూ?"

"లేదు''

"మరి మామయ్యగారు నిన్ను పలుక రించడానికి పిలిస్తే లేవలేదేం?"

"ఇష్టంలేదు కనుక. ఏమిటి, ఆయన కూలీలకు ఎడ్వాన్స్ అంటున్నాడు?"

"కోతలు మొదలుపెట్టాలికదమ్మా! కూలీ లకి ఇవ్వడానికి''

"ఏం నువ్వు వెళ్ళి కూలీలని మాట్లాడుకో లేవా? మధ్యన ఆయన పెత్తనం ఏమిటి?"

"ఆడదాన్ని. అలగా జనం వున్న పేటలో కి ఎలా వెళ్ళనే చిత్రంగా మాట్లాడతావు?"

"ఏం ఆడదానివి. వ్యవసాయం చే యించగా లేనిది, కూలీలతో మాట్లాడితే తప్పా? బ్యాంక్‌లో డబ్బు వెయ్యాలంటే ఆయన, డబ్బు డ్రా చెయ్యాలంటే ఆయన! నువ్వెందుకు ప్రతిదానికి ఆయనపై ఆధారప డుతున్నావ్? నాకర్థం కాదు''

"బ్యాంక్‌కి నేను వెళ్ళగలనమ్మా. కాని మామయ్య తను వెళ్ళి తెచ్చిపెడతానన్నారు కదా అని..."

"అదే నువ్వు కాస్త సాయం కోరితే ఆయన నీపై, నీ డబ్బుపై పెత్తనమే చేస్తున్నా డు''

"పెత్తనం చెయ్యడమేంటి? వయసులో నాకంటే పెద్దవాడు కాబట్టి ఆయన సలహా ఇస్తారు అంతే!"

"అదే! ఆయన సలహా వినే ఈ సంసారా న్ని ఇంతవరకు తీసుకొచ్చావు. డబ్బు మనది. కష్టం నీది. పెత్తనం ఆయనది. పదిహేను ఎకరాల పొలంమీద ఎంత ఆదాయం వస్తుందో తెలియని అమాయకురా లినేమీ కాదు. కాని నువ్వు ఎప్పుడు డబ్బు అడిగినా లేదనే చెబుతావు. కారణం నీ డబ్బుపై నీకు అధికారం లేకపోవడం.

అన్నింటికి ఆయనపై ఆధారపడడం"

"నీరజా!" అయోమయంగా చూస్తోందా విడ. "నువ్వు నీ మనసులో ఏం వుందో సూటిగా చెప్పు. అంతేకాని అనవసరంగా తొందరపడి మామయ్యపై అభాండాలు వెయ్యకు''

"మామయ్యట మామయ్య! ఆయన నాకెలా మామయ్య అవుతాడమ్మా! ఆయనేం నీ తోబుట్టువా? కాదే! ఆఫ్టరాల్ పక్కింటి మనిషి. మనతో ఎలాంటి బంధుత్వము లేనిమనిషి నువ్వు బాగుపడాలనే మంచి మనసుతో ఎలా ఆలోచిస్తాడమ్మా? నీకు సాయం చేస్తున్నట్టు నటిస్తూ ఆయన బాగుపడుతున్నాడు అంతే!"

"ఏమిటే, నువ్వనేది? మామయ్య స్వలాభంతోనే మనకి సాయం చేస్తున్నాడంటావా?"

"ఖచ్చితంగా! లేకపోతే ఆయనకి మన మీద అంత ఇంట్రెస్టేమిటి? అసలు ఎవరిమీదయినా సరే అంతగా డిపెండ్ అవకూడదు''

"మామయ్య స్వలాభంతోనే నాకు సహాయపడుతున్నమాటే వాస్తవం అయితే రూపాయి వడ్డీ ఆశించకుండా నాకు నలభైవేలు చేబదులుగా ఇచ్చేవారా?"

"నీకు చేబదులా? నువ్వాయన దగ్గర అంత డబ్బు తీసుకోవలసిన అవసరం ఏమొచ్చింది?"

"ఫ్యాక్టరీ ప్రారంభోత్సవానికి వచ్చినప్పుడు మీకు బట్టలు కొనడానికి తెచ్చిన డబ్బు మీ ఇంట్లో ఇరవైవేలు పోలేదా? నేను ఇక్కడికి వచ్చాక ఆ డబ్బు మీకు పంపలేదా? ఆ డబ్బు ఎలా వచ్చింది?"

"అయితే మాత్రం? ఇన్నాళ్ళనుంచి దాచిన డబ్బంతా ఏం చేస్తున్నావ్?" నిలదీస్తున్నట్టుగా వుంది నీరజ స్వరం.

అన్నపూర్ణ విహ్వలంగా చూస్తూ అంది. "నేనేమీ దుబారా చెయ్యడంలేదు నీరజా! కడుపుకింత తిండి, కట్టుకోడానికి బట్టలు తప్ప నాకీ వయసులో ఏం కావాలి? చీరలు కూడా సాదావే కొనుక్కుంటున్నాను. నేను పట్టుచీరలు కట్టుకుని, నగలు పెట్టుకుని శుభ కార్యాలకి వెళ్ళనుకదా, నీ చదువుకి, పెళ్ళికి అయిన డబ్బంతా ఎక్కడిదమ్మా?"

"ఇన్ని సంవత్సరాలనుంచి పొలంమీద వస్తున్న రాబడి అంతా నా చదువుకి, పెళ్ళికి ఖర్చయిపోయిందా?"

ఆవిడ కూతురు అలా అడుగుతుందని కాని, అలా అడగగలదని కాని వూహించలేదు. హతాశురాలై చూస్తున్న ఆవిడ మెల్లిగా వెళ్ళి ట్రంకుపెట్టెలోనుంచి పుస్తకం తీసి కూతురిముందు పడేసింది.

"ఇదుగో పద్దు పుస్తకం. నేను ఖర్చు పెట్టిన ప్రతిపైసా ఖర్చు రాసేవుంచాను. చూసుకో''

నీరజ అసహనంగా ఆ పుస్తకం తిరగేస్తోంది. దాంట్లోని అంకెలు, ఖర్చుపెట్టిన వివరాలు నిజమే. తన చదువుకి, పెళ్ళికి ఎంత ఖర్చయిందో తనకీ తెలుసు. కాని నిజాన్ని అంగీకరించడానికి ఆమెకి చిన్నతనంగా అనిపించింది. అదీ తల్లితో ఇంత ఘర్షణ తరువాత.

ఆమె ఆ పుస్తకాన్ని పెట్టెలో విసురుగా పడేస్తూ అంది.

"ఈ లెక్కలని బట్టి చూస్తే నువ్వు వ్యవసాయం చేస్తూ మిగిల్చినది ఏమీ లేదని అర్థమవుతోంది. అంత గిట్టుబాటు కాని వ్యవసాయం చెయ్యకపోతేనేం? పొలం అమ్మేయి. పీడా వదులుతుంది''

"నా ఒంట్లో జవసత్వాలుడిగిపోయినరోజు ఎలాగా ఆపనే చేస్తాను''

నీరజ అసహనంతో వేగిపోతూ పళ్ళు కొరుక్కుంటూండిపోయింది. తను తల్లిని డబ్బు అడగాలనుకున్న విషయం మరుగున పడిపోయినందుకు ఆ అసహనం.

★ ★ ★



మరునాడు తల్లి స్నానం చేస్తుండగా నీరజ పెట్టెతీసి బ్యాంక్ పాస్‌బుక్ చూసింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. బ్యాంక్‌లో లక్షా, అరవైవేలు డబ్బువుంది''

"ఇంత డబ్బు బ్యాంక్‌లో వుండగా తల్లి తన దగ్గర డబ్బు లేదని ఎందుకు చెప్పింది? పైగా మామయ్య దగ్గర చేబదులు తీసుకోవలసిన అవసరం ఏమిటి?" ఆమెకి తల్లి తనని అందమైన అబద్ధాలతో మోసం చేస్తోందన్పించింది. మెల్లిగా ఆ పుస్తకాన్ని పెట్టెలో పెట్టేసింది. ఆమె బయటపడదలచుకోలేదు. తనకి కావలసింది డబ్బు. తల్లితో గొడవ పడడం కాదు.

తల్లి వంట ప్రయత్నం చేస్తుండగా అడిగింది, "నాకు కొంచెం డబ్బు కావాలి''

"ఎంత?" కూర తరుగుతున్న ఆవిడ తల ఎత్తకుండానే అడిగింది.

"నువ్వెంత ఇవ్వగలవ్?"

"ఒక పదివేలయితే ఫర్వాలేదు''

"సరిపోదు. కనీసం రెండు లక్షలయినా కావాలి''

అన్నపూర్ణమ్మ చెయ్యి తెగింది. "రెండు లక్షలా? ఎందుకు?"

"ఫ్యాక్టరీలో పెట్టుబడికి అవసరమయింది''

"నా దగ్గర అంత డబ్బులేదు''

నీరజ విసురుగా లోపలకి వెళ్ళి బ్యాంక్ పాస్‌బుక్ తీసి ఆవిడ ముందు పడేస్తూ అంది.

"ఎందుకు నన్నింకా మభ్యపెట్టాలని చూస్తావ్? నా దగ్గర కూడా అబద్ధమేనా? వ్యవసాయం కిట్టుబాటు కాలేదని, రాబడి అంతా నా చదువుకి, పెళ్లికి ఖర్చయిందని, మామయ్య దగ్గర నలభైవేలు చేబదులుగా పుచ్చుకున్నానని ఇలా ఎన్ని అబద్ధాలు చెబుతావ్. బ్యాంక్‌లో లక్షా అరవై వేలు డబ్బు వుండగా డబ్బులేదని అబద్ధం ఎందుకు చెబుతున్నావ్?"

"ఆ డబ్బు రెండెకరాల పొలం అమ్మితే వచ్చింది''

"పొలం అమ్మేశావా? ఎందుకు?" అరిచిందామె.

"లేకపోతే వేలకి వేలు నీకు, మీ ఆయనకి కానుకలుగా ఇస్తూ, వ్యవసాయిం ఖర్చులు భరిస్తూ ఎలా గడపగలను?"

"ఎవరికి అమ్మేవు? ఎప్పుడమ్మేవ్?"

"నాలుగు నెలల క్రిందట. మామయ్యకే అమ్మేను''

"ఎంతకి పుచ్చుకున్నాడు?"

"ఎకరం లక్షకి కొన్నాడు''

"అదన్నమాట విషయం. నీకు సాయపడినట్టుగా నటించి, కారుచౌకగా భూమి నీదగ్గర నుంచి కాజేశాడు''

"నీరజా! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా? అసలు వ్యవసాయం గురించి, భూమిరేటు గురించి నీకేం తెలుసు? ఈ ప్రాంతంలో భూమి అంతకంటే విలువ చెయ్యదు''

"నువ్వు కనీసం బోరింగ్ వేయించాలని కూడా అనుకోలేదు. చెప్పుకోవడానికి పదిహేను ఎకరాల భూమి'' గౌతమ్ అతని తల్లితో అన్నమాటలు గుర్తువచ్చి మనసు మండిపోతుంటే కచ్చగా అంది.

"నాకు కొడుకులు వుండివుంటే, వాళ్ళు చేతికి అందివచ్చి వ్యవసాయం చేస్తారనే నమ్మకం వుంటే బోరింగ్ వేయించేదాన్ని. ఆ ఆశలేదుగా! అందుకే పొలంమీద అనవసరంగా డబ్బు పెట్టుబడి పెట్టదలచుకోలేదు''

"ఇంతకీ నువ్వనేదేమిటి? డబ్బు ఇస్తావా? ఇవ్వవా?"

"చెప్పానుగా, అంత డబ్బు ఇవ్వలేను''

"నిన్ను అడిగి డబ్బు తెస్తానని, ఇంకెక్కడా డబ్బు కోసం ప్రయత్నించవద్దని గౌతమ్‌తో చెప్పాను. ఇప్పుడు నువ్వు డబ్బు ఇవ్వనంటే నా పరువేమవుతుంది?"




"ఇందులో పరువుపోడానికేముంది? డబ్బు లేదని చెప్పు"

"అంత డబ్బు వుంచుకుని లేదంటావేం? ఏం చేసుకుంటావు ఆ డబ్బంతా?"

"కోతలు, నూర్పిళ్ళు ఉత్తినే అవుతాయా? కూలి ఖర్చో?"

"బోడి పన్నెండు ఎకరాల పొలానికి నూర్పిళ్ల ఖర్చు ఎంతవుతుందేం?" నీరజ అరిచింది.

"భూమిని పట్టుకుని వేలాడుతూ నువ్వు సాధించినదేమిటి? పొలం అమ్మి ఆ డబ్బు నాకిచ్చిచూడు. సంవత్సరం తిరిగేసరికల్లా ఆ డబ్బుని రెట్టింపు చేస్తాను''

అన్నపూర్ణమ్మకి కూతురి ధోరణికి ఎంత బాధనిపించిందంటే అక్కడనుంచి దూరంగా వెళ్ళిపోయి కరువుతీరా ఏడవాలన్పిస్తోంది. ఎంత సేపూ భూమి అమ్మెయ్యి అని గొడవే!

"కావాలంటే ఒక లక్ష రూపాయలిస్తాను. పట్టుకెళ్ళు'' అంది.

"పదివేలు నువ్వుంచుకుని లక్షా యాభైవేలు నాకియ్యి''

"వున్న డబ్బంతా నీకిచ్చి నూర్పిళ్ళకి కూలి ఖర్చు ఏం పెట్టను?" నిస్సహాయంగా అడిగింది.

"నీకు అలవాటేగా? మీ అన్నగారిని అడుగు! ధాన్యం అమ్మి ఆయన అప్పు తీర్చెయ్యి. వడ్డీలేని అప్పేగా?"

నీరజని లాగిపెట్టి కొట్టి వీధిలోకి నెట్టి తలుపు మూసెయ్యాలన్నంత ఉద్రేకం వచ్చింది ఆవిడకి. కానీ తల్లిప్రేమ అలా చెయ్యలేకపోయింది.

ఆ మధ్యాహ్నం నీరజ డబ్బుతో ప్రయాణమవుతూ అంది.

"నువ్వు ఈ భూములన్నీ అమ్మి ఆ డబ్బు మా ఫ్యాక్టరీలో పెట్టుబడి పెట్టు. వ్యవసాయం చెయ్యడం అనవసరం. ఇంకా ఈ భూమిని నమ్ముకోవడం నీ తెలివి తక్కువతనం" కూతురువెళ్ళాక ఆవిడ గుండె పగిలేలా ఏడ్చింది.

★ ★ ★

"హలో'' పల్లవి ఫోన్‌లో మామగారి స్వరం విని నిటారుగా అయింది. "మామయ్యగారూ! కులాసాగా వున్నారాండీ?" నమ్రతగా అడిగింది.

"నేను బాగానే వున్నానమ్మా! అరుణ్ ఇంట్లోలేడా?"

"స్నానం చేస్తున్నారండీ! మీరు మళ్ళీ ఫోన్ చేస్తారా? వద్దులెండి. ఆయన స్నానం పూర్తి కాగానే మీకు ఫోన్ చెయ్యమని చెబుతానులెండి''

"పల్లవీ! మీరిద్దరూ వెంటనే బయలుదేరి ఇక్కడకి రాగలరా?" జగపతిరావుగారి స్వరంలో ఏదో సంశయం, ఏదో చెప్పాలనీ చెప్పలేకపోతున్న ఇబ్బందికరమైన ఫీలింగ్.

"ఏమయింది మామయ్యగారూ? అందరూ కులాసాగా వున్నారా?" పల్లవి స్వరంలో ఆదుర్దా, ఆందోళన.

"అబ్బే! ఏం లేదమ్మా! మీ నాన్నగారికి కొంచెం ఒంట్లో బాగాలేదుట. మీ అమ్మగారు ఇప్పుడే నాకు ఫోన్ చేసి చెప్పారు. ఆయన నిన్ను చూడాలనుకుంటున్నారుట"

"నాన్నగారికా? ఏమయింది?" పల్లవి స్వరంనుంచి ఆ మాటలు ఆర్తనాదంలా ధ్వనించాయి.

"కంగారు పడవలసినదేం లేదమ్మా. కొంచెం జ్వరంగా వుందిట. ఆయన నిన్ను చూసి చాలా రోజులయింది కదూ? అందుకని నిన్ను చూడాలనుకుంటున్నారు. అంతే! మీరు వెంటనే బయలుదేరి వచ్చెయ్యండి. ట్రైన్ కోసం చూడకండి. ఫ్లైట్‌లో వచ్చెయ్యండి. అరుణ్‌తో చెప్పు" ఆయన ఫోన్ పెట్టేశారు.

పల్లవి చేతిలోనుంచి రిసీవర్ జారిపోయింది. "ట్రైన్‌కోసం చూడద్దు. ఫ్లైట్‌లో

వచ్చెయ్యండి. అంటే అర్థమేమిటి? ఆయన తనని అంత తొందరపెట్టడానికి కారణం ఏమిటి? నాన్నగారు ఎలా వున్నారో? అసలు ప్రాణాలతో వున్నారో లేదో?" ఆమెకి ఏడుపొస్తోంది.

గదిలో అరుణ్ పెర్ఫ్యూమ్ స్ప్రే చేసుకుంటూ విజిల్ వేస్తున్న ధ్వని.

"ఏమండీ!" ఒక్కంగలో వెళ్ళి అతన్ని హత్తుకుపోయి ఏడ్చేసింది.

"మా నాన్నగారు..."

"ఏమయింది? వివరంగా చెప్పు" అతను కూడా కంగారుపడిపోయాడు.

పల్లవి ఏడుస్తూ మామగారు ఫోన్‌లో చెప్పినదంతా చెప్పింది.

"టాక్సీలో బెంగుళూర్ వరకు వెళ్ళి అక్కడ ఫ్లైట్ ఎక్కితే హైదరాబాద్ వరకు వెళ్తాం. అక్కడనుంచి రాజమండ్రి ఎలాగో వెళ్లవచ్చు. టైమ్ లేదు. వుండు. టాక్సీ కోసం ఫోన్ చేస్తాను'' అతను ఫోన్ దగ్గరకి నడిచాడు.

పల్లవి బట్టలు సర్దడం మొదలుపెట్టింది.

★ ★ ★

ఇంటిముందు టాక్సీ ఆగేప్పటికే పల్లవికి అర్థమయిపోయింది జరగరానిదేదో జరిగిపోయిందని. ఇంటి ఆవరణ అంతా జనంతో నిండిపోయి వుంది. అందరి ముఖాల్లోనూ విషాదం.

పల్లవి ఒక్కుదుటున కారుదిగి లోపలకి పరుగెట్టింది. హాలులో పడుకోబెట్టబడి వున్నాడు మురళీధరరావు... కాదు.... ఆయన మృతదేహం. పక్కనే తల్లి గుండెల విసేలా రోదిస్తోంది. ఆమె స్థాణువులా నిలబడిపోయింది. చెవులలో హోరు. మెదడు ఆలోచించే శక్తిని కోల్పోయింది. తండ్రి మృతదేహం పక్కనే కూలబడిపోయి, చేతులతో వెర్రిగా ఆయన ముఖాన్ని తడుముతోంది.

"నువ్వు ధైర్యం తెచ్చుకో పల్లవీ!" అంటోంది అత్తగారు. ఆమె చెవులు వినేశక్తిని కోల్పోయాయి.

"అమ్మా! ఏమిటిది, నాన్నగారికేమయింది?" అస్పష్టంగా అడుగుతోంది.

"పల్లవీ!" ఉమ ఆమెను పొదివి పట్టుకుంది. అప్పుడొచ్చిందామెకి దుఃఖం. ఆమె భుజంపై వాలిపోయి వెక్కివెక్కి ఏడవడం ప్రారంభించింది.

"పాపం పల్లవి! ఒక్కర్తే కూతురని పంచ ప్రాణాలు ఆ అమ్మాయిపైనే పెట్టుకుని బతికారాయన"

"ఆరోగ్యంగానే వుండేవారు! ఎంతలో చావు ముంచుకొచ్చింది'' జనంలోనుంచి సానుభూతితో కూడిన మాటలు విన్పిస్తున్నాయి.

"ఆ మధ్యన గుండెల్లో నొప్పి వచ్చిందిట. డాక్టర్లు హార్ట్ ఎటాక్ అన్నారుట!"

పల్లవి చివ్వున తల ఎత్తింది. "తండ్రికి గతంలో ఒకసారి హార్ట్ ఎటాక్ వచ్చిందా? ఆ విషయం తనకెవరూ చెప్పనేలేదు''

"నాన్నగారి అనారోగ్య విషయం నాకెప్పుడూ చెప్పలేదేమిటమ్మా?" తల్లి ఒడిలో పడి ఏడ్చింది.

"నీకు చెప్తే బెంగపెట్టుకుంటావని చెప్పవద్దన్నారమ్మా'' తల్లి ఏడుస్తోంది.

పల్లవి తండ్రి మృతదేహంవైపు చూస్తోంది. ఆ ముఖంలో నవ్వు చెరిగిపోలేదు.

ఆయన ఇంకా 'పల్లవీ' అని తనని పిలుస్తున్నట్టేవుంది.

"నాన్నగారూ ఎందుకిలా చేశారు నాన్నగారూ?" ఆయనపై వాలిపోయి ఏడవసాగింది.

ఉమ, పార్వతమ్మలిద్దరూ ఆమెని చెరొకవైపు పట్టుకుని లేవదీశారు.

"పల్లవీ! నువ్వే ఇలా అయిపోతే ఎలా? మీ అమ్మగారు పెద్దావిడ. ఆవిడనెవరు ఓదారుస్తారు? ఆవిడకి నువ్వు తప్ప ఎవరున్నారు?" ఉమ ఏడుస్తూనే స్నేహితురాలిని ఓదా





ర్చింది.

"ఆ భగవంతుడు ఎంత నిర్దయుడు? నాలాంటిదాన్ని ఇంకా బతకమని ఆయుర్దాయమిచ్చాడు? నలుగురి మంచి కోరుతూ పదిమందికి సాయపడే ఆ మహానుభావుడిని తీసుకుపోయాడు'' అనుకుంటూ పార్వతమ్మ ఏడుస్తోంది.

ఆ మధ్యాహ్నం మురళీధరరావు అంత్యక్రియలు జరిగాయి.

★ ★ ★

కర్మకాండలన్నీ పూర్తయ్యాయి. బోసిపోయిన తల్లిని చూసి ఒకవైపు బాధపడుతూనే పల్లవి ఉమ సహాయంతో చెయ్యవలసిన పనులన్నీ పూర్తిచేసింది.

మురళీధరరావు చనిపోయిన వారంరోజుల తరువాత జగపతిరావుగారు పల్లవితో అన్నారు. "ఈ పరిస్థితులలో మీ అమ్మగారు ఇక్కడ ఒంటరిగా వుండడం అనవసరం. ఇంట్లో సామానంతా రెండు గదులలో సర్దేసి, ఒక రెండు గదులు ఖాళీగా వుంచుకుని, మిగతా భాగం అద్దెకిచ్చేసి మీ అమ్మగారిని నీతో తీసుకెళ్ళిపోవడం మంచిది. ఆవిడకిమాత్రం నువ్వు తప్ప ఎవరున్నారు''

పల్లవికి హఠాత్తుగా పెళ్ళయిన కొత్తల్లోనే "వదినా వాళ్ళమ్మగారి గదిపక్కనే మరో గది ఖాళీగా వుంచండి. పల్లవి వాళ్ళమ్మగారు ఎప్పటికైనా మన ఇంటికి రావలసిందేగా?" అని ప్రమీల అనడం గుర్తుకొచ్చింది.

"ప్రమీల నోట్లో శని వుందా? లేకపోతే ముందు జరగబోయే ఘోరాన్ని భగవంతుడు ఆమెనోట పలికించాడా?" ఆమెకి దుఃఖం వచ్చింది.

అరుణ్ బయలుదేరబోయేముందు అన్నాడు. "నాకు సెలవు అయిపోవచ్చింది. నేను వెళ్లిపోతాను. నువ్వు మరి కొన్నాళ్ళు ఇక్కడే వుండి కావలసినవన్నీ ఏర్పాటు చేసుకుని, మీ అమ్మగారిని తీసుకొచ్చెయ్యి''

అరుంధతి ఎటూ చెప్పలేని స్థితిలో వుంది. భర్త హఠాన్మరణాన్ని తట్టుకుని ఒంటరిగా ఇక్కడ బతికే మనస్థైర్యం లేదు. అలాగని అల్లుడి ఇంటికి వెళ్ళాలనీ లేదు. ఆవిడ ద్వైదీభావాలతో సతమతమవసాగింది.

"తనకి మాత్రం ఎవరున్నారు? కొడుకైనా అల్లుడయినా అరుణే'' అనుకుంది చివరికి.

ఉమ, పార్వతమ్మల సహకారంతో పల్లవి అనుకున్నదానికంటే ముందుగానే పనులన్నీ పూర్తిచేసింది. ఆరోజే వాళ్ళప్రయాణం. ఆమెకి ఒకపక్కన భయంగానే వుంది. "మూడవ మనిషిముందుకూడా అవమానించే భర్త కోపం వస్తే నోటికెంతవస్తే అంతా తిట్టే అతను తల్లి తమతో వున్నప్పుడైనా తన ప్రవర్తనని మార్చుకుంటాడా? తల్లినైనా గౌరవంగా చూస్తాడా? ఆమెకసలు తల్లిని తనతో తీసుకెళ్ళాలని లేదు. అలాగని ఒంటరిగా వదిలి వెళ్ళాలనీ లేదు.

పల్లవి తండ్రిని తలుచుకుని కుమిలికుమిలి ఏడ్చింది. ఒక మనిషి మరణంతో కుటుంబం చిన్నాభిన్నమైన సంఘటనలు అనేకం చూసింది.

"తండ్రి హఠాన్మరణం తల్లి జీవితాన్ని ఏ మలుపు తిప్పనుందో?"

ఉమ, పార్వతమ్మలతోబాటు పల్లవి అత్తగారు, మామగారు రైలు స్టేషన్‌కి వచ్చారు.

"అది మీ అల్లుడి ఇల్లుకాదు. ఇకనుంచి మీ ఇల్లేననుకోండి. వాళ్ళకి పెద్దదిక్కులా వుండాలి మీరు'' అంది శ్యామలాదేవి.

ఉమ పల్లవి దగ్గరగా కూర్చుని ఆమెకి ఒక్కదానికే విన్పించేంత రహస్యంగా అంది.

"నువ్వు అదృష్టవంతురాలివే! అత్తగారిని అమ్మగా చూసుకునే భర్త దొరికాడు నీకు. నీతోబాటు మీ అమ్మగారూ అదృష్టవంతులే'

పల్లవి పెదవులు విచిత్రమైన నవ్వుతో విచ్చుకున్నాయి.



"అదృష్టమో, దురదృష్టమో కాలమే నిర్ణయించాలి'' అనుకుంది.

★ ★ ★

నీరజ అందించిన డబ్బు చూస్తూ అడిగాడు గౌతమ్ "ఎంత? లక్షా?"

"కాదు లక్షా యాభైవేలు''

"లక్షా యాభైవేలా?" నవ్వాడు. ఆ నవ్వు తనని పరిహసిస్తున్నట్లు అనిపించిందామెకి.

"అమ్మ పొలం అమ్మేసే ఆలోచనలో వుంది. మరో నాలుగునెలల్లో అంతా సెటిలవుతుంది. అప్పుడు మొత్తం ఇచ్చేస్తానంది'' చప్పున అబద్ధం చెప్పింది. అయినా గౌతమ్ ముఖంలో వెలుగు కనిపించలేదు. అతని అసంతృప్తికి కారణం ఆమెకి తెలుసు. తను, అతనూహించినంత ఆస్తిపరురాలు కాదు.

ఆరాత్రి అమరేశ్వరి నీరజ దగ్గర కూర్చుంటూ ఆప్యాయత ఉట్టిపడే స్వరంతో అంది.

"మీ అమ్మగారికి మాత్రం ఎవరున్నారు? కొడుకు అయినా, కూతురివైనా నువ్వేకదా! ఆవిడ ఒక్కరూ ఆ పల్లెటూరిలో వుండడమెందుకు? ఆవిడనీ ఇక్కడకే వచ్చెయ్యమను. మనతో బాటే వుంటారు''

నీరజ ఆవిడ ఆంతర్యాన్ని గమనించలేని అమాయకురాలేమీ కాదు. అత్తగారు తన తల్లిని పిలుస్తున్నది ఆవిడపై ప్రేమతోకాదు. ఆవిడ వెనుకవున్న ఆస్తికోసం అని ఆమెకి తెలుసు. ఆమెకి బాధ కలుగలేదు. పైగా తనకా ఆలోచన ఎందుకు రాలేదా అని తనని తనే తిట్టుకుంది.

మరునాటి ఉదయం గౌతమ్ చెప్పాడు "రేపు నా ఫ్రెండ్ మ్యారేజ్ రిసెప్షన్‌కి వెళ్ళాలి. రెడీగా వుండు''

"అలాగే' పార్టీలకి, పెళ్ళిళ్ళకి హాజరై తనకి వున్న పట్టుచీరలు, నగలు ప్రదర్శించే అలవాటున్న ఆమె ఉత్సాహంగా చెప్పింది.

మరునాడు అతను ఫ్యాక్టరీకి వెళ్తుండగా చెప్పింది.

"నన్ను బ్యూటీపార్లర్ దగ్గర డ్రాప్ చెయ్యి గౌతమ్''

"సరే' అన్నాడతను.

నీరజ బ్యూటీపార్లర్‌కి వెళ్ళి అటునుంచే లాకర్‌లోనుంచి తన నగలు తెచ్చుకోవడానికి బ్యాంక్‌కి వెళ్లింది.

లాకర్‌లో నగలు లేవు. ఆమెకి ఖంగారుతో అరిచేతులలో చెమట పట్టేసింది. "నగలు ఏమయ్యాయి? తనకి, గౌతమ్‌కి జాయింట్ లాకర్ అది. ఒకవేళ గౌతమ్ తన కంటే ముందే నగలు తీశాడా?" ఆమె ఆలోచిస్తూ బయటికి వచ్చి ఒక పబ్లిక్ టెలిఫోన్ బూత్‌నుంచి గౌతమ్‌కి ఫోన్ చేసి, నగల విషయం అడిగింది.

"నగలు నేను తీశాను'' చెప్పాడతను.

నీరజ రిలీఫ్‌గా నిట్టూర్చి అంది "ఆ విషయం నాకు చెప్పవచ్చుగా?"

"చెప్పాలనుకున్నాను. నువ్వు బ్యాంక్‌కి వెళ్తావని నాకేం తెలుసు?" అన్నాడతను.

ఆ రాత్రి పట్టుచీర కట్టుకుని ముస్తాబై షూ వేసుకుంటున్న గౌతమ్ దగ్గరికి వచ్చి అడిగింది.

"నగలు ఎక్కడ పెట్టావు?"

"నగలా? అమ్మేశాను'' తాపీగా చెప్పాడతను.

నీరజ కాళ్లకింద భూమి కంపించినట్టయింది. "ఏ... ఏమిటీ?" కెవ్వుమన్నట్టు అంది.

"డబ్బు అవసరం వచ్చి అమ్మేశాను''

"మొత్తం అమ్మేశావా?"

"ఎందుకంత గాభరా పడతావు? నగలదేముంది? మళ్లీ చేయించుకోవచ్చు. డబ్బు తక్కువయింది. అమ్మేశాను''

నీరజ కళ్లలో చివ్వున ఉబకబోతున్న నీటిని బలవంతాన నిగ్రహించుకుంటోంది. పొలం ఎందుకు అమ్మావని తల్లిని నిలది





య్యగలిగిన ఆమె ఇప్పుడు అతను అతని తల్లి పెళ్ళిలో పెట్టిన నగలనే కాకుండా తన తల్లి పెట్టిన నగలని కూడా అమ్మేసినా ఇదేమిటని అడగలేకపోతోంది. తనకి చెప్ప కుండా ఎందుకు అమ్మేవని నిలదియ్యలేక పోతోంది.

"పోనీలే! అప్పు చెయ్యడంకంటే అదే మంచిది. ఆడవాళ్ళ ఒంటిమీద బంగారం అవసరానికి ఆదుకోడానికే కదా'' అంది అతను చేసిన పనిని సమర్ధిస్తున్నట్టు.

గౌతమ్ గుంభనంగా నవ్వుకున్నాడు. మనసులో కుళ్ళిపోతూ పైకి ఏమీ జరగనట్టు అతి మామూలుగా ప్రవర్తిస్తున్న ఆమె నటనా చాతుర్యాన్ని మనసులోనైనా అభినందించ కుండా వుండలేకపోయాడు.

★ ★ ★

అరుణ్ అత్తగారితో ఎక్కువ మాట్లాడకపో యినా మాట్లాడే రెండు మాటలూ మర్యాద ఉట్టిపడుతూనే వుంటాయి. అరుంధతి కూతురి పెళ్ళయిన తరువాత వియ్యాలవారి ఇంట్లో మనుగుడుపులకి ఒక్కరోజు మాత్రం వుంది. తరువాత వూళ్ళోనే వియ్యాలవారి ఇల్లు అయినా, ఎప్పుడూ ఫోన్‌లో మాట్లా డ్డమో లేక ఏ సాయంకాలంపూటో ఒక గంట కూర్చుని రావడమో తప్ప ఇలా వచ్చివు న్నది లేదు.

పల్లవి మైసూర్ వెళ్లిన కొత్తలో తల్లిని, తండ్రిని తమ ఇంటికి రమ్మని ఆహ్వా నించింది.

"వస్తాంలే అమ్మా! అల్లుడుకింక ట్రాన్స్‌ఫ రవదుగా'' అన్నాడు మురళీధరరావు.

భర్తతో కలిసి కూతురి కాపురాన్ని చూడ్డాని కి రావలసిన తను ఇలా భర్తని కోల్పోయిరా వడం అరుంధతికీ బాధగానే వుంది.

కూతురికి ఇంటిపనిలో సాయపడుతూ, ఆమె వున్నంతసేపూ ఏవో కబుర్లు చెప్పే ఆవిడకి కూతురు, అల్లుడు ఆఫీసుకి వెళ్ళగానే భరించరానంత ఒంటరితనంగా అనిపించేది. ఆలోచనలు దెయ్యాల్లా పీడించేవి. ఆమెకి వర్తమానాన్ని గురించి ఆలోచనకంటే, గతా న్ని తలచుకుంటే బాధ, భవిష్యత్తుపై భయం ఎక్కువ కలుగుతున్నాయి.

అప్పటికి ఆవిడ మైసూరు వచ్చి వారం రోజులు. ఆరోజు అరుణ్ రోజూకంటే ఆఫీసు నుంచి ముందుగా వచ్చాడు. పొడిగా, ముక్త సరిగా తనతో మాట్లాడే అల్లుడి దగ్గర చనువు లేదావిడకి.

"కాఫీ ఇవ్వనా బాబూ'' ఆప్యాయంగా అడిగింది.

"మీకెందుకండీ శ్రమ పల్లవి వస్తుంది గా''

"ఇందులో శ్రమకేముంది బాబూ'' ఆవిడ కాఫీ కలిపి ఇచ్చింది. అతను ఒక గుక్క తాగి ముఖం చిట్లించాడు. పంచదార ఎక్కు వయింది. అతనా కాఫీని వంటింట్లో సింక్‌లో పారబోసాడు.

గదిలో కూర్చున్న అరుంధతికీ విషయం తెలియదు.

పల్లవి ఇంటికొచ్చేప్పటికి అరుణ్ చిరచిర లాడుతున్నాడు. ఆమెకి ఆ ఉదయంనుంచి ఒళ్ళు నెప్పులుగా జ్వరం వచ్చినట్టు వుంది. ఆఫీసులో పనిచెయ్యబుద్ధికాలేదు. అలాగే పని చేసేప్పటికి నిజంగానే జ్వరం వచ్చే సింది.

ఇంటికి వచ్చిన పల్లవి భర్త ముఖం చూసి ఏం జరిగిందోనని భయపడింది. తల్లి ముఖం ప్రశాంతంగా వుండడం చూసి తేలి గ్గా వూపిరి పీల్చుకుంది.

జ్వర తీవ్రతవలన ఎర్రబడిన కళ్ళతో వడలిపోయిన ముఖంతో వున్న కూతుర్ని చూసి అరుంధతి కలవరపడిపోయింది.

"ఏమయిందమ్మా? ఎందుకలా వున్నావ్?'' ఆదుర్దాగా అడిగింది.

"కొంచెం జ్వరం వచ్చింది'' అంది పల్లవి కిచెన్‌లోకి వెళ్తూ.

అరుంధతి కూతురి వెనకాలే వస్తూ అంది, "నువ్వు పడుకో! వంట నేను చేస్తాను''

ఈలోగా అరుణ్ అక్కడకి వచ్చాడు.

"కాఫీ కలుపు. తలనెప్పిగా వుంది''

"నేను కలుపుతాను బాబూ! పల్లవికి జ్వరం" అందావిడ.

"అయితే నేను కలుపుకుంటాను. మీరు వెళ్ళి కూర్చోండి''

"నేను వున్నానుగా బాబూ!" అందావిడ పాలగిన్నె స్టవ్‌మీద పెడుతూ.

"నేను కలుపుకుంటానంటున్నానుగా?" ఇంచుక పదునుగా ధ్వనించిందతని స్వరం. ఆ స్వరం ఆవిడని అక్కడనుంచి వెళ్ళిపోయేలా చేసింది.

"ఎందుకలా చిరచిరలాడుతున్నారీవేళ?" పల్లవి డికాషన్ గ్లాసులోకి వంపుతూ అడిగింది.

"చిరాగ్గా వుండక, ఆనందంగా ఎలా వుండమంటావ్? నా ఇంట్లో నాకు ప్రయివసే కరువైపోతుంటే''

పల్లవి నిశ్చేష్ట అయింది. "తల్లి తమ ఇంటికి వచ్చి వారంరోజులు. అప్పుడే అతనికి ఆవిడ ఉనికి అయిష్టంగా వుందా?"

"ఆవిడని నాకు కాఫీ ఇమ్మని ఏడ్చానా? పంచదార పానకంలా చేసి నా ముఖాన పడేసింది''

"కాస్త పంచదార తక్కువ వెయ్యమని చెప్పలేకపోయారా?"

"అసలావిడ అన్ని పనులలోనూ ఎందుకు కలుగచేసుకోడం? పొద్దుటా అంతే! కూర ఆవిడే చేసినట్టుంది. గొడ్డుకారం! వట్టి రొట్టెలు తినలేక ఆఫీసులో ఫ్యాన్‌కిచ్చేసాను''

ఆ కూర పల్లవి రుచి చూసింది. కాస్త కారం ఎక్కువైన మాట నిజమే. అయినా గొడ్డుకారంలా లేదు.

"రేపటినుంచి వంట నేనే చేస్తానులెండి''

"అలా చెయ్యి. లేకపోతే నేనావిడని ఏదైనా అంటే బాధపడతారు'' అన్నాడు అరుణ్ కాఫీ కప్పుతో అవతలకి వెళ్తూ.

పల్లవి వంట ప్రయత్నంలో పడింది. కుక్కర్ విజిల్ విన్న అరుంధతి కిచెన్‌లోకి వచ్చింది.

"అదేమిటి పల్లవీ! అంత జ్వరంతో నువ్వు వంటచెయ్యడమెందుకు? నేను చేస్తానుగా?" అంది కూతురి చేతిలోనుంచి గరిట తీసుకోబోతూ.

"ఫర్వాలేదమ్మా! నువ్వు లేకపోతే ఏంచేసేదాన్ని''

"నేనువున్నాను కనుకనే చేస్తానంటున్నాను. ఏ పనీ చెయ్యకుండా తిని కూర్చుంటే నాకూ విసుగ్గా వుంది''

"ఆయన పొద్దుట కూరలో కారం ఎక్కువయిందన్నారు''

కూతురి మ్లానమైన ముఖాన్ని, కొద్దిసేపటికిందటి అల్లుడి స్వరంలోని విసుగుదలని గమనించిన ఆవిడకి అతను ఆమెతో ఏమన్నాడో అర్థమయింది.

"పోనీలేమ్మా! అతనికి నచ్చినట్టు వండిపెట్టు'' అంది.

నెలరోజులు గడిచేసరికే అరుంధతికి అల్లుడి మనస్తత్వం బాగా అర్థమయింది. ప్రతి చిన్న విషయానికీ ఇరిటేట్ అయ్యే మగవాళ్ళే కాదు ఆడవాళ్ళు కూడా ఆవిడకి తెలుసు. కాని కోపం వస్తే నోటికి వచ్చినట్టల్లా తిట్టడం మాత్రం ఆవిడకి తెలియదు. అరుణ్ చిన్నచిన్న విషయాలకే ఇరిటేట్ అవడం, పల్లవిని అలగాజనం తిట్టుకున్నట్టు తిట్టడం చూసిన ఆవిడ స్తంభించిపోయింది.

చదువుకున్న మనిషి పైగా ఫారిన్ రిటర్న్. అలా నీచంగా, అసభ్యంగా తిడుతుంటే ఆవిడకి దుఃఖం వచ్చింది. తనతో మర్యాదగా మాట్లాడుతున్నా, ఖచ్చితంగా మాట్లాడుతున్నట్టున్న అతని ధోరణి, తనకె





దురుగానే పల్లవిని అసహ్యంగా తిట్టడం ఇవన్నీ ఆవిడని అస్థిమితంగా నలిగిపోయేలా చేశాయి.

"నేను రాజమండ్రి వెళ్ళి ఒక నెలరోజులు వుండాలనుకుంటున్నాను పల్లవీ'' అంది ఆ రాత్రి.

"అదేమిటమ్మా? ఇప్పుడు రాజమండ్రి ఎందుకు''

"వూర్కేనే. కొన్నాళ్ళు మార్పుగా వుంటుందని. ఇక్కడ చెయ్యడానికి పనేమీ లేదుగా''

"అక్కడ మాత్రం ఏంవుంది? ఒంటరిగా ఎలా వుండగలవు''

"అదే అలవాటయిపోతుంది''

"నిజం చెప్పు. నువ్వెందుకో బాధపడుతున్నావు. అందుకే ఇక్కడ నుంచి వెళ్ళిపోతానంటున్నావు కదూ''

అరుంధతి కళ్ళలో నీళ్ళూరాయి. "నువ్వప్పుడే పెళ్ళిచేసుకోనని గొడవ పెడుతున్నా వినకుండా నీ ఇష్టానికి విరుద్ధంగా నీ పెళ్ళి చేశాం. నువ్విలా బాధపడుతూ..." గాద్గదికమైన ఆవిడ స్వరంనుంచి మాటలు పెగలలేదు.

"నువ్వేదో లేనిపోనివి ఊహించుకుని బాధపడుతున్నావు. నేను సుఖంగా వున్నాను. అరుణ్‌కి కాస్త కోపం ఎక్కువన్న మాటేగాని, చాలామంచివాడు. నన్ను ప్రేమగా చూసుకుంటారు''

"నువ్వెంత సుఖపడుతున్నావో చూస్తూనే వున్నానమ్మా. ఇవన్నీ చూస్తూ భరించడం నావలన కాదు. అందుకే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను''

"నువ్వు మళ్ళీ ఇక్కడకి రావు కదమ్మా'' పల్లవి ఏడ్చేసింది. అరుంధతికి దుఃఖం పొంగి వచ్చింది.

"వస్తానమ్మా! నాకు మాత్రం నువ్వు తప్ప ఎవరున్నారు? పోనీ నేను వెళ్ళడం మానెయ్యనా''

"వద్దులే! వెళ్ళు. నీకూ మార్పుగా వుంటుంది. కాని తొందరగా వచ్చెయ్యి''

"వస్తానమ్మా!"

అత్తగారి ప్రయాణం సంగతి విని అరుణ్ అభావంగా అన్నాడు. "టికెట్టు తెప్పించనా''

"మీకు వీలవుతుందా''

"ఆఫీసుబాయ్ వెళ్ళి తెస్తాడు''

"ఇదుగో డబ్బు! మా అమ్మ మీకు ఇమ్మంది'' పల్లవి డబ్బు ఇవ్వగానే అతను తీసుకున్నాడు.

అరుంధతిని ట్రెయిన్ ఎక్కించి వచ్చాక ఇంట్లో అడుగుపెడుతూ అన్నాడతను.

"నాకు ఇంట్లో ఎవరైనా వుంటే ఊపిరి ఆడనట్లుగా వుంటుంది''

"ఎవరైనా అంటే! మా అమ్మేగా'' ఒళ్ళు మండిపోతుంటే పల్లవి అడిగింది.

అతను పట్టుబడ్డ దొంగలా చూసాడు.

"మీ ప్రమీల ఇక్కడకి వచ్చివున్నప్పుడు నేనిలాగే ప్రవర్తించానా''

"ప్రవర్తిస్తే గూబ పగలగొట్టేవాడిని''

పల్లవి రెప్పవాల్చకుండా అతన్ని చూస్తూ అంది.

"నేనలా ప్రవర్తించను. మీ వాళ్ళంతా నా వాళ్ళేనని భావిస్తున్నాను కాబట్టి'' క్షణం ఆగి అంది.

"నాకు మీరేమిటో పూర్తిగా అర్థమయింది. మీ చుట్టూ ఒక పరిధి వుంది. అందులో మీ వాళ్ళకి తప్ప ఇంకెవరికీ స్థానంలేదు. చివరకి నాకు కూడా. అంతేకాదు. మా అమ్మ ఇక్కడకి రావడం కూడా మీకు ఇష్టంలేదు. కాని మా అమ్మకి నేను తప్ప ఎవరున్నారు? ఆవిడ ఎక్కడకి వెళ్తుంది? కనీసం ఆవిడకి పుట్టింటివాళ్ళు కూడా లేరు. దయవుంచి ఆవిడని ఈ చివరి రోజులలో ప్రశాంతంగా బతకనివ్వండి'' పల్లవి ఇంక మాట్లాడలేక ఏడుస్తూ గదిలోకి వెళ్ళిపోయింది.

రాత్రంతా ఆమె ఏడుస్తూనే వుంది. చనిపో

యిన తండ్రిని, ఒంటరిగా మిగిలిపోయిన తల్లిని తలచుకుంటే ఆమె మనసు దుఃఖస ముద్రమే అవుతోంది. అరుణ్ మాత్రం ఆమె బాధలో పాలుపంచుకోకుండా, కనీసం ఆమెని ఓదార్చకుండా హాయిగా పడుకున్నాడు.



"మీ అమ్మగారికి ఉత్తరం రాయి'' అంది అమరేశ్వరి''

"ఏమని రాయనత్తయ్యా?" అడిగింది నీరజ.

"అదే... పొలం అమ్మేస్తారని చెప్పావు కదూ? అది ఎంతవరకు వచ్చిందో కనుక్కో''

ఆవిడ పరోక్షంగా డబ్బు తెమ్మని తనని హెచ్చరిస్తోందని నీరజకి తెలుసు. గౌతమ్ డబ్బు కోసం ఆశపడే తనని పెళ్లిచేసుకున్నాడని తెలిసినా ఆమెకి బాధ కలగడంలేదు. నిజానికి ఆమె కూడా అతని ఆస్తికి, హోదాకి ఆకర్షింపబడే కదా అతన్ని పెళ్ళిచేసుకుంది!

"ఉత్తరం రాయడమెందుకత్తయ్యా! నేనే వెళ్తాను'' అంది.

నీరజ రెండు రోజుల తరువాత తల్లి దగ్గరకి ప్రయాణమయింది. ఆమె ఇల్లు చేరేప్పటికి వరండాలో కూర్చుని అన్నపూర్ణమ్మ, వరలక్ష్మి కబుర్లు చెప్పుకుంటున్నారు. తల్లితో మాట్లాడుతున్న ఆవిడని చూడగానే ఆమె ముఖం అప్రియంగా ముడుచుకుపోయింది.

"కులాసాగా వున్నావా నీరజా!" ఆవిడ ఆప్యాయంగా పలుకరించినా, ఆమె ముభావంగా "ఆc!" అని లోపలకి వెళ్ళిపోయింది. కూతురి వైఖరికి అన్నపూర్ణమ్మకి కోపం వచ్చింది. ఆమె వరలక్ష్మివైపు చూసింది. వరలక్ష్మి ముఖం చిన్నబోయివుంది.

ఆవిడవైపు చూసిన అన్నపూర్ణమ్మ కళ్ళు క్షమార్పణ కోరుకుంటున్నాయి.

"ప్రయాణం చేసివచ్చింది కదా! తలనెప్పిగా వుందేమో! వెళ్ళి కాఫీ ఇవ్వు!" అంది వరలక్ష్మి తమ ఇంటివైపు వెళ్తూ.

అన్నపూర్ణమ్మ లోపలకి వచ్చింది.

"ఎలా వున్నావమ్మా'' నీరజ స్వరంలోని ఆప్యాయత కొత్తగా వుందావిడకి. మౌనంగా కూతురినే చూస్తోంది.

"అలా చిక్కిపోయావేమిటమ్మా బాగా నల్లబడిపోయావు కూడా!"

"నువ్వు నన్ను చూసి చాలారోజులయింది కదూ? అందుకు నీ కళ్ళకి అలా కనిపిస్తున్నానేమో?"

"చాలారోజులు ఎక్కడయింది? నెలరోజులేగా?"

ఆ సంభాషణ ఆవిడకి కృతకంగా అనిపించింది. నీరజ ఎప్పుడూ లేనంత ప్రేమను తనపై వ్యక్తీకరించడం ఆవిడకి ఆశ్చర్యంగా వుంది. ఈమధ్యకాలంలో ఆమె ఎప్పుడూ తనతో అంత ఆప్యాయంగా మాట్లాడలేదు.

"మా అత్తగారు ఎంతో మంచివారమ్మా! గౌతమ్ కూడా చాలా మంచివాడు. అస్తమాటికీ నువ్వెలా వున్నావని అడుగుతుంటారు''

'తను వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు ముభావంగా మాట్లాడి కనీసం భోజనం చేసారా





అనైనా అడగని మనుషులు ఇప్పుడు తన యోగక్షేమాలను కూతురి దగ్గర విచారించ డంలో ఆంతర్యం ఏమిటో ఆలోచిస్తున్న ఆవిడ ఈ సంభాషణ ఎటు దారితీస్తుందో ఊహిస్తోంది.

"అసలు వేళకి ఇంత తిని కృష్ణా రామా అనుకుంటూ నిశ్చింతగా కూర్చోవలసిన ఈ వయసులో ఈ బాదరబందీ అంతా నీకెందుకు చెప్పు? పోనీ నాకో అన్నయ్యో, తమ్ముడో వుంటే ఆ విషయంవేరు. ఇంజనీరింగ్ ప్యాసయిన నేను ఈ పల్లెటూరికి వచ్చి వ్యవసాయం చెయ్యలేను కదా''

అన్నపూర్ణమ్మకి కూతురి రాకలోని ఆంత ర్యం అర్థమయింది. ఆవిడ మౌనంగా ఆమె నే చూస్తోంది.

"నీకు మాత్రం ఎవరున్నారు? కొడుకునైనా కూతురునైనా నేనొక్కర్తినే కదా! మా అత్తగారు కూడా అదే అన్నారు. నిన్ను నాతో తీసుకురమ్మని పంపారు నన్ను''

"నాకిక్కడ బాగానే వుంది నీరజా! ఒంట్లో ఓపికవుంది. ఏదో కాలక్షేపమవుతోంది''

"నీకేదైనా సుస్తీ చేస్తే? ఎవరు చూస్తారు, ఇరుగుపొరుగువాళ్ళు మనవాళ్ళవుతారా?"

"అలాంటి పరిస్థితే వస్తే నువ్వున్నావు కదమ్మా! వైజాగ్ ఎంత దూరమని?" నవ్విందావిడ.

"ఈ వయసులో నువ్విక్కడ ఒంటరిగా వుండడం అనవసరం. నా మాట విని ఈ బాదరబందీలన్నీ వదిలించుకుని నాతో వచ్చెయ్యి. నిన్ను ఇక్కడ ఒంటరిగా వదిలి వెళ్తే నలుగురూ ఏమైనా అనుకుంటారు''

"ఇందులో అనుకోడానికేముంది? నేను ఇంకా ఓపికగానే వున్నాను కదా?"

"నీ పట్టుదలే నీది తప్పు నామాట వినవేం" అసహనంగా అంది. "పొలం అమ్మేసి డబ్బు బ్యాంకులో వేసుకో. మాతోబాటే మా ఇంట్లో వుండి వేళకి ఇంత తిని, కృష్ణా రామా అని ఒక పక్కన నిశ్చింతగా కూర్చో''

"ఆలోచించాలి'' అందావిడ.

"ఎవరితో ఆలోచించాలి? ఇది మనిద్దరికీ సంబంధించిన విషయం. దీంట్లో మూడవ మనిషి జోక్యం అనవసరం" అంది నీరజ.

అన్నపూర్ణమ్మ గుండెని చీల్చుకుని వస్తున్న నిట్టూర్పుని ఆపుకుంటూ అంది.

"పొలం బేరం పెట్టడం అంత సులువైన విషయమేమీ కాదు. మనం తొందరపడి అమ్మజూపితే నష్టమే వస్తుంది''

"ఎవరికైనా చెప్పు. ఈ వూళ్ళో మోతుబరులు చాలామందే వున్నారు. ఎవరో ఒకరు కొనుక్కోకపోరు''

నీరజ వెళ్ళిన మరునాడు ఆవిడ పరంధామయ్యతో చెప్పింది.

"పొలం అమ్మెయ్యాలనుకుంటున్నానన్నయ్యా!"

"మొత్తం అంతానా?"

"అవును''

"ఎందుకని?"

"ఇంక వ్యవసాయం చేసే ఓపిక లేదు''

"నీరజ అమ్మెయ్యమందా?"

"నీరజ చెప్పిందని కాదు కాని నాకే అమ్మెయ్యాలనివుంది'' ఆవిడ మామూలుగానే మాట్లాడుతున్నా ఆవిడ స్వరంలో అంతర్లీనంగా వున్న బాధ, వేదనలను ఆయన కనిపెట్టకపోలేదు.

"అమ్మేసి ఏంచేద్దామని?"

"ఎప్పటికైనా పొలం అమ్మేసి రొఖ్ఖం చేసుకోవలసిందే! నా తరువాత వ్యవసాయం ఎవరు చూస్తారు''

పరంధామయ్య ఏదో అనబోతుంటే వరలక్ష్మి వారింపుగా చూసింది. ఆయన మౌనం వహించాడు.

ఆ ఇద్దరి మనసులలో ఒకే ప్రశ్న.

"భూమి అమ్మేసి మొత్తం డబ్బు అంతా నీరజకి ఇచ్చి ఆమె దగ్గర స్థిరపడాలనా

ఆవిడ ఆలోచన? డబ్బుకోసం తల్లిని పీడించే నీరజ డబ్బు హస్తగతం కాగానే తల్లిని చూస్తుందా?"

ఆ రాత్రి అన్నపూర్ణమ్మకి నిద్రపట్టలేదు. ఆవిడకి గతమంతా గుర్తువస్తోంది.

నీరజ డబ్బుకోసం పీడించడం... ఆమె ఖరీదైన కోరికలు తీర్చలేక తను అవస్థపడడం, పరంధామయ్య ఆదుకోడం... తను నీరజ అత్తవారింటికి వెళ్ళినప్పుడు తనపట్ల ఆమె ప్రవర్తన, ఇండస్ట్రీ ఓపెనింగ్ రోజున ఆమె భోజనం చేసేప్పుడయినా తను గుర్తురాకపోవడం అన్నీ గుర్తొస్తున్నాయి. అన్నింటికీ మించి ఆమె పొలం అమ్మెయ్యమని పట్టుబట్టడం గుర్తువస్తోంది. డబ్బు అంతా ఆమెకి ధారాదత్తంచేసి ఆమె ఇంట్లో తన శేషజీవితాన్ని గడపగలదా? అల్లుడు పరాయివాడే! కాని కూతురే పరాయిదానిలా ప్రవర్తిస్తుంటే! చెరకు ముక్కలో నుంచి రసం పిండినట్టు తననుంచి ఇంకా ఎంత డబ్బు పిండాలా అని ఆలోచిస్తున్నప్పుడు తను ఏ ధైర్యంతో డబ్బంతా ఆమెకి హస్తగతం చెయ్యగలదు?' ఆవిడ కళ్ళు చెమరుస్తున్నాయి.

గుండెలో కలుక్కుమన్న బాధ. తల్లి ప్రేమ కూతురి దగ్గరగా వుండమంటోంది. అలా వుండడం వలన ఎదురయ్యే పరిణామాలను తలచుకుని వణికిపోతోంది. ఆలోచనలతో తలబద్దలయిపోతోంది.

రాత్రంతా ఆలోచించిన ఆవిడ ఒక నిర్ణయానికి వచ్చింది.

★ ★ ★

రాజమండ్రి వచ్చిందన్న మాటేగాని, అరుంధతికి పల్లవే గుర్తు రాసాగింది. పెళ్ళికి ముందు ఎంతో హుషారుగా నవ్వుతూ తుళ్ళుతూ వుండే ఆమె ఇప్పుడు ఎంత గంభీరంగా మారిపోయింది? చేస్తున్న ప్రతి పనిలోను యాంత్రికత తప్ప అనురక్తి అనేది వ్యక్తమవడంలేదు. అయినా అరుణ్ అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? మంచి కుటుంబమని, బాగా చదువుకున్నవాడని, ముఖ్యంగా అతని అన్నగారి అత్తగారి పట్ల అతని ప్రవర్తనని బట్టి తమనూ అతను ఆదరిస్తాడనే నమ్మకంతో అతన్ని అల్లుడిగా చేసుకోవాలని భర్త తను వాంఛించారు. ప్రతి మనిషిలోను మరో మనిషి వుండడం సహజమే. కాని అరుణ్‌లోని ఆ మనిషి ఎంత కుసంస్కారి! ఆవిడ కూతురిని తలచుకుని ఏడుస్తూనే వుంది. ఆవిడ ఎక్కువ రోజులు అక్కడ వుండలేకపోయింది. నెలరోజులు పూర్తికాకుండానే మళ్ళీ మైసూర్‌కి ప్రయాణమయింది.

ఆవిడ వచ్చిన మరునాడు జరిగిందా సంఘటన.

రాత్రి పదిగంటలకి ఫోన్ మోగడంతో అరుణ్ ఫోన్ లిఫ్ట్ చేశాడు. ఆ సమయంలో పల్లవి అక్కడ లేదు. తల్లి గదిలో కూర్చుని ఆవిడతో కబుర్లు చెబుతోంది.

అరుణ్ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. అతను ఫోన్ మాట్లాడుతున్నాడని తెలియని పల్లవి గదిలోకి రాబోయింది. అటు తిరిగి మాట్లాడుతున్న అతను ఆమె రావడం గమనించలేదు. అవతల ప్రమీల ఏం అడిగిందో తెలియదు కానీ, అతను అంటున్నాడు.

"మా అత్తగారు వచ్చి నానెత్తిమీద కూర్చుందే! నా ఇంట్లో నాకే ప్రయివసీ లేదు''

పల్లవి ముఖం ఎర్రబడిపోతోంది.

అతను ప్రమీలతో మాట్లాడుతున్నాడని ఆమెకి అర్థమయింది. అతను ఆమెతో మాట్లాడుతున్న ప్రతి మాట ఆమెకి వినిపిస్తోంది.

"ఇదంతా నాన్న చేశారు''

"...........''

"మాటవరుసకి ఆయన మీ అమ్మాయి దగ్గర వుండండి అన్నారే అనుకో. ఆవిడ వచ్చి నా నెత్తిమీద కూర్చోడమేనా? అసలు సిగ్గులేదు''

పల్లవి మెల్లిగా వెనుదిరిగి వచ్చేసింది. ఆమె ఒళ్ళు ఆవేశంతో, అవమానంతో వణికి





పోతోంది.

"ఏమనుకుంటున్నారు వీళ్ళు? తన తల్లి తినడానికి తిండిలేక, ఇతని సంపాదనని ఆశించి ఈ ఇంటికి వచ్చిందనా? తన రైలు టికెట్టు తను కొనుక్కుంటూ, తన మందుల ఖర్చు తను పెట్టుకుంటున్న అభిమానవతి తన తల్లి! తమ ఇంట్లో పనిచేసే పనివాళ్ళకి ఎంత డబ్బు దానం చేసేది! చివరకి ఇలాంటి మాటలు పడుతోందా?"

మరో పది నిముషాల తరువాత అరుణ్ ఫోన్ పెట్టాక ఆమె గదిలోకి వెళ్ళింది.

"ఏం చెబుతున్నారు మీ చెల్లెలితో? మా అమ్మ మీ ఇంట్లో తేరగా పడి తింటోందా?" క్రోధంగా అడిగింది.

"అంటే! నేను మా చెల్లెలితో ఫోన్‌లో మాట్లాడినదంతా విన్నావా?" అరుణ్ నిటారుగా అయ్యాడు.

"అదృష్టవశాత్తూ విన్నాను''

"సిగ్గులేదూ? నా మీద పత్తేదారులా పని చేస్తున్నావుటే లం..."

"సిగ్గు మీకు వుందా? మన సంసార విషయాలని మీ చెల్లెలితో చర్చిస్తున్నారు?"

"...ఏమన్నావ్? నాకు సిగ్గులేదా? నీకు పొగరు బలిసిందే'' అరుణ్ చెయ్యెత్తి ఆమెని చెంపపై బలంగా కొట్టాడు. ఆమె తిరస్కారంగా అతన్ని ఒకసారి చూసి అవతలకి వెళ్ళిపోయింది. ఆమె కన్నీళ్ళు పెట్టుకుని వుంటే అతని అహం సంతృప్తి చెందేది. కానీ ఆమె చూపులలో తిరస్కారభావం అతన్ని రెచ్చగొట్టింది. ఆమెను వెన్నంటి వచ్చి నడుముకి వున్న బెల్ట్ తీసి ఆమెను ఎడాపెడా బాదాడు.

"అమ్మా!" బాధగా అరిచిందామె.

పడుకోబోతున్న అరుంధతి ఉలిక్కిపడి లేచి బయటికి వచ్చింది. అరుణ్ చేతిలోని బెల్ట్ మరోసారి ఆమె శరీరంపై నాట్యం చేసింది.

"బాబూ!" అరుంధతి గభాల్న ముందుకొచ్చింది. ఆమె స్వరం ఆక్రందనలా వుంది.

"పల్లవి ఏదైనా తప్పు చేస్తే కసితీరా తిట్టు. అంతేకానీ అలా గొడ్డుని బాదినట్టు బాదడం..."

ఆవిడ మాట పూర్తి కాకుండానే అతను తీవ్రస్వరంతో అన్నాడు.

"మీరు మా విషయంలో కలుగచేసుకోకండి. మీ గదిలో కూర్చుని కృష్ణా, రామా అనుకోండి'' అతని స్వరంలోని పదును సూటిగా ఆవిడ మనసుని తాకింది.

సోఫాని ఆనుకుని బాధని, దుఃఖాన్ని అతి ప్రయత్నంమీద దిగమింగుకుంటున్న పల్లవి వైపు బెల్ట్ విసిరి "నోర్మూసుకుని పడివుండు ముండా! నాకు ఎదురు చెప్పావంటే ఇదే గతి నీకు'' అని గధిలోకి వెళ్ళిపోయాడు. అరుంధతి కూతుర్ని కౌగలించుకుని బావురుమంది. పల్లవి తల్లిని పట్టుకుని ఓదారుస్తూ అంది.

"ఈ కాస్తదానికే ఏడుస్తావేమిటమ్మా? కోపంలో ఆయన రెండు దెబ్బలు కొట్టారు. అంతేగానీ?"

కూతురి మెడపైన, చేతులపైన తేలిన వాతలని చూస్తూ తల్లిప్రాణం తలడిల్లిపోయింది.

"అసలేం జరిగింది? మీరిద్దరూ గొడవపడ్డారా?"

పల్లవి జరిగినది చెప్పబోయి తమాయించుకుంది. నిజంచెప్పి ఆవిడ మనసుని ఎందుకు కష్టపెట్టడం?

"ఏం లేదమ్మా! నాపుట్టినరోజుకి వెయ్యి రూపాయలు పెట్టి చీర కొంటానని అతనన్నాడు. అంతచౌకలో కొంటే నేను కట్టుకోనని అయిదువేలు పెట్టి మంచిచీర కొనమన్నాను..."

"నువ్వు చీరలకోసం, నగలకోసం పేచీపెట్టే అమ్మాయివి కాదు. అతను నిన్ను కొట్టడానికి కారణం అదికాదు. నేను ఇక్కడ

వుండడం అతనికి ఇష్టంలేదు. ఆ విషయంలో మీకిద్దరికీ గొడవ జరిగింది. అవునా?''

"అబ్బే! అదేం కాదమ్మా'' తొట్రుపడింది.

"నా వయసులో సగం వయసు కూడా నీకులేదు. వయసులోనే కాదు అనుభవంలో కూడా నీకంటే నేను చాలా పెద్దదాన్ని. నన్ను మభ్యపెట్టాలని చూడకు'' అరుంధతి కన్నీళ్ళు దాచుకోవడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ గదిలోకి వెళ్ళిపోయింది.

పల్లవిని అరుణ్ కొట్టినప్పుడు కూడా కలుగని దుఃఖం ఇప్పుడు వచ్చింది.

"ఆడపిల్లకి, మగపిల్లవాడికి మధ్య ఎందుకంత వ్యత్యాసం? వృద్ధాప్యంలో కొడుకులు తమని చూడడం వాళ్ళ బాధ్యతగా, అది తమ అదృష్టంగా భావించే తల్లిదండ్రులు, ఆడపిల్లల దగ్గర వుండడానికి ఎందుకు మొహమాటపడతారు? కొడుకు దగ్గర ఉండే చనువు, అల్లుడి దగ్గర వుండదనా? అల్లుడిలాగే కోడలు కూడా పరాయి పిల్లేగా? అయినా చాలామంది తల్లిదండ్రులు కొడుకు దగ్గరే ఎందుకుంటారు? తమని పున్నామనరకం నుంచి తప్పిస్తాడనా? తన తల్లిదండ్రులని తన భార్య ఆదరించాలనుకునే మగవాళ్ళు, తన అత్తమామల విషయానికి వచ్చేప్పటికి అలసత్వాన్ని ఎందుకు చూపిస్తారు?"

ఆమెకి ఉమ, పార్వతమ్మగారు గుర్తుకొచ్చారు. పక్కమీదనుంచి లేవలేని జ్వరంలో కూడా కూతురింటికి వెళ్ళడానికి నిరాకరించిన ఆవిడ అభిమానం... అత్తగారిని కనీసం చూడ్డానికి కూడా రాని ఉమ భర్త గుర్తుకొచ్చారు. ఆమె మనసు వేదనతో నలిబిలి అవుతోంది.

★ ★ ★

అరుంధతి రాజమండ్రి వెళ్ళడానికి నిశ్చయించుకుంది. పల్లవి ఎన్నోరకాలుగా తల్లికి చెప్పి చూసింది, బతిమాలింది. అయినా, ఆవిడ వినలేదు.

"నేనింకా ఓపికగానే వున్నాను కదమ్మా! భగవంతుడి దయవలన డబ్బుకీ లోటులేదు. ఇద్దరు మనుషులని పెట్టుకుని వాళ్ళచేత చేయించుకుంటాను. నా ఇంట్లో నేను వుంటాను''

"ఒంటరిగా ఎలా వుంటావు?"

"ఒంటరితనానికేముంది? బోలెడు పుస్తకాలు చదువుకోవచ్చు. మీ నాన్నగారు నన్ను పుస్తకాల పురుగునని, అస్తమాటూ చదివితే కళ్ళు పాడవుతాయని తిట్టేవారు. గుర్తుందా? ఇప్పుడు ఆయన లేరుగా నన్ను తిట్టడానికి. చదువుకుంటాను''

"నీకెప్పుడైనా ఒంట్లో బాగాలేకపోతే?"

"అంతగా లేవలేని పరిస్థితి వస్తే నీ దగ్గరకే వస్తానులే'

ఆవిడ స్వరంలోని స్థిరనిశ్చయం ఆవిడ ప్రయాణాన్ని విరమించుకోదని స్పష్టం చేసింది.

అరుంధతి వెళ్ళిపోయింది. ట్రైన్ కదిలివెళ్తుంటే ఆవిడ దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. తన ప్రాణాన్ని పల్లవి దగ్గరే వదిలి శరీరం మాత్రం ప్రయాణం చేస్తోందనిపించిందావిడకి.

★ ★ ★

"వచ్చే శుక్రవారమే మన పెళ్ళిరోజు'' అన్నాడు భాస్కర్ తన గుండెలపై తలానించి పడుకున్న ఉమ ముంగురులు సవరిస్తూ.

"అవును'' అంది ఉమ అస్పష్టంగా. పెళ్ళిరోజు అనగానే ఆమెకి తల్లి గుర్తుకువచ్చింది. "తనపెళ్ళికోసం ఎంత తపించిపోయింది తల్లి! ఎంత కష్టపడి తన పెళ్ళిచేసింది! తన తాహతుకిమించి డబ్బు ఖర్చుచేసి అప్పులపాలయి చివరకి కడుపు కట్టుకుని ఆ అప్పులు తీరుస్తోంది'' ఆమె కళ్ళు నీటి చెలమలయ్యాయి.

"ఏం కావాలి నీకు?"

ఏం వద్దన్నట్టు తల అడ్డంగా వూపింది.





నోరువిప్పితే దుఃఖం ఉప్పెనలా విరుచుకు పడుతుందనే భయంతో.

"నువ్వలా అంటావని నాకు ముందరే తెలుసు. నీకు వెయ్యి రూపాయలలో మంచి చీర కొంటాను. రేపు సాయంకాలం బజారుకి వెళదాం. రెడీగా వుండు''

"నాకేమీ వద్దు'' ఉమస్వరం గాద్గది కంగా వుంది.

"నా పెళ్ళికోసం చేసిన అప్పులని మా అమ్మ అష్టకష్టాలు పడి తీరుస్తుంటే, ఇక్కడ నేను పట్టుచీర కట్టుకుని సంతోషంగా పెళ్ళి రోజు చేసుకోనా?" ఉద్వేగంగా అడగాలను కుంది. కానీ, ఏదో బలహీనత ఆమెని ఆవ రించింది.

"ఎందుకని?"

"నేను మీరు అడిగినదానికి జవాబిచ్చే ముందు మిమ్మల్ని ఒక ప్రశ్న అడగవచ్చా?"

"ఏమిటది?"

"మీరు మన పెళ్ళయ్యాక మా ఇంటికి ఒక్కసారైనా ఎందుకు రాలేదు?"

భాస్కర్ ఉమ అలా అడుగుతుందని ఊహించలేదేమో, నిరుత్తరుడై చూస్తున్నాడు.

"మీ వాళ్ళంతా నా వాళ్ళేననుకుని సంతో షంగా ఈ ఇంటి బాధ్యతను స్వీకరించానే... అలాంటిది మీరు మా అమ్మని కనీసం చూడ్డానికైనా రాకపోతే ఆవిడ ఎంత బాధప డుతుంది?"

"నేనేం చెయ్యను?" నిస్సహాయంగా గొ ణిగాడతను.

"ఆవిడ మీ సంపాదనని ఆశిస్తోందని మీరనుకుంటే అది కేవలం అపోహే!"

"ఆవిడ నా సంపాదన ఆశిస్తోందని నేను అన్నానా?"

"మరి మీరు మా అమ్మని చూడ్డానికి ఎందుకు రాలేదు?"

"ఎందుకంటే..." అతను తడబాటుగా ఆగిపోయాడు.

"కారణం... ఏమీలేదు''

"నాకు తెలుసు. మా అమ్మపై మీ అక్క య్యకి సదభిప్రాయం లేదు. చెప్పుడు మాట లతో మీ మనసులో ఏమూలో మా అమ్మపై సదభిప్రాయం ఉండిఉంటే దాన్ని సమూ లంగా నాశనం చేసేసింది. ఆవిడని పలుకరి స్తేనే ఎక్కడ వచ్చి మీ నెత్తిపై కూర్చుంటుందో అనే భయంతో ముఖం చాటేశారు. అంతేగా?" ఆవేశంతో వణికిపో తోందామె.

భాస్కర్ ఉమలో ఎన్నడూ చూడని ఆవేశా న్ని చూస్తున్నాడు. ఆమె చెప్పినదాంట్లో ఒక్కటీ అబద్ధంకాదు. అది అవాస్తవమని అతను ఖండించలేదు. సిగ్గు, పశ్చాత్తాపా లతో ముఖం దించుకుని అన్నాడు.

"నన్ను క్షమించు ఉమా! మీ అమ్మగారి పట్ల చాలా అనుచితంగా ప్రవర్తించాను''

ఉమలో ఆవేశంపోయి దుఃఖం వచ్చింది. అతనామె కళ్ళు తుడుస్తూ అన్నా డు. "మీ అమ్మగారికి నేనెలా సాయపడగల ను చెప్పు"

"మీరు ఆవిడపట్ల రవ్వంత ఆప్యాయతని చూపిస్తే చాలునండీ! ఆవిడ మీనుంచి ఇంకేమీ ఆశించదు''

"కాదు ఉమా! మీ తాహతు తెలిసే నిన్ను పెళ్ళిచేసుకున్నాను. నీ పెళ్ళి చేసి ఆవిడ అప్పులపాలయ్యారు. అర్థంలేని ఆచారాలు, సాంప్రదాయాలు మధ్యతరగతి మనుషుల జీవితాలతో క్రూరంగా ఆటలాడుకుంటు న్నాయి. ఎవరో డబ్బున్నవాళ్ళు తమ సరదా లని తీర్చుకోవడానికి వ్యర్థంగా డబ్బు ఖర్చు చేస్తే మధ్యతరగతి వాళ్ళుకూడా పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు అది ఆచారంగా భావించి అనుసరించవలసి వస్తోంది. మీ అమ్మగారు ఆ అప్పు తీరిస్తే తప్ప ఆవిడ కష్టాలు గట్టెక్కవు. కాబట్టి రేపే కొంత డబ్బు నీకు ఇస్తాను. తీసుకెళ్ళి మీ అమ్మగారికి ఇవ్వు''



"అమ్మ తీసుకోదు''

"నేను ఇచ్చానని చెప్పు. రేపు సాయంకాలం బ్యాంక్‌నుంచి మీ ఇంటికి వస్తాను. నేను వచ్చేదాకా అక్కడవుండు''

ఉమకి సంతోషంతో కన్నీళ్ళు వస్తున్నాయి.

"భాస్కర్ మంచివాడే! అతని మనసుని రుక్మిణి మాటలు విషపూరితం చేసేశాయి. అతనిలో కలిగిన పశ్చాత్తాపం ఆమె మనసులో అతనిపై ఏమూలనో వున్న ద్వేషభావాన్ని పోగొట్టింది.

★ ★ ★

**రుక్మిణి ఆరోజు** పొద్దుట తొమ్మిది గంటలకే వచ్చింది. తులసమ్మ ఆమెకోసమే ఆత్రంగా ఎదురుచూస్తోంది.

"ఏం చేస్తున్నావ్ అమ్మమ్మా?" అంటూ చిరునవ్వుతో ఆమెకెదురుగా కూర్చుంది.

"ఇలా నా దగ్గరగా రా'' రహస్యంగా పిలిచింది ఆవిడ.

తన దగ్గరగా కూర్చున్న ఆమె చెవిలో అతిమెల్లగా చెప్పిందావిడ.

"నీకెలా తెలుసు?" రుక్మిణి భ్రుకుటి ముడివడింది.

"రాత్రి నాకు నిద్రపట్టలేదు. అంతా విన్నాను. అది వాడిని సతాయిస్తోంది''

"చవటన్నర చవట! లాగి దాన్ని ఒక లెంపకాయ కొట్టక వూరుకున్నాడా?"

"ఏంచేస్తాడే! పగలంతా పనిచేసి వచ్చిన మగాడిని రాత్రి నిద్రపోనివ్వకుండా చెవిలో జోరీగలా సాధింపు మొదలుపెడితే?"

రుక్మిణి తల పంకించింది. "తను భయపడినంతా 'అయింది. భాస్కర్ అత్తగారి బాధ్యతలను స్వీకరించడానికి సిద్ధపడ్డాడు. ఆవిడని ఈ ఇంటికి రానివ్వకుండా అవమానపరిచింది! తమ్ముడు ఆవిడని తెచ్చి ఇంట్లో పెట్టుకోడానికి సిద్ధమయినప్పుడు అతని మనసు విరిచేసింది! కానీ ఇప్పుడు... డబ్బిచ్చి ఆవిడని ఆదుకోవాలని చూస్తున్నాడు. ఒకసారి అలవాటు చేస్తే ఇంక కొంపలు మునిగిపోతాయి'' ఆమె దీర్ఘంగా ఆలోచిస్తోంది.

ఉమ వంట ముగించి తులసమ్మతోబాటు రుక్మిణిని కూడా భోజనానికి పిలిచింది.

"నేను కాస్సేపాగి తింటానులే' అంది రుక్మిణి.

"టైమ్ పదకొండు గంటలయింది మీరు రండి అమ్మమ్మగారూ!

"ఏం నువ్వెక్కడికైనా వెళ్ళాలా?" రుక్మిణి 'అడిగింది.

"మా అమ్మని చూడ్డానికి వెళ్తాను''

"నువ్వెళ్ళు. నేనూ, మా అమ్మమ్మ కలిసి భోజనం చేస్తాంలే'

పెద్దవాళ్ళు తినకుండా తను తినడం ఇష్టంలేక ఉమ భోజనం చెయ్యలేదు.

చీర మార్చుకుని, బీరువా తెరిచింది.

భాస్కర్ బ్యాంకుకి వెళ్తూ చెప్పాడు. "బీరువాలో డబ్బు వుంది. అందులోనుంచి వెయ్యి రూపాయలు తీసుకో'

ఆమె బీరువాలో వెతికింది. డబ్బులేదు! ఆమె అతను ఇంకెక్కడైనా పెట్టాడేమోనని బీర్వా అంతా వెదికి చూసింది. డబ్బులేదు!

"ఇదేమిటి?" ఆమెకి తికమకగా వుంది. "బీరువాలో డబ్బు వుందని, దాంట్లోంచి వెయ్యి రూపాయలు తీసుకెళ్ళి తన తల్లికిమ్మని అతను చెప్పినమాట అబద్ధమా? లేక డబ్బు వేరేచోట పెట్టి బ్యాంకుకి వెళ్ళే హడావుడిలో మరిచిపోయాడా?"

ఆమె బీరువా మూసేసి చెప్పులు వేసుకుని వెళ్తున్నానని రుక్మిణితో చెప్పి బయలుదేరింది.

ఉమ అంతదూరం నడిచివస్తే ఇంటికి తాళంవేసి వుంది. తల్లి ఎక్కడికి వెళ్ళిందని ఆమె సుశీలమ్మని అడిగింది.

"అరుంధతిగారింటికి వెళ్తానంది'' చెప్పిందావిడ.





"అంటే వూరినుంచి వచ్చారా?" సంభ్రమంగా చూసింది ఉమ.

"సరేనత్తా! నేనూ అక్కడకే వెళ్తాను'' అని వెనుదిరిగింది.

★ ★ ★

"మీరు మైసూరు నుంచి వచ్చారని తెలిసిందమ్మా! చూద్దామని వచ్చాను'' అంది పార్వతమ్మ

"ఇంక ఇక్కడే వుంటాను పార్వతమ్మగారూ! మీరు రోజూ మా ఇంటికి రావచ్చు. అహ! నాకు సాయంగా ఇక్కడే వుండవచ్చు'' ఆవిడ నవ్వుతూనే అన్నా, ఆ నవ్వులోని వెలితిని పార్వతమ్మ కనిపెట్టకపోలేదు.

"అదేం? పల్లవి దగ్గరకి వెళ్ళరా?"

"వాళ్ళ అత్తవారింటికి వచ్చినప్పుడు అదే వస్తుంది''

"మీరు ఇక్కడ ఒంటరిగా..." ఎలా అడగాలో తెలియలేదు ఆవిడకి.

"జీవితమంతా ఒంటరిగా గడపవలసిన దాన్నేగా?" ఆమె ముఖంలో ఒక విషాద వీచిక కదలాడింది. "అక్కడ బాగానే వుంది కానీ, ఎందుకో నాకు వుండాలన్పించలేదు. అందుకే వచ్చేశాను. అయినా కూతురు మన అమ్మాయికానీ, అల్లుడు మనవాడెలా అవుతాడు?"

"అదేమిటమ్మా? మీ అల్లుడు మిమ్మల్ని తల్లిలా గౌరవిస్తాడని అందరూ చెప్పుకుంటూంటే విన్నాను''

"అలా అని భ్రమపడే పల్లవి అప్పుడే పెళ్ళి చేసుకోనని మొత్తుకున్నా వినకుండా దానిపెళ్ళి చేశాం. దానిగొంతు కోసాం" అంతవరకు ఉగ్గబట్టుకున్న కన్నీరు ఆవిడ చెంపలపైకి ఉరికింది.

"ఏమయిందమ్మా? మన పల్లవిని అతను సరిగ్గా చూడడా?" పార్వతమ్మ గాబరాగా అడిగింది.

అరుంధతి ఏడుస్తూ అల్లుడి గురించి చెప్పడం మొదలుపెట్టింది.

వింటున్న పార్వతమ్మకి దుఃఖం వచ్చింది.

"నేనంటే డబ్బులేని దాన్ని. అందుకే అల్లుడి దృష్టిలో పైసా విలువ చెయ్యలేకపోయాననుకున్నాను. ఇంత డబ్బుండి మీరు కూడా..."

"అతను నన్ను గౌరవించకపోయినా ఫర్వాలేదు. పల్లవినైనా ప్రేమగా చూసుకుంటే చాలనుకున్నాను. కానీ నా ఎదురుగానే దాన్ని దారుణంగా కొడుతుంటే సహించలేకపోయాను. నా కారణంగా వాళ్ళిద్దరూ గొడవ పడుతున్నారేమో అనే బాధ నన్ను అక్కడనుంచి తరిమికొట్టింది. పోనీ, వాళ్ళయినా సుఖంగా వుంటారని వచ్చేశాను. అయినా నాదే తప్పు. అతను మాటవరసకి అతని ఇంటికి రమ్మంటే నేను వాళ్ళింటికి వెళ్ళకూడదు. ఎవరెక్కడ వుండాలో అక్కడే వుండాలి. అప్పుడే గౌరవం."

గుమ్మంలో నిలబడివున్న ఉమని చూసి ఉలిక్కిపడింది అరుంధతి.

"నువ్వెప్పుడొచ్చావమ్మా ఉమా?"

"ఇప్పుడే ఆంటీ..." తడబడింది. కాని ఆమె ముఖం చూస్తే ఆమె చాలాసేపటి నుంచి అక్కడే నిలబడి వుందని తను పార్వతమ్మతో చెప్పినదంతా ఆమె కూడా విందని అర్థమయింది ఆవిడకి.

"రా, లోపలికి వచ్చి కూర్చో''

"ఆంటీ వూరినుంచి వచ్చారని నీకెలా తెలుసు'' పార్వతమ్మ అడిగింది.

"నేను నీకోసం వచ్చాను. నువ్విక్కడకి వచ్చావని సుశీలత్త చెప్పింది'' అంది ఉమ అరుంధతి దగ్గర కూర్చుంటూ.

ఉమకి పల్లవిని తలచుకుంటే మనసు దుఃఖసముద్రమే అవుతోంది.

ఎంత తెలివైనది పల్లవి? డబ్బు, అందం, చదువు అన్నీ వున్న ఆమె కూడా పురుషాహంకారానికి బలి కావలసిందేనా?

అరుంధతి, పార్వతమ్మలు కూడా పల్ల

విని తలచుకుని బాధపడుతూనే వున్నారు. ఆవిడ బాధలో పాలుపంచుకుంటున్న ఉమ సాయంకాలం అయిందని, భాస్కర్ తమ ఇంటికి వస్తానన్నాడనే విషయం మరచిపోయింది. బాగా చీకటిపడ్డాక గాభరాగా లేస్తూ అంది.

"ఇంక వెళ్తానాంటీ! ఇంటికి వెళ్ళి వంటచెయ్యాలి'' అంది లేస్తూ.

"నువ్వు ఇంటికి వెళ్ళమ్మా! నేను ఆంటీ దగ్గర కాస్సేపు కూర్చుని ఇంటికి వెళ్తాను'' అంది పార్వతమ్మ. "నిన్ను దింపనా?"

"అక్కర్లేదు. నేను వెళ్ళగలను''

★ ★ ★

ఉమ ఇల్లు చేరేసరికి ఏడుగంటలయింది. ముందు గదిలో కూర్చుని వున్న భాస్కర్‌ని చూసినప్పుడు కాని ఆమెకి అతను తమ ఇంటికి తల్లిని చూడ్డానికి వస్తానన్నాడనే విషయం గుర్తురాలేదామెకి.

"మీరు మా అమ్మని చూడ్డానికి వస్తారని చెప్పిన విషయం మరచిపోయానండీ! మా అమ్మ పల్లవి వాళ్ళమ్మగారి దగ్గరకి వెళ్ళిందని తెలిసి నేనూ అక్కడకే వెళ్ళాను అక్కడ ఆంటీతో కబుర్లలో పడి..."

భాస్కర్ ఆమెవైపు ఒకసారి చూసి తలత్రిప్పేసుకున్నాడు. ఆ చూపులకే శక్తివుంటే ఆమె నిలువునా భస్మమయిపోయివుండేది.

ఆ చూపులలో "నువ్విలా చేస్తావనుకోలేదు''
అనే బాధ కూడా వుంది. నమ్మిన వ్యక్తే వెన్నుపోటు పొడిచినప్పుడు కలిగే ఆవేదన వ్యక్తమవుతోంది.

ఉమకి అతనెందుకు అలా వున్నాడో అర్థంకాలేదు. చెప్పులు విప్పి కాళ్ళు కడుక్కుని వచ్చి వంట ప్రయత్నంలో పడింది.

భాస్కర్ వంటగది గుమ్మం దగ్గరకి వచ్చి పిలిచాడు. 'ఇలారా' ఎలాంటి సంబోధన లేకుండా తీవ్ర స్వరంతో అతను పిలిచిన ఆ పిలుపుకి ఆమె నిలువెల్లా వణికింది. అతనిలో ఆగ్రహాన్ని చూడడం అదే మొదటిసారి. ఆమె ముఖంలోని కంగారు, తత్తరపాటు అతనికి వేరే అర్థాలను చెప్పాయి.

ఆమె చేస్తున్నపని ఆపి అతని దగ్గరకి వచ్చింది.

"బీరువాలో అయిదు వేలు పెట్టాను. ఆ డబ్బు ఏం చేసావ్?"

"బీరువాలో అసలు డబ్బు కనబడలేదండీ!" అయోమయంగా చూస్తూ అంది.

"డబ్బు కనబడలేదా? లేకపోతే కనిపించిన డబ్బంతా పట్టికెళ్ళి మీ అమ్మకిచ్చేశావా?"

"ఏమిటి మీరంటున్నది?" తెల్లబోయిందామె.

"మీరు బ్యాంక్‌కి వెళ్ళాక మీరు మా అమ్మకి ఇమ్మన్న వెయ్యి రూపాయలు తీసుకుందామని బీరువా తెరిచినమాట నిజం. కాని, అందులో డబ్బులేదు."

"డబ్బు లేదా? అంటే నేను అబద్ధం చెబుతున్నాననా? మొన్న జీతం రాగానే మొత్తం డబ్బంతా బీరువాలో పెట్టాను."

"మీరు ఇంకెక్కడైనా పెట్టి మరచిపోయారేమో! బీరువాలో మాత్రం డబ్బు లేదు''

"ఎందుకు నన్నింకా నమ్మించాలని ప్రయత్నిస్తున్నావు? మంచి మనసుతో మీ అమ్మగారికి సహాయం చెయ్యాలనుకుంటే దాన్ని ఆసరాగా తీసుకుని నన్ను లోకువకట్టి మొత్తం డబ్బు అంతా ఆవిడకి ఇచ్చేసి'' భాస్కర్ స్వరంలో ఆవేశం కరిగిపోయి అసహాయత చోటుచేసుకుంది.

ఉమ దిమ్మెరపోయి చూస్తోంది. అతని నోటి వెంటవస్తున్న అభాండాలకి ఆమెకి ఏడుపు వస్తోంది.

"మీరు బాగా గుర్తుచేసుకోండి. డబ్బు ఇంకెక్కడైనా పెట్టి వుంటారు''

"నాకు మతిమరుపు రాలేదు ఉమా!"




అతను బీరువా తెరిచి బట్టలన్నీ లాగి పడేసాడు. డబ్బులేదు. ఉమ ఇల్లంతా వెదుకుతోంది. పరుపు కింద, అలమరలో అంతా వెదికింది. డబ్బు కనిపించలేదు.

"ఏమిట్రా వెదుకుతున్నారు?" తులసమ్మ అడిగింది.

"డబ్బు... అయిదువేలు బీరువాలో పెట్టానమ్మమ్మా! కనబడడంలేదు''

"ఇంటికెవరూ కొత్తవాళ్ళు కూడా రాలేదు. ఎలా పోయివుంటుందబ్బా'' ముసలావిడ ఆలోచనలో పడింది.

వున్నట్టుండి బుర్రలో ఏదో తళుక్కున మెరిసినట్టయి అంది.

"నీ పిచ్చిగానీ... పోయిన డబ్బు ఎలా దొరుకుతుందిరా అబ్బాయ్! ఇంటిదొంగని ఈశ్వరుడైనా పట్టలేడు అని సామెత చెప్పినట్టు..'' దీర్ఘం తీస్తూ అంది.

ఉమకి అవమానంతో ఏడుపొస్తోంది. "ఇంటిదొంగ! ఆఖరికి ఈవిడకి కూడా ఎంత లోకువయిపోయింది తను''

ఆమె భాస్కర్ దగ్గరకి వెళ్ళి అంది.

"ఆ డబ్బు నేను తియ్యలేదండీ! మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం! మీ బీరువా తెరవడం ఇవాళే మొదటిసారి, ఇవాళే చివరిసారి కూడా. నామాట మీరు నమ్మరని, మిమ్మల్ని నమ్మించలేనని కూడా తెలుసు'' ఏడుస్తూ వంట గదిలోకి వెళ్ళిపోయింది.

భాస్కర్‌కి తల తిరిగిపోతోంది. పొద్దుట కూడా ఆ డబ్బు బీరువాలో చూశాడు. మరి ఏమయిపోయినట్టు? ఉమ హృదయవిదారకంగా ఏడుస్తున్న ఏడుపు, ఆమె స్వరంలోని నిజాయతీ ఎక్కడో ఏదో పొరబాటు జరిగిందని చెబుతున్నాయి. కాని ఆమె తప్ప ఇంకెవరూ ఆ గదిలోకి రారు. అమ్మమ్మకి ఆ అవసరంలేదు. ఉమే తల్లికి ఆ డబ్బు ఇచ్చేసి వుంటుంది. అతని మనసు ఉమ ఆ డబ్బు తీసి తనని బుకాయిస్తోందనే అపోహవైపే మొగ్గసాగింది.

★ ★ ★

మూడురోజులనుంచి ఉమ ఏడుస్తూనే వుంది. భాస్కర్ ఆమెతో మాట్లాడడంలేదు. ఈ మూడురోజులనుంచి ఆమె భోజనం చెయ్యడంలేదు. భాస్కర్‌కి ఆ విషయం తెలిసినా పట్టించుకోవడంలేదు.

ఆరోజు ఆదివారం. భాస్కర్ భోజనం చేసి బద్ధకంగా మంచంమీద వాలాడు.

రుక్మిణి రిక్షా దిగివచ్చి తులసమ్మ దగ్గర కూర్చుంది.

"భాస్కర్ లేడా''

"పడుకున్నాడు''

"అదేది?" 'అది' అంటే ఆమె దృష్టిలో ఉమ.

"దొడ్లో బట్టలు ఉతుక్కుంటోంది''

"ఏమయింది? డబ్బు పోయిన విషయం భాస్కర్‌కి తెలుసా?"

"తెలుసు. పెళ్ళాంమీద రంకెలు వేసాడు. అది ఆ డబ్బు తను తియ్యలేదని ఏడ్చింది. వాడు నమ్మినట్టులేదు. ఆరోజునుంచి అది ముద్దమింగడంలేదు''

"ఏం, చావదులే' ఈసడింపుగా అంది రుక్మిణి. "చూసావా? ఆ రాత్రి నువ్వు వాళ్ళ సంభాషణ వినడం మంచిదయింది. లేకపోతే వాడు అత్తగారికి డబ్బు ఇవ్వడం మొదలుపెడితే ఈ సంసారం గుల్ల అవుతుంది. ఆ డబ్బు నేనే తీసానని వాడికి ఎప్పటికీ తెలియదు. పెళ్ళాంమీద అనుమానం, అసహ్యం ఏర్పడ్డాయి కదా! ఇంక ఈ జన్మలో దాన్ని నమ్మడు'' గర్వంగా చెబుతూ నవ్వుతున్న రుక్మిణి ముఖంలో హఠాత్తుగా నవ్వు ఎగిరిపోగా, అప్రయత్నంగానే లేచి నిలబడింది.

"ఏం చెబుతున్నావ్ అమ్మమ్మతో?" ఎప్పుడు వచ్చాడో తెలియదు కాని భాస్కర్ నిలబడిన తీరు చూస్తే అతను అక్కడకి వచ్చి చాలా సేపయిందనిపిస్తోంది. అతని

ముఖం చూస్తే అమ్మమ్మతో తను చెప్పిన దంతా విన్నాడని అర్థమయింది రుక్మిణికి.

అయినా అతన్ని బుకాయిస్తూ అంది. "ఏంలేదురా! మీ బావగారూ ఎవరో ఫ్రెండ్‌కి అప్పు ఇచ్చి ఆ విషయం తెలిస్తే నేను తిడతానని పర్సు పోయిందని నాతో అబద్ధం"

"నోర్మూయ్'' మధ్యలోనే అడ్డుపడి అరిచాడు.

"అమ్మమ్మతో చెప్పినది నేను వినలేదనుకున్నావా? నేను బీరువాలో పెట్టిన డబ్బు నువ్వు తీసేసి ఆ నింద ఉమపై పడేలా చేశావు. అసలు నిన్ను ఏంచేసినా పాపంలేదు. నాకంటే పెద్దదానివి కాబట్టి బతికిపోయావు! నీ స్థానంలో మరొకరు వుంటే నువ్వు చేసిన ఈ పాపానికి ఇక్కడే గొంతు పిసికి చంపి వుండేవాడిని''

"ఎందుకురా! పెద్దదాన్ని! అంతంత మాటలంటావు! అదేం తప్పు చేసింది? నీ మేలు కోరే చేసింది. నీ డబ్బు పరాయివాళ్ళు తింటూంటే నువ్వు చెడిపోతావనే బాధతో..." తులసమ్మ రుక్మిణి చేసిన పనిని సమర్థించబోయింది.

"అమ్మమ్మా!" తీవ్రంగా పిలిచాడతను. "ఈ నాటకంలో నీకూ భాగస్వామ్యం వుందని నాకు తెలుసు. నీ కొడుకులు నీకు తిండిపెట్టకుండా ముఖం చాటేస్తే ఆదరించి ఇంట్లో పెట్టుకున్నందుకు నాకు, మంచి మనసుతో నీకు అడ్డమైన చాకిరీ చేస్తున్నందుకు ఉమకి మంచి శాస్తే చేశావు. ఇంతచేసినా, నిన్ను నా ఇంట్లోంచి పంపెయ్యదలచుకోలేదు. కారణం నీమీద అభిమానంతో కాదు. నీ వయసుపట్ల గౌరవం! నీపై జాలితో'

రుక్మిణి ముఖం ఎర్రబడిపోయింది.

"మాకేం కావాలిరా! నీ సంపాదన అంతా నీ అత్తగారికే దోచిపెట్టి నువ్వు నెత్తిన గుడ్డవేసుకుని పోతానంటే మాకేం? నీ సంపాదన నీ ఇష్టం! అమ్మ బతికివుంటే ఇలా ప్రవర్తించగలిగే వాడివా?"

"నీకు మన అమ్మ అంటే చాలా గౌరవం కదూ? ఏం? మన అమ్మలాంటిది కదా ఉమ తల్లి? నీ భర్త తల్లిని గౌరవించలేని నువ్వు నీ తల్లినీ గౌరవించలేవు. అందుకేగా నీ అత్తగారిని వృద్ధాశ్రమంలో చేర్పించి చేతులు దులుపుకున్నావు! నీకూ ఇద్దరు ఆడపిల్లలు వున్నారుగా! నీ అల్లుళ్ళు కూడా నీలాగే ప్రవర్తించినప్పుడు కాని ఆ బాధ ఏమిటో నీకు తెలిసిరాదు. అసలు నీమాట వినడం నాది బుద్ధితక్కువ. నీమాట విని మానవత్వాన్ని చంపుకున్నాను. మా అత్తగారిపట్ల రాక్షసంగా ప్రవర్తించాను! ఛీ! నువ్వు నా అక్కవని చెప్పుకోడానికే సిగ్గేస్తోంది'' భాస్కర్ ఛీత్కరించి వెనుదిరిగాడు.

అక్కడ గుమ్మంలో ఉమ నిలబడివుంది. ఆమె ముఖంచూస్తే ఆమె జరిగినదంతా విందని అర్థమయింది.

"నన్ను క్షమించు ఉమా'' అని అతను అనలేదు కాని అతని కన్నీళ్ళు ఆమెకి చెప్పాయి.



వల్లవికి తను నెలతప్పానేమో అనే అనుమానం కలిగింది. డాక్టరు దగ్గరకి వెళ్ళివద్దా

మనుకుంది. కాని ఆ విషయం అతనితో చెప్తే అతనే డాక్టరు దగ్గరకి తీసుకెళ్తాడని, చెప్ప కుండా వెళ్తేమళ్ళీ అదో గొడవ అని ఆ రాత్రి చెప్పింది. మరునాటి సాయంకాలం అతను ఆమెని డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళాడు.

డాక్టరు తను గర్భవతి అని కన్ఫర్మ్ చేశాక, పల్లవికి పట్టరాని సంతోషం కలి గింది.

"తను తల్లికాబోతోంది. మరికొన్ని నెల లలో తనకి పాపో, బాబో పుట్టబోతున్నారు. పుట్టేది ఆడపిల్ల అవనీ, అబ్బాయి అవనీ చక్కని క్రమశిక్షణతో పెంచుతుంది'' ఆమె ఊహలలో తేలిపోతూ అరుణ్ని అడిగింది.

"మీకు సంతోషంగా లేదూ?"

"ఎందుకు? అదేమన్నా పెద్ద ఘనకార్య మా? పశువులకి, పక్షులకి కూడా పిల్లలు పుడతాయి'' అన్నాడు ముఖం చిట్లిస్తూ. పల్లవి అతనివైపు ఆశ్చర్యంగా చూసింది. తను తండ్రి కాబోతున్నాడనే సంతోషం అత నిలో లేశమాత్రమైనా కనిపించలేదు. ఇలాంటి సన్నివేశాలలో మగవాళ్ళు భార్యని చేతులమధ్య ఎత్తి గిరగిర తిప్పుతారని కథ లలో చదివింది, సినిమాలలో చూసింది. కాని అరుణ్లోని నిర్లిప్తత ఆమెని భయపెట్టింది.

తన సంతోషాన్ని ఎవరితోనైనా పంచుకో వాలనుకుంది. ఆమెకి తల్లి గుర్తువచ్చింది. అనుకున్నదే తడవు తల్లికి ఫోన్ చేసింది.

"అమ్మా!" పల్లవి స్వరం విన్న అరుంధతి ఆదుర్దాగా అడిగింది. "ఎలా వున్నావమ్మా?"

"కొంచెం ఒంట్లో బాగా లేదమ్మా''

"ఏమయిందమ్మా?" కంగారుపడిపో యిందావిడ.

"అదే... డాక్టర్ రెండవనెల అని చెప్పా రు''

"నిజమా, పల్లవీ'' అరుంధతికి సంతో షంతో కన్నీళ్ళు వచ్చేస్తున్నాయి. జాగ్రత్తగా వుండమ్మా! ఎక్కువ పనిచెయ్యకు. పోనీ, ఉద్యోగం మానెయ్యకూడదూ? అనవస రంగా ఇంట, బయట పనితో నలిగిపోతావు!"

"నేను బాగానే వున్నానమ్మా! ప్రస్తుతం ఫర్వాలేదు. అంతగా చెయ్యలేకపోతే అప్పు డే మానేస్తాను''

"అన్నీ సహిస్తున్నాయా? పోనీ నేను అక్కడకి రానా? నీకిష్టమైనవన్నీ వండిపెడ తాను''

"వాంతులవడంలేదమ్మా! కాని..." ఎవరో చేతుల్లోనుంచి ఫోన్ లాగేసుకోవ డంతో ఉలిక్కిపడి సోఫాలోనుంచి లేచిన పల్లవి ఎదురుగా తననే తీవ్రంగా చూస్తున్న అరుణ్ని చూసి నిటారుగా అయింది.

"కడుపొచ్చిందని మరీ సంతోషం ఎక్కు వయినట్టుందే! మీ అమ్మకి ఫోన్చేసి మరీ చెబుతున్నావ్! మరీ అంతగా ఆనందించె య్యకు. నీ కడుపులో మగపిల్లవాడు వున్నా డని నిర్ధారణ అయితేనే నీకు ఆ బిడ్డ దక్కుతుంది. ఆడపిల్ల అని తెలిస్తే అబార్షన్ తప్పదు'' కరుగ్గా వున్న అతని స్వరం విని కాదు ఆమె కంపించిపోయినది.

ఆడపిల్ల అయితే అబార్షన్ చేయించుకో మని చెబుతున్న అతని స్వరంలోని శాసనా నికి!

ఆమె చేతులలోనుంచి ఫోన్ లాక్కొని పెట్టేసిన అతను ఆమె మనసులోని సంతో షాన్ని కూడా క్రూరంగా లాక్కున్నాడు.

పల్లవి కళ్లలో నీళ్ళూరుతుండగా అలాగే కూర్చుండిపోయింది.

ఫోన్ మోగింది. వెంటనే అరుణ్ ఫోన్ లిఫ్ట్ చేశాడు.

"నేను బాగానే వున్నాను''

"... ... ..."

"పల్లవి నిద్రపోతోంది''

"... ... ..."

"లేపనాండి. తనకి రెస్టు అవసరమని మీకూ తెలుసుగా!"

"... ... ..."

"సరే' అతను ఫోన్ పెట్టేశాడు.

ఆ ఫోన్ కాల్ తల్లినుంచే అని ఆమెకి తెలుసు. తను ఆవిడతో మాట్లాడుతుండగా, అరుణ్ ఫోన్ పెట్టేసిన విషయం ఆవిడకి తెలియదు. బహుశా ఫోన్ కట్ అయి వుంటుందని అనుకుని ఆవిడ చేసివుంటుంది.

పల్లవికి అరుణ్ ప్రవర్తనపై కోపం, అసహ్యంలాంటి భావాలెన్నో కలుగుతున్నాయి. ఏమీ చెయ్యలేని నిస్సహాయతతో దుఃఖం వచ్చింది.

★ ★ ★

రెండు నెలలు గడిచినా తల్లినుంచి ఉత్తరం రాకపోయేసరికి నీరజ అసహనంతో రగిలిపోసాగింది.

"మీ అమ్మగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా?" అని అమరేశ్వరి రెండు రోజుల కొకసారైనా అడుగుతోంది. గౌతమ్ జాతక ప్రభావమో ఏమోగానీ ఫ్యాక్టరీ నష్టాలలో నడుస్తోంది. బ్యాంకు లోన్ కాకుండా బయట చేసిన అప్పులు ఎలా తీర్చాలా అని సతమతమవుతున్నాడు. తల్లి భూమి అమ్మేసినా పన్నెండు లక్షలకి మించి డబ్బు రాదు. తమకి వున్న అప్పులు తీర్చడానికి ఆ డబ్బు సముద్రంలో కాకి రెట్టలాంటిదని నీరజకి తెలుసు.

వ్యాపారంలో నష్టం రావడం, అప్పుల వాళ్ళ నుంచి వత్తిడితో గౌతమ్ అస్థిమితంగా నలిగిపోసాగాడు. తన దురదృష్టానికి కారకురాలు నీరజే అనే భావం అతని మనసులో బలంగా నాటుకుంది.

నీరజ ఎడల అకారణ ద్వేషంతో వున్న అతనికి ఆమె తల్లినడిగి డబ్బు తీసుకురాకపోవడం మరింత ఆగ్రహాన్ని కలుగచేసింది.

అత్తగారి మెత్తని సాధింపులు, భర్త అకారణ ఆగ్రహం మధ్య నలిగిపోతున్న నీరజ తల్లి దగ్గరకి వెళ్ళి కొన్ని రోజులు ఆవిడ దగ్గర వుండి అయినా పొలం అమ్మించెయ్యాలనే నిర్ణయానికి వచ్చింది. ఆరోజు తల్లి దగ్గరకి వెళ్దామని బయలుదేరుతుండగా పోస్ట్‌మాన్ ఆమెకో ఉత్తరాన్ని తెచ్చి ఇచ్చాడు. ఆ ఉత్తరం తన తల్లి రాసినదని తెలియగానే ఆమె ఉద్విగ్నంగా కవరు ఓపెన్ చేసింది.

"చి।। సౌ।। నీరజకి,

అమ్మ ఆశీర్వదించి రాయునది. నువ్వు కిందటిసారి మనవూరికి వచ్చినప్పుడు పొలం అమ్మెయ్యమని, ఆ డబ్బు నీకిచ్చి నన్ను మీ దగ్గర వుండమని చెప్పావు. మీ అత్తగారు కూడా నన్ను తమతో వుండమన్నారని చెప్పావు. ఆవిడకి నాయందుగల ప్రేమాభిమానములకి, ఆవిడకి నా కృతజ్ఞతలందచేయి.

పొలం మొత్తం అమ్మేసాను. నేను అనుకున్నదానికంటే ఎక్కువ డబ్బే వచ్చింది. ఆ డబ్బంతా నీకిచ్చి నీ ఇంట్లో నా శేషజీవితాన్ని గడపవచ్చు. కాని నిశ్చింతగా మాత్రం కాదు. ఈ వయసులో నాకు కావలిసినవి వేళకి ఇంత తిండి, విశ్రాంతి మాత్రమే కాదు. నా అనే వాళ్ళ ఆదరణ. అది నాకు నీ ఇంట్లో కొరవడుతుందని ఖచ్చితంగా తెలుసు. గతంలో నీ ప్రవర్తనే అందుకు సాక్ష్యం.

మీ నాన్నగారు నీ చిన్నతనంలోనే చనిపోతే తల్లీతండ్రి నేనే అయి నిన్ను పెంచాను. ఒక తల్లిగా నీ భవిష్యత్తు బాగుండాలనే ఆశించాను. నువ్వు ఎప్పుడు ఏంఅడిగినా కాదనలేదు. కాని, బహుశా నా పెంపకంలో ఏదో లోపం వుండివుంటుంది. అందుకే నేను నిన్ను ప్రేమించినంతగా నువ్వు నన్ను ప్రేమించలేకపోతున్నావు. నీ ఇంట్లో నా శేషజీవితం నిశ్చింతగా గడచిపోతుందనే నమ్మకం నాకు లేదు. అందుకే నా గమ్యాన్ని నేనే నిర్ణయించుకున్నాను. ఈ లోకంలో పిల్లలచే అలక్ష్యం చెయ్యబడిన వృద్ధులెందరో వున్నారు. వాళ్ళకి బాసటగా నిలవాలన్నది నా నిర్ణయం.

నీకు పుట్టింటి ఆస్తిగా రెండు లక్షల రూపాయలను పంపుతున్నాను. ఇది నేను





నీకు ఇచ్చే ఆఖరి కానుక. నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ వుంటాయి.

అమ్మ''

ఆ ఉత్తరాన్ని చదివిన నీరజకి కాళ్ళ కింద భూమి కంపించింది. పదేపదే ఆ ఉత్తరాన్ని, దానితోబాటు జతపరిచివున్న తల్లి పంపిన డి.డి.ని కళ్ళప్పగించి చూస్తోంది.

తల్లి వ్రాసిన ఆ ఉత్తరం ఆమెకి అర్థమయ్యేసరికి పదినిముషాలు పైగానే పట్టింది. "మొత్తం డబ్బంతా తనకి పట్టుకొచ్చి ఇస్తుందనుకున్న తల్లి ఆ డబ్బు వృద్ధులని ఆదుకోడానికి వినియోగించబోతూందా? ఇది ఆవిడకి పుట్టిన బుద్ధికాదు. ఆ పరంధామయ్య ఉసిగొల్పివుంటాడు!" అసహాయంగా పళ్ళు కొరుక్కుంది.

"ఏమిటా ఉత్తరం? మీ అమ్మ వ్రాసిందా?" అమరేశ్వరి అడగడంతో తుళ్ళిపడిన నీరజ ఉత్తరాన్ని మడిచిపట్టుకుని డి.డి. ఆమెకి అందిస్తూ చెప్పింది.

"మా అమ్మకి డబ్బు పూర్తిగా అందలేదుట. ప్రస్తుతానికి రెండు లక్షలు పంపింది. మిగతా డబ్బు రెండు రోజులలో అందుతుందిట. నన్ను రమ్మంది. ఇచ్చేస్తుందిట" అంది.

"అయితే వెంటనే బయలుదేరు'' అందావిడ ఇంకా ఆలస్యం దేనికన్నట్టు.

నీరజ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ఆ ఉత్తరాన్ని కాల్చేసింది. అప్పుడు కాని ఆమె మనసు కుదుట పడలేదు. గౌతమ్‌కి ఫోన్‌చేసి చెప్పింది.

"మా అమ్మ నన్ను రమ్మని, డబ్బు ఇస్తానని వ్రాసింది. నాకు కారు, డ్రైవర్‌ని ఇస్తే వెంటనే బయలుదేరుతాను''

"కారెందుకు అదొక దండగ. ట్రెయిన్‌లో వెళ్ళు'' అన్నాడతను. ఆ స్వరంలో ధ్వనించిన నిర్లక్ష్యానికి ఆమె మనసు గాయపడింది.

"అవును. కారు ఎందుకు? అదొక దండగ. అసలు తనని పెళ్ళి చేసుకోవడమే పెద్ద దండగ అతని దృష్టిలో'

ఆమె చిన్న బ్యాగ్‌లో బట్టలు సర్దుకుని బయలుదేరింది.

ఆమె బస్సు దిగి ఇంటికి వెళ్ళేసరికి ఇంటి తలుపులు తాళం వేసివున్నాయి. ఆమెకి ఆశ్చర్యం, కంగారు రెండూ కలిగాయి. ఎక్కడికి వెళ్ళి వుంటుంది తల్లి?

ఆమె అయిష్టంగానే పరంధామయ్యగారి ఇంటివైపు నడిచింది. వీధి అరుగుమీద స్తంభానికి ఆనుకుని కూర్చుని వున్న వరలక్ష్మి, వాలుకుర్చీలో కూర్చుని వున్న పరంధామయ్యల ముఖాలు విచారంగా వున్నాయి.

"మామయ్యా'' ఆమె పిలిచింది. ఆయన అభావంగా ఆమెవైపు చూశాడు.

"మా అమ్మ ఎక్కడికి వెళ్లింది?"

"కాకినాడలో వుంది''

"కాకినాడలోనా? అక్కడ ఎవరున్నారు?"

ఆయన మౌనంగా ఆమెవైపు చూస్తున్నాడు. ఆ మౌనం ఆమెలో అసహనాన్ని పెంచింది.

"ఎడ్రస్ తెలుసా?"

"తెలుసు'' ఆయన లోపలికి వెళ్ళి కాగితం తెచ్చి ఇచ్చాడు.

"మీ అమ్మ నిర్వహిస్తున్న వృద్ధ శరణాలయానికి విరాళంగా ఏదైనా ఇవ్వడానికి వెళ్తున్నావా నీరజా!"

నీరజ ఆగ్రహంగా, తీవ్రంగా ఆయనవైపు చూసింది. "మీకెందుకండీ?" అంది వరలక్ష్మి. మీరలా మాట్లాడకూడదనే భావం వ్యక్తమయ్యేలా.

"దయవుంచి నువ్వక్కడికి వెళ్ళద్దు నీరజా! ఆవిడని అక్కడైనా మనశ్శాంతిగా వుండనీయమ్మా!" పరంధామయ్య స్వరం రుద్ధమయింది.

"మా అమ్మని నేను చూడ్డానికి వెళ్తానంటే మధ్యన మీరెవరండీ నన్ను వెళ్ళవ

ద్దని ఆపడానికి? అసలు మా అమ్మని అనాలి. ఎవరినెక్కడ వుంచాలో అక్కడుంచ కుండా అడ్డమైన వాళ్ళని నెత్తి నెక్కించు కుంది'' నీరజ విసురుగా వెనుదిరిగింది.

ఆమె మాటలలో 'అడ్డమైనవాళ్ళు' అనే పదం ఆయన గుండెలలో దిగబడింది. ఆయన వేదనగా భార్యవైపు చూశాడు.

"నీరజ విషయం తెలిసివుండీ, మీరు అలా మాట్లాడకుండా వుండవలసింది'' అంది వరలక్ష్మి.

"నిజమే! నాదే తప్పు" అన్నాడాయన. "అన్నపూర్ణ మంచి నిర్ణయం తీసుకుంది. మొత్తం డబ్బు అంతా కూతురి హస్తగతం చేసి ఆమె ముందు చెయ్యి జాపే పరిస్థితి రాకుండా'' అన్నాడు.

"కాని, కన్నకూతురు వుండీ... ఎవరూ లేనట్టుగా..." వరలక్ష్మి స్వరం రుద్ధమయింది. "ఎన్ని కష్టాలు పడింది. కూతురిపై ఎన్ని ఆశలు పెంచుకుంది? చివరకి ఇలా... ఆవిడకి ఒక మగపిల్లవాడు వుండినా ఈ పరిస్థితి వచ్చేది కాదేమో!"

"పిచ్చిదానివి! మగపిల్లలుంటే మాత్రం! ఈ సమస్య రాదంటావా? స్వార్థానికి ఆడ, మగ తేడా లేదు. పిల్లలని గుండెలపై వేసుకుని పెంచుతాము. ఆ పిల్లలే గుండెలపై తన్నినప్పుడు కలిగే బాధ ఇది.

డబ్బున్నవాడయినా, లేనివాడయినా దీనికి అతీతుడు కాదు''

వరలక్ష్మి మౌనంగా తడికళ్ళతో చూస్తోంది. "పిల్లలు వృద్ధాప్యంలో తమని ఆదరిస్తారనే ప్రతిఫలాన్ని ఆశించడంవలనే ఈ సమస్యలు ఉత్పన్నం అవుతున్నాయా?"

★ ★ ★

స్కానింగ్‌లో తన గర్భంలో వున్నది ఆడపిల్ల అని తెలియగానే పల్లవి కళ్లలో నీళ్ళూరాయి.

"నువ్విక్కడే కూర్చో! నేను ఇప్పుడే వస్తాను. అని అరుణ్ డాక్టర్ గదిలోకి నడిచాడు. అతను డాక్టరుతో మాట్లాడబోయేది ఏమిటో ఆమెకి తెలుసు. ఆమె అది హాస్పిటల్ అని అక్కడ కూర్చున్నవాళ్ళంతా తననే చూస్తున్నారనే స్పృహ లేకుండా ఏడుస్తోంది.

పావుగంట తరువాత ఇవతలికి వచ్చిన అరుణ్ ఆమెని క్రోధంగా చూస్తూ కరుగ్గా అన్నాడు.

"ఇంటికి వెళ్ళాక తీరుబడిగా ఏడుద్దుగాని నడు''

పల్లవి యాంత్రికంగా అతన్ని అనుసరించింది. ఎంత కంట్రోల్ చేసుకుందామన్నా ఆమెకి దుఃఖం ఆగడం లేదు.

ఇంటికి వచ్చాక అతను చెప్పాడు.

"డాక్టరుతో మాట్లాడాను. వచ్చే శుక్రవారం అబార్షన్ చేస్తానంది. ఏంలేదు. చాలా సింపుల్. ఒకపూట హాస్పిటల్‌లో వుంటే చాలన్నారు''

"నా కడుపులో వున్నది ఆడపిల్ల అని తెలిసి అబార్షన్ చేయించుకోమంటున్నారు. మరోసారి నాకు గర్భం వచ్చినా అప్పుడూ ఆడపిల్లే వుంటే?"

"ఆడపిల్ల అని తెలిస్తే ఎన్నిసార్లయినా అబార్షన్ తప్పదు''

"ఆడపిల్ల అంటే మీకు ఎందుకంత అయిష్టత? మిమ్మల్ని కన్న మీ అమ్మగారూ ఆడదే! మీ అక్క చెల్లెళ్ళూ ఆడవాళ్ళే! మీరు పెళ్లి చేసుకున్న నేనూ ఆడదాన్నే! మీలాగే మీ నాన్నగారు కూడా ఆడపిల్ల వద్దనుకుంటే మీరు ఇంతగా అభిమానిస్తున్న మీ అక్కచెల్లెళ్లు మీకు వుండేవారా?"

"మా అక్కచెల్లెళ్లకి ఎవరూ సాటిరారు''

"ఏం? వాళ్ళేమైనా దేవలోకంనుంచి ఊడిపడ్డారా?" వ్యంగ్యంగా అడిగింది.

పల్లవి చెంప ఛెళ్ళుమంది. "నోర్మూసుకుని పడివుండవే ముండా! ఈ ఇంట్లో నువ్వు అన్నం తినడానికి తప్ప నోరు తెరవడానికి వీలులేదు'' అతను పళ్ళు కొరుకుతూ ఆమెని





ఎడా పెడా బాది వెళ్ళిపోయాడు.

శరీరానికి తగిలిన దెబ్బలకంటే మనసుకి తగిలిన దెబ్బ ఆమెకి దుఃఖాన్ని తెప్పిస్తోంది.

"ఆ స్వరంలో ఎంత అహం! సుఖాన్ని ఇద్దరూ సమానంగా పంచుకున్నారు. ఆ సుఖానికి ప్రతిఫలంగా తన కడుపులో ఊపిరి పోసుకుంటున్న చిన్నారిని మాంసపు ముద్దగా వుండగానే రూపుమాపమంటున్నాడు.

ఆమె కడుపులో చిన్న కదలిక.

"అమ్మా! నన్ను చంపుకుంటావుటే?" అని ఆ చిన్న ప్రాణి దీనంగా తనని ప్రశ్నిస్తున్నట్టనిపిస్తోంది.

పల్లవి గుండెలు బద్దలయ్యేలా రోదించడం మొదలుపెట్టింది.



"గుడ్‌మార్నింగ్ డాక్టర్! రేపు ఎన్నిగంటలకి రమ్మంటారు?"

"............"

"ఓ.కె. మార్నింగ్ సెవెన్‌కి వస్తాం!"

"ఓ.కె! థ్యాంక్‌యూ!" అరుణ్ ఫోన్ పెట్టేసి పల్లవివైపు తిరుగుతూ శాసిస్తున్నట్టు అన్నాడు.

"డాక్టరు రేపు పొద్దుట ఏడు గంటలకి రమ్మన్నారు. రెడీగా వుండు'' శాసిస్తున్నట్టుగా వున్న అతని స్వరం విన్న పల్లవి కళ్లలో నీళ్ళూరాయి.

ఆమె డైనింగ్ టేబిల్ దగ్గర అచేతనంగా కూర్చుండిపోయింది.

గదిలో అరుణ్ విజిల్ వేస్తున్న ధ్వని. మరికొన్ని నిముషాల తరువాత అతను గది బయటకి వచ్చాడు.

"బ్రేక్ ఫాస్ట్ రెడీనా?"

"చెయ్యలేదు''

"ఏం, పొద్దుటనుంచి ఏం చేస్తున్నావ్?"

"నాకు ఓపిక లేదు''

"ఆఫీసుకి సెలవు పెట్టి తీరికగా ఏడవడానికి ఓపిక వస్తుందేం?" వ్యంగ్యంగా అన్నాడు.

పల్లవి ఆ వ్యంగ్యాన్ని మౌనంగా భరిస్తోంది.

"వెధవ ఏడుపు మొహం నువ్వూ'' అతను కారు తాళాలు అందుకుని విసవిస వెళ్ళిపోయాడు.

పల్లవి నిశ్శబ్దంగా వున్న ఆ ఇంట్లో అలాగే కూర్చుంది. ఆమెకి గతమంతా గుర్తుకొస్తోంది. అరుణ్ ప్రవర్తనని తలచుకున్నకొద్దీ ఈ మనిషితో ఇన్నాళ్ళు ఎలా కాపురం చెయ్యగలిగిందా అని తనమీద తనకే జాలి వేస్తోంది.

"అతనికి తనపై ఎంత చులకన? అసలతనికి భార్య అనే పదానికి అర్థం తెలుసా? అతని ఇంటికి చాకిరీ చెయ్యడానికి, అతనికి సేవచెయ్యడానికి ఒక ఆడది కావాలి! అతను కోరినప్పుడు సుఖాన్ని అందించడానికో స్త్రీ కావాలి! వెరసి అతనికో భార్య కావాలి! ఆ భార్యకి మనసు వుండకూడదు. ఆమెకి ఇష్టాయిష్టాలుండకూడదు. అతను తిట్టినా, కొట్టినా పెదవి విప్పకూడదు. ఆమె అతని బిడ్డకి

తల్లి కావాలి. కాని ఆమె కడుపున ఆడపిల్ల పుట్టకూడదు. పల్లవి కళ్లలోని నీళ్లని ఆర్పేస్తూ అగ్నికణాలు విరజిమ్మసాగాయి.

ఆమె ఒక నిర్ణయానికి వచ్చి ఫోన్ అందుకుంది. అవతల అరుణ్ ఫోన్ లిఫ్ట్ చేశాడు.

"ఒకసారి వెంటనే ఇంటికి రాగలరా?"

"ఎందుకు ఏంకొంప మునిగింది''?

"నా సమస్యకి పరిష్కారం లభించింది. కాదు. నేనే పరిష్కారాన్ని వెతుక్కున్నాను''

"చెప్పేదేదో సరిగ్గా చెప్పి తగలడు'' అసహనంగా అన్నాడు.

"ఇంటికి రండి. మీకే తెలుస్తుంది'' ఆమె ఫోన్ పెట్టేసింది.

★ ★ ★

అరుణ్ ఇంటికి వచ్చేప్పటికి పల్లవి వీధి వరండాలో మెట్లమీద కూర్చుని వుంది.

"ఏమిటీ, ఎందుకు రమ్మన్నావు?"

"నేను రాజమండ్రి వెళ్తున్నాను. మీకు చెప్పి వెళ్దామని'' ఆమె లేచి నిలబడుతూ అంది.

అప్పుడు చూశాడతను ఆమె పక్కనే వున్న సూట్‌కేసుని, వీధిగేటు అవతల ఆగివున్న టాక్సీని.

"ఇప్పుడు రాజమండ్రి వెళ్లడం ఎందుకు? రేపు డాక్టరు రమ్మందిగా? కావాలంటే అబార్షన్ చేయించుకున్నాక వెళ్దువుగాని. కొన్నాళ్ళు రెస్టు తీసుకుని రావచ్చు''

"నేను వెళ్తున్నది తిరిగి రావడానికి కాదు. నేను అబార్షన్ చేయించుకోను. నాకీ బిడ్డ కావాలి!"

"నాకు అక్కర్లేదు'' గట్టిగా అన్నాడు.

"మీ ఇష్టాఇష్టాలతో నాకు ప్రమేయం లేదు. నా జీవితం నాది. ఇన్నాళ్ళూ మీ ఇష్టానికి తలవంచి నా మనసుని, ఆత్మాభిమానాన్ని చంపుకున్నాను. మీకు కావలసినది భార్య కాదు. మీ ఇంటికి చాకిరీ చేసే బానిస. మీ కోరికలు తీర్చే యంత్రం. మీ పురుషాహంకారానికి నా బిడ్డని బలి చెయ్యలేను. అందుకే శాశ్వతంగా మీనుంచి దూరం కావాలని నిర్ణయించుకున్నాను''

"నీకు పొగరెక్కిందే!" అరుణ్ చెయ్యెత్తబోయాడు.

"మీరు కొట్టినా తిట్టినా పడివుండడానికి నేను మీ బానిసను కాను. ఆ చేతిని దించండి'' పల్లవి స్వరం శాంతంగానే వున్నా అందులోని పదును అతన్ని అప్రయత్నంగానే చెయ్యిదింపేసేలా చేసింది.

అరుణ్ పల్లవిలో ఎప్పుడూ లేని తెగింపుని, మొండిధైర్యాన్ని అవాక్కై చూస్తున్నాడు.

"కోర్టులో కలుసుకుందాం! గుడ్‌బై!" పల్లవి గేటు దాటింది. తెల్లబోయిన అతను తేరుకునేలోగానే ఆమె ఎక్కిన టాక్సీ కనుమరుగయింది.

★ ★ ★

తలుపు తడుతున్న ఉమ చేతివేళ్ళు ఉద్వేగంతో కంపిస్తున్నాయి. "తనతోబాటు భర్తని చూసి తల్లి ఆశ్చర్యంతో తలకిందులయిపోతుందేమో''

ఆమె పక్కన నిలబడిన భాస్కర్‌లో ఏదో సంకోచం. సంవత్సరం తరువాత అత్తగారికి ఎదురుపడబోతున్నాడు. ఆవిడని ఎలా పలుకరించాలి? ఏం మాట్లాడాలి? అతని గుండె రెట్టింపు వేగంతో కొట్టుకుంటోంది.

తలుపు తీసిన పార్వతమ్మ ఎదురుగా నిలబడివున్న కూతురిని, అల్లుడిని ప్రశాంత గంభీరంగా చూసింది.

"కులాసాగా వున్నావా బాబూ!" ఆప్యాయంగా అడిగింది. భాస్కర్ తలవూపాడు. పెళ్ళయిన సంవత్సరం తరువాత వచ్చిన తనని "ఇప్పుడు గుర్తు వచ్చానా?" అని వ్యంగ్యంగా అడుగుతుందనుకున్న అత్తగారు అంత ఆప్యాయంగా తనని పలుకరిస్తుంటే అతను మూగవాడయిపోయాడు.




"లోపలకి రండి'' పక్కకి తప్పుకుని దారి ఇచ్చింది.

భాస్కర్ లోపలికి వచ్చాడు.

"కూర్చోండి'' వున్న ఒకేఒక కుర్చీని ముందుకి లాగుతూ అంది ఉమ. అతను కూర్చున్నాడు.

"మీ అక్కయ్యగారు కులాసానా బా బూ?"

"బాగున్నారండి. మీరెలా వున్నారు? ఆమధ్య బాగా జ్వరపడ్డారని ఉమ చెప్పింది. ఎప్పటికప్పుడు మిమ్మల్ని చూడ్డానికి వద్దా మనుకుంటూనే, బ్యాంక్‌లో పనివత్తిడి వలన"

దొంగలుపడిన ఆరు నెలలకి కుక్కలు మొరిగాయన్న సామెతగా అత్తగారికి జ్వరం వచ్చి తగ్గిన ఎనిమిది నెలల తరువాత ఆవిడని యోగక్షేమాలడుగుతుంటే అతనికే అసహజంగా అనిపించింది.

"అవును. ఉమ చెప్పింది. అయినా వట్టి జ్వరమేగా? పనిమానుకుని రావడం అనవ సరం. ఉమా! అబ్బాయికి మంచినీళ్ళు కావా లేమో చూడు!"

ఉమ మంచినీళ్ళు తెచ్చింది.

"మీరు మాట్లాడుతూవుండండి. నేను కా ఫీ తెస్తాను. ఆవిడ లోపలికి వెళ్ళి పెరటి గుమ్మంలోనుంచి సుశీలమ్మ ఇంటితలుపు తట్టింది.

"మా అల్లుడు వచ్చాడు. గ్లాసుడు పాలుంటే ఇస్తావా, వదినా?"

"ఏమిటి మీ అల్లుడే! మీ ఇంటికి రావడ మే! సూర్యుడు పడమరన ఉదయించాడా ఇవాళ?" వేళాకోళంగా అంది సుశీలమ్మ. గంభీరంగా వున్న పార్వతమ్మ ముఖం చూసి తనలా అనకుండా వుండవలసింది అనుకుని నొచ్చుకుంటూ.

"కాఫీ కలిపి ఇస్తాను. పట్టికెళ్ళు'' అంది.

"అతను వస్తాడని ముందు తెలిసివుంటే పాలు, కాఫీపొడి కొనివుంచేదాన్ని. నీకు అన వసరంగా శ్రమ ఇస్తున్నాను'' అంది.

"ఇందులో శ్రమకేముంది?" ఆవిడ కాఫీ కలిపి ఇచ్చింది.

తనకి, భర్తకి కాఫీ అందిస్తున్న తల్లితో అంది ఉమ "నువ్వూ తాగమ్మా!"

"నేను ఇంతకుముందే తాగాను''

ఆవిడ చెబుతున్నది అబద్ధమని ఉమకి తెలుసు. అయినా భర్తముందు ఆవిడతో వాదించడం ఇష్టం లేక మౌనం వహించింది.

పార్వతమ్మ అల్లుడు చాలా రోజులుగా తన ఇంటికి రాకపోకలు సాగిస్తున్నట్టు మా మూలుగా మాట్లాడుతోంది.

భాస్కర్ చేతిపై గిల్లి ఏదో సూచన ఇచ్చింది ఉమ. భాస్కర్ గొంతు సవరించు కుని అన్నాడు.

"మిమ్మల్ని మా ఇంటికి తీసుకెళ్దా మని వచ్చాను అత్తయ్యగారూ!"

ఊహించని ఈ ప్రస్తావనతో అవాక్క యింది పార్వతమ్మ. క్షణంలో సగంసేపు ఆవిడ ముఖంలో రకరకాల భావాలు కదలా డాయి.

"ఈ వయసులో మీరు ఇక్కడ ఒంటరిగా వుండడం అనవసరం. మాకు పెద్ద దిక్కుగా మా ఇంట్లో వుండండి''

"నేను ఒంటరిగా వున్నాననే భావం నాకె ప్పుడూ కలగలేదు బాబూ! ఇరుగు పొరుగు వాళ్ళు చాలా మంచివాళ్ళు. ఏ సమయంలో పిలిచినా వచ్చి ఆదుకుంటారు''

"నిజమే కాని, మీరు మాతోబాటు మా ఇంట్లో వుంటే మాకు తృప్తిగా వుంటుంది!"

"మిమ్మల్ని చూడ్డానికి వస్తూనే వున్నాను గా బాబూ!"

భాస్కర్‌కి నోట మాట రావడంలేదు. ఆ ఇల్లు అతిసామాన్యంగా వుంది. కాని అత్త గారి వ్యక్తిత్వం, ఆవిడ ఆత్మాభిమానం ముందు ఈ ప్రపంచంలోని సిరిసంపదలన్నీ

వెలవెలబోవలసిందే.

"ఇలాంటి వ్యక్తిపట్ల తనెంత సంకుచితంగా ప్రవర్తించాడు!" అనుకుంటే అతనికి సిగ్గనిపించింది.

"నేను ఇన్నాళ్ళూ కనీసం మిమ్మల్ని చూడ్డానికైనా రాలేదు అత్తయ్యగారూ! అందుకు నన్ను క్షమించి మా ఇంటికి రండి. కన్నతల్లి లేని నాకు ఆ లోటు తీర్చండి'' ముఖం దించుకుని నిజాయితీగా క్షమార్పణ కోరాడు.

"అమ్మా! మీ అల్లుడు అంతగా పిలుస్తున్నా వస్తానని అనవేం?" చిరుకోపంగా అంది ఉమ.

"వస్తానమ్మా! ఇప్పుడు మాత్రం కాదు''

"మరి?"

"ఆరునెలల తరువాత"

"ఎందుకత్తయ్యా అంత వ్యవధి అడుగుతున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

నవ్విందావిడ. "ఆరునెలల తరువాత నువ్వే వచ్చి నన్ను తీసుకెళ్ళువుగాని బాబూ!"

ఉమ బతిమాలినా, భాస్కర్ ఎంత చెప్పినా పార్వతమ్మ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

"సరే ఆరు నెలల తరువాత మీ అల్లుడు వచ్చి పిలిస్తే మళ్ళీ మాట మార్చకూడదు'' అంది ఉమ.

"నేను ఎప్పుడైనా మాట తప్పానా ఉమా?" నవ్వుతూ అడిగింది.

ఉమ ఆనందంతో మూగదయింది. "ఆరునెలల తరువాత తన తల్లి తన దగ్గరికే వస్తుంది. ఆవిడ ఎన్నాళ్ళో కష్టపడనక్కర్లేదు''

"ఆలస్యంగానైనా తను మంచి నిర్ణయం తీసుకున్నాడు'' భాస్కర్ తృప్తిగా నిట్టూర్చాడు.

కూతురు, అల్లుడు వెళ్ళాక పార్వతమ్మకి నవ్వు, దుఃఖం ఒకేసారి కలిగాయి.

'ఉమ పిచ్చిది ఆరు నెలల తరువాత తను వాళ్ళ దగ్గరికి వస్తుందని ఎంత తేలిగా నమ్మేసింది. గత ఆరునెలలుగా కేన్సర్‌తో బాధపడుతున్న తను బతికేది మరో ఆరునెల లేనని డాక్టరు తనకి చెప్పిన విషయం ఆమెకి తెలియదు, తెలియకూడదు. తెలిస్తే భాస్కర్ వూరుకోడు. వేలకివేలు ఖర్చుపెట్టి వైద్యం చేయిస్తాడు! అల్లుడిలో మార్పు వచ్చింది. తను చనిపోతే తన శవానికి మున్సిపాలిటీ వాళ్ళు అనాథప్రేత సంస్కారం చెయ్యక్కర్లేదు. తన అల్లుడు ఆ బాధ్యతను స్వీకరిస్తాడు' అనుకుంది కన్నీళ్ళు తుడుచుకుంటూ పార్వతమ్మ.



అన్నపూర్ణమ్మ కూరల సంచితో రోడ్డువారగా నడుస్తోంది. ఆవిడ కాకినాడ వచ్చి అప్పటికి వారం రోజులు. తెలిసి వున్న వాళ్ళద్వారా వృద్ధాశ్రమం నిర్వహించడానికి అనువైన ఇంటిని కొనడానికి అన్ని ఏర్పాట్లు చేసుకుంది. ప్రభుత్వ అనుమతిని పొందడానికి ఒక సోషల్‌వర్కర్ సహాయం అడిగింది.

వృద్ధ శరణాలయం ఎలా నిర్వ

హించాలో తెలుసుకోడానికి ఆవిడ కాకినాడలో గల ఒక వృద్ధశరణాలయానికి వెళ్ళింది. అక్కడ మేనేజిమెంటుని కలుసుకుని తనకి కావలసిన వివరాలు తెలుసుకుని బయటికి రాబోతుండగా ఆ దృశ్యాన్ని చూసింది.

నలభై సంవత్సరాల వ్యక్తి ఒక వృద్ధురాలిని ఆటోలోనుంచి దింపుతున్నాడు. అతను ఆవిడ భుజాన్ని గుచ్చిపట్టుకున్న తీరు, ఆవిడ ఎడల అతని నిర్లక్ష్యాన్ని తెలియచెబుతోంది.

ఆవిడ నడుము వంగి చర్మం ముడతలు పడివుంది. అతను ఆవిడని మేనేజరు దగ్గరకి తీసుకొచ్చాడు.

"ఈవిడ బజారులో కన్పించింది నాకు. తనకెవరూ లేరని ఏడుస్తుంటే ఇక్కడ చేర్పిద్దామని తీసుకొచ్చాను'' మేనేజరు ఆవిడ పేరు, వివరాలు రాసుకుని "ఆయా ఈవిడని పన్నెండవ నెంబరు గదికి తీసుకెళ్ళు'' అన్నాడు. అతను వెనుదిరిగాడు.

ఆ వృద్ధురాలు పిలిచింది. "బాబూ! ఎప్పుడైనా వచ్చి ఈ ముసలిదాన్ని చూస్తుండు నాయనా''

"సర్లే! నస మొదలుపెట్టకు'' అతను విసుగ్గా వెళ్ళిపోయాడు.

ఆవిడ కన్నీళ్ళతో అతను వెళ్తున్నవైపు చూస్తోంది.

అన్నపూర్ణమ్మ ఆవిడని సమీపించి అడిగింది.

"నిజం చెప్పండి. అతను మీకేమవుతాడు?"

ఆవిడ త్రుళ్ళిపడి కళ్ళు తుడుచుకుంది.

"నాకూ తెలియదమ్మా! ఎవరూ లేని అనాథని! మంచి మనసుతో నన్నిక్కడ చేర్పించి వెళ్తున్న పుణ్యాత్ముడు అతను''

"మీమధ్య ఏ అనుబంధము లేదని నన్ను నమ్మమంటారా? ఏ అనుబంధమూ లేకుండానే మిమ్మల్ని చూస్తుండమని అతన్ని అడుగుతున్నారా?"

"అది... అది..."

"అతను మీ కొడుకు కదూ?"

"అవును..." ఆవిడకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. ఒకడు కాదు. నలుగురు కొడుకులున్నారు నాకు. ఆస్తితో బాటు అమ్మని కూడా పంచుకున్నారు. నలుగురి దగ్గర తలొక మూడునెలలు వున్నా అదీ బరువై చివరికి నన్ను ఇక్కడ" ఆవిడ బావురుమంది.

అన్నపూర్ణమ్మ గుండెకి గండిపడింది. కళ్ళలో నీళ్ళు నిలిచాయి. ఆవిడ ఒక స్థిరనిశ్చయానికి వచ్చింది.

"నాతో రండి పిన్నిగారూ!"

"ఎక్కడికి?"

"మా ఇంటికి''

"నువ్వెవరివమ్మా!"

"నేనూ మీ పరిస్థితిలో వున్నదాన్నే. నా లాంటి వాళ్ళకి నాకు చేతనైన సాయం చెయ్యాలనే సంకల్పంతో ఈ వూరికి వచ్చాను''

"నేను నీతో రానమ్మా!"

"ఏం? ఎందుకని?"

"మా అబ్బాయి నన్నిక్కడ చేర్పించి వెళ్ళాడు కదా! వాడెప్పుడైనా నన్ను చూడాలని ఇక్కడికి వస్తే నేనిక్కడ లేనని తెలిస్తే కంగారుపడడూ?"

"మీపై అంత ప్రేమాభిమానాలే అతనికి వుంటే మిమ్మల్నిక్కడ వదిలేసి వెళ్ళి వుండేవాడా?" అని అడగాలనుకుని, అడగలేకపోయింది.

"మీరు ఎప్పుడు రావాలనుకున్నా నా దగ్గరికి రావచ్చు'' అంటూ తన ఎడ్రస్ చెప్పి వెనుదిరిగింది.

"అమ్మాయ్!" అంటూ వెనుకనుంచి పిలి

చింది.

అన్నపూర్ణమ్మ ఆగింది.

"నేను నీతో వస్తానమ్మా! ఏమిటో నా పిచ్చిగానీ, మా అబ్బాయి నన్ను చూడ్డానికి వస్తాడంటావా?" ఆవిడ కళ్లలో నీళ్లు.

"రండి పిన్నిగారూ!" అన్నపూర్ణమ్మ ఆవిడ చేతిని అందుకుంది.



తన బట్టలు ఉతికి ఆరేస్తున్న అన్నపూర్ణమ్మతో అంది మంగమ్మ.

"ఏ తల్లి కన్నబిడ్డవో! నన్ను కన్నతల్లి కంటే ఎక్కువగా ఆదరిస్తున్నావమ్మా! నూరేళ్ళు చల్లగా వుండు తల్లీ!"

వీధి తలుపు తట్టిన శబ్దమయింది.

ఆవిడ వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా నీరజ. కూతురిని అక్కడ చూడగానే ఆవిడ ముఖంలో రకరకాల భావాలు కదలాడాయి.

తననితాను సంబాళించుకుంటూ అంది.

"లోపలికి రా, నీరజా!"





నీరజ లోపలికి వచ్చి ఇల్లంతా కలియ చూస్తూ అంది. "ఎందుకిలా చేశావ్. కన్న కూతుర్ని నేను వుండి కూడా దిక్కులేనిదానిలా ఇక్కడ ఒంటరిగా ఎందుకుంటున్నావ్?"

"నేను ఒంటరిగా వుండడం లేదమ్మా! తోడుగా ఇదుగో ఈవిడ వున్నారు''

"ఈవిడ ఎవరు? ఓహో! వృద్ధశరణాలయాన్ని నిర్వహించబోతున్నానని రాశావు కదూ. నీ శరణాలయంలో చేరిన మొదటి అనాథా?"

అన్నపూర్ణమ్మ కూతురి మాటలకి ఆవిడ నొచ్చుకుందేమోనని ఆవిడవైపు చూసింది. ఆ వృద్ధురాలి ముడతలు పడిన ముఖంలో ఏ భావము వ్యక్తం కావడం లేదు.

"నీకు నా ఇంట్లో సుఖంగా వుండడంకంటే ఇలా అడ్డమైన వాళ్ళకి చాకిరీ చెయ్యడమే బాగుందన్నమాట" నీరజకి తల్లిని చూస్తుంటే రక్తం ఉడుకులెత్తుతోంది.

ఆవిడ మౌనంగా కూతురిని చూస్తోంది.

"అసలు నీకు ముందునుంచి బయటవాళ్ళే నెత్తిమీది దేవతలు! ఇంటికి జ్యేష్ఠాదేవి, పొరుగుకి శ్రీ మహాలక్ష్మి అని ముందంతా ఆ పరంధామయ్యకి దోచిపెట్టావు. ఇప్పుడిలా అనాథలని చేరదీసి వాళ్ళకి దోచిపెడుతున్నావు. అసలు నిన్నుగురించి నువ్వేమనుకుంటున్నావు? నువ్వో మదర్ థెరిస్సావనా?"

"ఆ మహానుభావురాలి ముందు నేనెంతదాన్నమ్మా?" నిర్లిప్తంగా వుంది అన్నపూర్ణమ్మ స్వరం.

"ఎందుకిలా చేశావు. రెండు లక్షలు నా ముఖాన పడేసి నా కళ్ళు తుడిచి, మిగిలిన డబ్బంతా ఎవరో దారినపోయేవాళ్ళకోసం ఖర్చు పెడుతున్న నువ్వసలు నా తల్లివేనా?"

"నన్ను ఆ ప్రశ్న అడిగే ముందు నువ్వు ఆత్మవిమర్శ చేసుకో నీరజా! ఎప్పుడైనా నన్ను తల్లిలా ఆదరించావా?"

"నువ్వు నా తల్లివి కాబట్టే నీకోసం

ఇంతదూరం వచ్చాను. నిన్ను ఇక్కడ ఒంటరిగా వుంచడం ఇష్టంలేక నిన్ను నాతో తీసుకెళ్దామని వచ్చాను''

"కాదు. నా దగ్గర వున్న డబ్బుకోసం వచ్చావు. కానీ ఒక్కవిషయం గుర్తుంచుకో. నా నుంచి నీకు పైసా దక్కదు. డబ్బంతా నీకు ధారాదత్తం చేసి నేను నీ ఇంటికి వస్తే నాకు జరిగే మర్యాద ఏమిటో నాకు బాగా తెలుసు. నేను ఒక వృద్ధ శరణాలయాన్ని వెదుక్కోవలసిందే! అందుకే నేను ఈ నిర్ణయాన్ని తీసుకున్నాను''

నీరజ హతాశురాలయింది. తల్లి చెబుతున్న నిజాలను అంగీకరించడానికి ఆమెకి అహం అడ్డువస్తోంది. అన్నింటికంటే ముఖ్యంగా డబ్బు లేకుండా వెళ్తే గౌతమ్, అమరేశ్వరిలు తనని ఎంత చులకనగా చూస్తారు అనే ఊహకే దుఃఖం వస్తోంది.

"అమ్మా! మరొక్కసారి ఆలోచించు. నువ్వు పొలంమొత్తం అమ్మి డబ్బు ఇస్తావని గౌతమ్‌తో ఎంతో గొప్పగా చెప్పాను! ఇప్పుడు డబ్బు తీసుకురాకుండా వెళ్తే అతను నన్నెంత చులకనగా చూస్తాడు?"

"భార్యని మనిషిగా గౌరవించలేని ఆ వ్యక్తితో కాపురం చెయ్యకు నీరజా! డబ్బే ప్రధానమనుకునే ఆ మనిషితో తెగతెంపులు చేసుకో! నిన్ను నేను చదివించాను. నువ్వు చదివిన చదువుని సార్థకం చేసుకో! నీకాళ్ళ మీద నువ్వు నిలబడు''

నీరజలో అంతవరకూ అణచుకుంటున్న ఆగ్రహం ఎగసిపడే జ్వాలలా మిన్నంటింది.

"ఛీ! నువ్వసలు నా తల్లివని చెప్పుకోడానికే సిగ్గేస్తోంది. నీకు కూతురి కాపురంకంటే నీ అనాథసేవే ముఖ్యం కదూ! చూస్తాను. నువ్వెలా సుఖపడతావో! నువ్వు నన్ను కాదనుకున్నావుకదూ? రేపు నీ కాలు, చెయ్యి వంగాక నిన్నెవరు చూస్తారో చూస్తాను. నీనోట్లో గుక్కెడు మంచినీళ్ళు కూడా ఎవరూ పొయ్యరు. గుర్తుంచుకో!" కోపంగా, ఆవేశంగా శాపనార్థాలు పెడుతూ గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయింది నీరజ.

ఆమె వెళ్ళేవరకు మౌనంగా వుండిపోయిన మంగమ్మ అంది.

"ఆడపిల్లలయితే కన్నవాళ్ళపట్ల రవ్వంత అభిమానం చూపిస్తారు. నాకు ఒక ఆడపిల్లయినా లేదే అని బాధపడేదాన్ని. ఆడపిల్లలు, మగపిల్లలు ఒక్కలాగే ప్రవర్తిస్తున్నారమ్మా! లక్కంటి తల్లి- రాయంటి బిడ్డ అన్నారందుకే' అంది కన్నీళ్ళు ఒత్తుకుంటూ.

అన్నపూర్ణమ్మ నిర్లిప్తంగా చూసింది.

"నేను బజారుకి వెళ్ళి మీకు మందులు తెస్తాను పిన్నిగారూ!" అంది.

"వెళ్ళి రామ్మా!"

అన్నపూర్ణమ్మ వీధిలోకి నడిచింది. కూరలు, మందులు కొని ఇంటికి తిరిగి రాబోతుండగా ఒక నడివయస్కురాలు ఎదురయింది.

"కాస్త ఈ ఎడ్రస్ ఎక్కడో చెబుతారా?" అడిగింది. అన్నపూర్ణమ్మ ఆవిడ అందించిన కాగితాన్ని అందుకుని చూసింది. వృద్ధ శరణాలయం ఎడ్రస్ అది.

"మీకు ఎవరూ లేరామ్మా?" ఆర్ద్రంగా అడిగింది.

"లేకేం? అందరూ వున్నారు. నేను ఎవరికీ లేను'' ఆవిడస్వరం రుద్ధమయింది.

"నాతో రండమ్మా! నేను మిమ్మల్ని కంటికి రెప్పగా చూసుకుంటాను''

"నువ్వెవరివమ్మా!"

"నాకూ ఎవరూ లేరు కానీ... మీలాంటివాళ్ళందరికీ నేను వున్నాను..." అంటూ ఆవిడ చెయ్యి అందుకుంది అన్నపూర్ణమ్మ.



# చతురకతలు

## 'పాద' సాముద్రికం

'బఱ్రెయ్య' నా చిన్నప్పటి స్నేహితుడు. వాడూ, నేనూ ఒకే బళ్ళో చదివేవాళ్ళం. నేను ముందు కూర్చుంటే, వాడు పిల్లల వెన కాల కూచొని 'అయ్య'వారిమీద మట్టిబెడ్డలు, కాగితపు రాకెట్లు విసిరేవాడు.

ఓ రాకెట్టు తగిలి అణుక్షిపణి తగిలినట్లు పేట్రేగిపోయిన మాస్టార్ వాడిని చితకా మతకా తన్నారు. అదే ఆఖరుసారి వాడు బడికి రావడం.

ఆ తర్వాత 'బఱ్రెల' వ్యాపారం మొదలు పెట్టాడు. నేను ఉద్యోగంలో స్థిరపడ్డాను. నిజానికి వాడికి ఐన్‌స్టెయిన్ కున్నన్ని తెలి వితేటలున్నా... అవకాశాలు లేక వుత్త స్టీమ్ ఇంజన్‌లా మిగిలిపోయాడు.

"నీ లెవల్‌కి 'బఱ్రె'లుకాదు! మనుషులతో వ్యాపారం చేయాలి" అన్నానోసారి వాడితో

"అంటే రాజకీయాలా? అది నాకిష్టంలే దు. యమ్. ఎల్. ఏ. లని, యమ్. పి. లని కొని, అమ్మడం, మందలాగ వాళ్లని తోలుకెళ్ళి మెజారిటీ నిరూపించుకోవడం... నాకుససే మిరా రుచించదు. దానికన్నా ఈ అమా యక బఱ్రెలను మేపడంలోనే నాకు చాలా ప్రశాంతత వుంది" అన్నాడు.

"అదికాదు. ఏ జ్యోతిష్య శాస్త్రవేత్తగానో, వాస్తుపండితుడి లాగానో, 'ఎయిడ్స్'ను నయం చేస్తాననే ఆయుర్వేద విద్వాన్ లాగానో ప్రచారం చేసుకో. సక్సెస్ అయితే బోలెడన్ని డబ్బులు..."!



వాడు అనుమానంగా నావంక చూసి... "గోతిష్య శాస్త్రమంటే? " అన్నాడు.

"గోతిష్యం" కాదు... జ్యోతిష్యం అన్నాను.

"అదే చెయ్యి చూసిచెప్పడమే కదా...నాక సలు ఏమీ తెలియదు... అదీగాక సందుకొ కడు చెయ్యి చూసి చెప్పేవాడున్నాడు కదా... ఈ రోజుల్లో..."

"పిచ్చివాడా! జులపాలజుట్టు, గడ్డం, మీసాలు పెంచుకొని, కాషాయ వస్త్రాలు ధరి స్తే...ఎంతటి కష్టమర్ అయినా ఇట్టే చెయ్యి

జాపుతాడు. అదీగాక మనం వెరైటీగా చెయ్యికాదు..."

"...మరి?"

"...'పాదం' చూసి భవిష్యత్‌కాలం చెబుతాం"

"ఆకాలితోనే మన ముఖం మీద ఈడ్చి తంతారేమో?"

"అందుకే 'పాలకోవా'లాంటి చక్కటి మాటలు చెప్పి వాళ్ళని బుట్టలో పడెయ్యాలి"!!

"ఎలా?"

"ఏముంది? పాదాలు 'బండ'గా వున్నాయనుకో, 'ఏనుగు'ని గుర్తు తెచ్చుకో... ఏనుగు మృదువైన స్వభావం కలది... కాని దానికి కోపం వస్తే మటుకు చాలా కష్టం కదా! ఆ లక్షణాలన్నీ ఆపాదించి కష్టమర్‌కి చెప్పాలి..."

"అలాగా..."

"సన్నటిపాదాలు అయితే 'గుర్రాన్ని' స్మరించు...".

బట్రెయ్య తడుముకోకుండా... "మీరు గుర్రంలా తేజోవంతంగా పనిచేస్తారు. కాని పరులు మిమ్మల్ని ఎక్కి 'స్వారీ' చేయాలనుకుంటారు. ఆ విషయంలో జాగ్రత్తగా వుండండి అని చెప్పాలి అంతేకదా" అన్నాడు.

"...సెభాష్... చూశావా నీకెన్ని తెలివితేటలున్నాయో!?"

ఇది జరిగిన కొన్నాళ్ళకి...

పేపర్లో ఓ మూల ప్రకటన పడింది... పాదవిద్యా విద్వాంసులు, శ్రీమాన్ 'బట్రీ'స్వామీజీ హిమాలయాల్నించి రాక... అని వుంది.

తీరా చూస్తే... మా 'బట్రెయ్యే'...

వాడ్ని కలుసుకుందామని 'అడ్రస్' తెలుసుకొని వెళ్ళాను. ఆ మహానగరంలో ఓ ఫైవ్ స్టార్ హోటల్లో ఆరవ అంతస్థులో రూమ్ అద్దెకు తీసుకున్నాడు. అది పూర్తి ఎయిర్‌కండిషన్డ్... అక్కడ గాలి కూడా సువాసన భరితంగా వుంది. దానితోపాటు ఎయిర్‌హోస్టెస్‌లాంటి అందమైన ఆడపిల్లలు వర్క్ చేస్తున్నారక్కడ...

హాలు మధ్యలో మావాడి 'సింహాసనం' చుట్టూ గాంధీ, నెహ్రూ, ఇందిరాగాంధీ, అమితాబ్‌లాంటి ప్రముఖుల ఫొటోలు(?) వాటికింద వ్యాసాలు...

నన్ను చూసి ఆనందంగా కౌగలించుకున్నాడు. సాదరంగా ఆహ్వానించాడు. "నీ దయవల్ల వ్యాపారం(?) బావుందిరా! నీ సలహా విన్నాక తిన్నగా 'కాశీ' వెళ్ళి అక్కడ మెయిన్ బ్రాంచి స్థాపించాను... అది పాపులర్ అయ్యాక... సైడ్ బ్రాంచెస్ ఓపెన్ చేశాను" అన్నాడు.

అతని బిజినెస్ ఆర్జన విన్నాక నాకూ ఉత్సాహం కలిగి "నా పాదాలు ఓసారి చూడవా...?" అన్నాను.

చూశాక చెప్పాడు. "మీవి కుందేలు పాదాలు. చక్కటి సలహాలు చెప్పి, ఇతరులను పైకి తీసుకురాగలరు. మీరుమాత్రం ఎప్పుడూ ఒకేలా వుండిపోతారు".

**డా. కె. శివసుబ్బారావు**

---

# టెన్షన్

ఆమె ఆత్మహత్యకు ప్రయత్నించింది. మొగుడు తాగుబోతు, తిరుగుబోతూను. కుటుంబాన్ని పట్టించుకోడు. ఒక్కగానొక్క పసిబిడ్డకు పాలుకూడా కొని పొయ్యలేని దుస్థితి. నర్సరీ స్కూల్లో ఆయాగా తెచ్చుకునే నాలుగురాళ్ళూ ఎప్పటికప్పుడు గ్రద్దలా తన్నుకుపోతుంటాడు మొగుడు. కాదంటే వొళ్లంతా కుళ్లబొడుస్తాడు.

ఆకలితో నేలపైన పొర్లి ఏడుస్తున్న పసిదాన్నిచూసి కడుపు తరుక్కుపోయింది. ఆ



పిల్ల ఆకలిచావును కళ్లచూసే ధైర్యం తల్లి మనసుకు లేదు. అందుకే పురుగుమందు తాగేసింది. ఇరుగుపొరుగులు చూసి ఆసుపత్రిలో చేర్చారు ఆమెను.

ఆమె ప్రాణాలను కాపాడేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు డాక్టర్. స్టమక్ వాష్‌చేసి చాలావరకు విషాన్ని కక్కించాడు. ఇంజెక్షన్లు ఇచ్చాడు.

సరిగ్గా అదే సమయంలో హడావుడిగా అక్కడికి వచ్చాడతను. ఆమె పరిస్థితిని గురించి ఆత్రుతగా విచారించాడు. తాముచేస్తున్న ప్రయత్నాలను వివరించాడు డాక్టర్. గురించి అతను అడుగుతూనే వున్నాడు. డాక్టర్ ఓపికగా జవాబిస్తూనే ఉన్నాడు.

ఆ రాత్రంతా అక్కడే వున్నాడతను. అతని వదనంలో ఆందోళన కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. అతని పరిస్థితి చూస్తే జాలి వేసింది డాక్టర్స్‌కీ, నర్సులకీను. అతనికోసమేనా ఆమె బతికితే బావుండుననిపించింది.

తెల్లవారింది. బల్లపైన కూర్చుని కునికిపాట్లు పడుతూన్న అతన్ని లేపాడు డాక్టర్. "ఆమెకు తెలివి వచ్చింది. అదృష్టవశాత్తూ ప్రమాదం తప్పింది. మీరు వెళ్ళి చూడవచ్చు" అన్నాడు.




అతను బయటే కూర్చున్నాడు. గంటగంటకూ డాక్టర్ దగ్గరకెళ్ళి ఆమె సమాచారం అడుగుతున్నాడు. పరిస్థితిని ఎప్పటికప్పుడు వివరిస్తున్నాడు డాక్టరు... ఆమె తెలివిలేకుండా పడివుంది. ఇరవై నాలుగ్గంటలు గడిస్తేగాని ఏ విషయం ఖచ్చితంగా చెప్పలేనన్నాడు.

సమయం గడిచే కొద్దీ టెన్షన్ ఫీలయిపోతున్నాడతను. ఆమెకు ప్రమాదం తప్పాలని అన్నిమతాల దేవుళ్లకూ మొక్కుకోసాగాడు.

మళ్లీ మళ్లీ డాక్టర్ని ఆమె కండిషన్

అతని వదనంలోకి కాంతి వచ్చింది. "థాంక్యూ, థాంక్యూ డాక్టర్!" అంటూ హడావుడిగా ఆమె వున్న గదిలోకి వెళ్లబోయాడు.

అంతవరకూ అణచుకున్న కుతూహలం ఒక్కసారిగా బయటకు తన్నుకొచ్చింది డాక్టర్‌కి. అతన్ని ఆపి, "నిన్నట్నుంచీ చూస్తున్నాను, ఆమెకోసం నువ్వు పడుతూన్న ఆందోళన, చూపుతూన్న ఆతురతాను. ఇంతకూ నువ్వు ఆమెకు ఏమవుతావు? " అనడిగాడు.

"ఏమీ కాను" అన్న అతని జవాబుకి తెల్లబోయాడు డాక్టర్.

"సారీ, డాక్టర్! అసలు విషయం మీకు




చెప్పనేలేదు కదూ? కొత్తగా సర్వీసులో చేరిన పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ని నేను. ఆవిడ ఆత్మహత్యా ప్రయత్నం చేసిందని తెలిసి పరుగెత్తుకొచ్చాను. ఆత్మహత్యా ప్రయత్నం చట్టరీత్యా నేరం అన్న సంగతి మీరు ఎరిగినదే. ఆమె బతికినట్లయితే కేసు బుక్ చేద్దామన్నది నా తపన. పైగా నేను ఉద్యోగంలో చేరగానే దొరికిన మొదటి కేసిది. చేజార్చుకోవడం ఇష్టంలేదు. అందుకే ఆమె బతకాలని అంతగా కోరుకున్నాను...!!"

-అతని పలుకులు పూర్తికాకుండానే 'షాక్'తో దబ్బున పడిపోయాడు డాక్టర్.

**-తిరుమలశ్రీ**

---

# సెంటిమెంట్

శ్రీధర్, సత్యం ఒకే ఆఫీసులో అసిస్టెంట్స్‌గా పనిచేస్తున్నారు. అందాల యామిని అదే సెక్షన్‌లో టైపిస్ట్.

శ్రీధర్ యామినిని లోలోపలే ప్రేమిస్తున్నాడు. అదీగాక హైదరాబాద్ వంటి సిటీలో భర్తకు తోడు భార్య సంపాదన గూడా వుంటే హేపీగా వుంటుందనే ఆలోచనా వుంది. తన మనసులోమాట చెప్పాలని వున్నా ఎప్పటికప్పుడు వాయిదావేస్తూ రోజులు దొర్లిస్తున్నాడు.

అయితే అనుకోకుండా ఓ చిక్కొచ్చిపడింది.

సత్యం ఈ విషయంలో ముందడుగువేసి తన తల్లిదండ్రుల్ని తీసుకొచ్చి యామినిని చూపించాడనీ, త్వరలో వాళ్ళిద్దరికీ పెళ్ళి జరుగుతుందనీ అందరూ చెప్పుకోసాగారు.

శ్రీధర్ డీలా పడిపోయాడు. ఆప్తమిత్రుడు బ్రహ్మానందానికి చెప్పుకుని గొల్లుమన్నాడు.

"దీనికే ఇంత వర్రీ అయిపోతావెందుకు? అపాయాన్ని ఉపాయంతో జయించాలి! నీకు యామినితో పెళ్ళి జరగాలి అంతే గదా? " అన్నాడు బ్రహ్మానందం.

"అంతే! కానీ, ఇప్పుడెలా? వాడు చాలా అడ్వాన్స్‌గా వున్నాడే. ఆల్ రెడీ పెళ్ళిచూపులైపోయాయి కూడానూ" విచారంగా అన్నాడు శ్రీధర్.

"ఇల్లలకగానే పండగకాదు. పెళ్ళిచూపులు అవగానే పెళ్ళయిపోదు. దానికి బోల్డు తతంగం వుంది. నేను చక్రం అడ్డేస్తాగా నువ్వేం దిగులుపడకు"

"ఏం చేస్తావేం? "

"ఏం చేస్తానో, ఎలా చేస్తానో చూస్తూండు. మరి మనకి బీదర్ తీసుకెళ్ళి గ్రాండ్ పార్టీ ఇవ్వాలి సుమీ" అన్నాడు బ్రహ్మానందం.

"దానికేవుంది? యామినితో నా పెళ్ళి కుదరాలేగానీ మన సెక్షన్ మొత్తాన్ని బీదర్ తీసుకెళ్ళి పార్టీ ఇస్తా! అవునుగానీ ఎట్లా చక్రం అడ్డువేస్తావో చెప్పు" అన్నాడు శ్రీధర్.

"సత్యంగాడికి జాతకాల పిచ్చి, జోతిష్యం చాదస్తం బాగానే వున్నాయి. అయితే డబ్బిచ్చి చూపించుకోని పిసినిగొట్టు. నాబోటి మిడిమిడిజ్ఞానంగల వాళ్ళని పట్టుకుంటుంటాడు. నేను ఈ మధ్య సరదాగా తెలుగు యూనివర్సిటీలో జ్యోతిష్యంలో డిప్లొమా చేసినప్పటినుంచీ నన్ను చంపుతున్నాడ్లే"

"అయితే ఇప్పుడేంటి? "

"యామిని డేట్ ఆఫ్ బర్త్, వగైరాలన్నీ తీసుకుని వచ్చినట్టు రేపు నాదగ్గరకొస్తాడు. అప్పుడు నేను చక్రం అడ్డువేస్తాగా ఫినిష్. ఇక యామిని పేరెత్తడు" అన్నాడు బ్రహ్మానందం.

శ్రీధర్ వుబ్బి తబ్బిబ్బయ్యాడు. సత్యంతో

యామిని పెళ్ళి తప్పిపోయినట్లు కలలు కన సాగాడు.

★ ★ ★

ఆ మర్నాడు సత్యం తన సీట్లోనుంచి బ్రహ్మానందం దగ్గరికి వెళ్ళి చాలాసేపు గుస గుసలాడడం గమనిస్తూనే వున్నాడు శ్రీధర్.

సత్యం అటెళ్ళగానే శ్రీధర్ పరుగెత్తుకె ళ్ళాడు.

"ఏం చెప్పావేం? " ఆత్రంగా అడిగాడు.

"సెంటిమెంట్ మీద కొట్టాను. యామి



నితో పెళ్ళయితే నీ తల్లి దండ్రులకి ప్రాణ గండం అని చెప్పాను. ఎవరో ఒకరుగాని, లేదా ఇద్దరూ ఢాం అంటారని హడలగొ ట్టాను" అన్నాడు బ్రహ్మానందం.

"వాడు నీ మాటమీదే వుంటాడని నమ్మకం ఏమిటి? మరొకరికి ఆ జాతకం చూపిస్తే? " అనుమానంగా అడిగాడు శ్రీధర్.

"చస్తే చూపించడు పీనాసివెధవ"

శ్రీధర్, బ్రహ్మానందానికి షేక్ హేండ్ ఇచ్చాడు.

"పద అట్లా హోటల్ కెళ్ళి స్వీట్ తిందాం" అన్నాడు శ్రీధర్.

★ ★ ★

వారంరోజుల తర్వాత బ్రహ్మానందం అంచనాలు తారుమారు చేస్తూ, శ్రీధర్ పేక మేడలు కూలుస్తూ సత్యం, యామినితో తన పెళ్ళికి ఆఫీసులో అందరికీ వెడ్డింగ్ కార్డులు పంచాడు.

బ్రహ్మానందం బిత్తరపోయాడు.

శ్రీధర్ కృంగిపోయాడు.

తర్వాత బ్రహ్మానందం, సత్యాన్ని ఒంట రిగా కలుసుకున్నాడు.

"ఏమిటోయ్ ఇది? " అన్నాడు.

సత్యం చిరునవ్వు నవ్వాడు.

"నువ్వు చెప్పింది గుర్తుంది గురూ! అమ్మా, నాన్నలకి గండం అంటావా? ఎట్లా జరగాల్సివుంటే అట్లా జరుగుతుంది. జరిగేదాన్ని మనం ఆపలేం గదా! మా అమ్మకి సుగర్. మా నాన్నకి సుగర్‌తో పాటు బి.పీ. గూడా వుంది. డాక్టర్ల చుట్టూ తిరగలేక చస్తున్నాననుకో. ఆటెస్టూ, ఈటెస్టూ అని డబ్బంతా తగలేయిస్తున్నారు. యామినితో పెళ్ళయ్యాకైనా వాళ్ళకీ బాధ ల్నుంచి విముక్తి కలిగితే అంతకంటే కావ ల్సిందేవుంది గురూ!"

సత్యం మాటలకు బ్రహ్మానందానికి కళ్ళు గిర్రున తిరిగాయి.

-వాణిశ్రీ

# 'నరమేధం' పై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన గోపరాజు నాగేశ్వరరావు నవల 'నరమేధం'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## 'అంచులేని చీర'

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ఒక విలక్షణమైన ఇతివృత్తాన్ని తీసుకుని సామాన్యునికి అవగాహన, పండితులకు సామాజిక స్పృహ కలిగించేలా మంచి నవలను రాయగలిగారు రచయిత.

ప్రతిమనిషిలోనూ నిద్రాణంగా ఒక అనూహ్యమైన శక్తి ఉంటుందన్న వాస్తవాన్ని సుందరీ, రామ్మూర్తి పాత్రలద్వారా ప్రస్ఫుటింపజేశారు. నిశ్చలమైన తటాకంలో రాయి విసిర్తే విరగబడే తరంగాల మాదిరి, ప్రకృతి ఒడిలో పసిపాపల్లా నిర్భయంగా అమాయకంగా విశ్రాంతి తీసుకుంటున్న భారతీపురం ప్రజల్ని ఆధునికతా, అభివృద్ధీ, నవ్యనాగరికతా అనే సున్నితమైన ఛర్నాకోళ్లతో లేవగొట్టి, బెంబేలు పుట్టించి బానిసలుగా మార్చిన సంఘటనల పరంపర చీర పొడవు అయితే అనంత రామయ్య నిష్ఠ, నియమం, గాంధేయవాదం ఆ చీరకి కట్టు అంచుకాగా, అందర్నీ వివశుల్ని చేసిన రామ్మూర్తి చాణుక్యరీతి, సుందరి క్షమాగుణం. త్యాగనిరతి, ఆ చీరకి జానెడు వెడల్పు పట్టుబోర్డరులా అమిరాయి.

అయితే ఏ చీరకైనా వన్నె, వాసి తెచ్చేది పమిట అంచు. అదే ముగింపు. అది మాత్రం ఏదో చేయాలనుకొని ఏదీ చేయలేక సరేలే దాన్ని అలాగే వదిలివేద్దాం అదో వెరైటీగా జనం స్వీకరిస్తారులే అన్న ధోరణిలో నేసిన

అంచులా ఉంది ముగింపు.

మొత్తానికి యువతరానికి స్ఫూర్తిని, స్పందనను ఇవ్వగల సత్తా ఉన్న నవల ఈ నరమేధం.

-వి.యస్.మంగళంపల్లి
హైదరాబాద్-500 043

## 'క్రైమ్ సినిమా'

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

**అ**నుబంధాలు, మమతానురాగాలు, కష్టన ష్టాలు పంచుకొంటూ ఉండే పచ్చని పల్లె గూట్లోకి వలస పక్షుల ప్రవేశంతో పల్లె అతలాకుతలమై, రావణకాష్ఠంగా మారే ఇతి వృత్తంపై వచ్చిన చతుర నవల నవంబర్ నెల 'నరమేధం'.

కథలో నవ్యత, కథా గమనంలో పటుత్వం లేక చదివించే శక్తి లోపించింది.

పాత్రల స్వభావాల చిత్రణ లోపభూయిష్టంగా ఉంది. ఉదాహరణకు కసాయి మనస్తత్వంగల సుబ్బారావు ఆత్మహత్య చేసుకొనేంత దుర్బలుడు కాదు. ఆచారాలకు విలువనిచ్చి, ఊరిని కట్టుబాట్లలో ఉంచిన మునసబు గాంధీ ఏకంగా ప్లేటే ఫిరాయిస్తాడు. నాయికా, నాయకులు ఏ గమ్యంవైపు ప్రయాణిస్తున్నారో ఏ లక్ష్య సాధనకు ప్రయత్నిస్తున్నారో పాఠకుడికి అర్థంకాదు. చివరికి నవల ముగింపుకు రచయిత సైతం అయోమయంలో పడ్డట్టయింది.

పోలీసు వ్యవస్థనే శాసించగల్గిన శివయ్య మనుషులు రామ్మూర్తిని చంపకుండా పోలీసుల్ని చూసి వదిలేయడం, కథ నడవదేమోననేగదా!

విషవాయువుల ప్రభావానికి జనం కుప్పలుగా చనిపోతున్నా రామ్మూర్తి మాత్రం యథేచ్ఛగా విహరించినా ఏ హానీ జరగదు. ఫ్యాక్టరీ గ్యాస్ టాంకర్స్ పేలితే అరగంట వ్యవధిలో గాలివాటుకు దూరంగా వెళ్లిపోతాయా? భోపాల్ గ్యాస్ దుర్ఘటన, ఆ పీడకల గుర్తున్న వారికెవరికైనా చిత్రంగాతోచే ఈ ఘట్టం రచయిత అవగాహనా లోపాన్ని ఎత్తి చూపుతుంది.

మగ్గాలు, చేనేత వస్త్రాలు, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాల గురించి రచయితకు మంచి అవగాహన ఉన్నట్లుంది. చక్కగా అక్షరీకరించారు కానీ పల్లె అందాలు, పల్లె ప్రజల మమతానురాగాలు ప్రతిబింబించేందుకు కొంతైనా ప్రయత్నించలేదు.

నవల పూర్తయ్యేసరికి ఓ డబ్బింగ్ క్రైమ్ సినిమా చూసిన భావం కలుగుతూ నిరాశ పర్చింది.

-నాగం శివారెడ్డి
ఆదూరుపల్లి- 524342

## 'భవిష్యవాణి'

*(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**మా**రుతున్న పరిస్థితులు, పెరుగుతున్న జనాభా, వీటికి తోడు మితిమీరిన స్వార్థ రాజకీయాలు పచ్చని పల్లెలకి కూడా విస్తరించి తమ ప్రతాపాన్ని చూపుతున్నాయనీ, పల్లెల పచ్చదనాన్ని హరించివేసి పొగలుగా మార్చుతున్నాయనీ, కాలం, ప్రకృతి మనిషికి ప్రసాదించిన సహజ ఆయుష్షును సగం వరకు స్వాహాచేసి మనిషి మనుగడను ప్రశ్నార్థకం చేస్తున్నాయనీ, ఇదే విధంగా ముందు కూడా కొనసాగితే జీవరాశి అతి త్వరలో అంతమొందుతుందనీ హెచ్చరిస్తూ చాలా పెద్ద సత్యాన్ని చిన్న నవలలో ఇమడ్చడానికి చేసిన ప్రయత్నంలో గోపరాజు నాగేశ్వరరావుగారు చాలావరకు కృతకృత్యులయ్యారు.

'తాచెద్దు కోతి వనమంతా చెరిచింద'న్న





ట్లుగా నీతిగా బతుకుతున్న 'భారతీపురం' ప్రజలను తమ స్వార్థ ప్రయోజనాల కోసం సుబ్బారావు, శివయ్యలు మందు ప్రియులుగా మార్చబూనడం, వీరికి స్వయానా మంత్రే అండగా నిలవడం, 'అగ్నికి ఆజ్యం తోడైన' విధంగా ప్రారంభమయిన ఆ ఊరి వినాశక కార్యక్రమం గబ్బర్‌సింగ్ విషవాయువు ట్యాంకులను పేల్చివేసి 'నరమేధం' సృష్టించడంతో ముగుస్తుంది. అయితే గబ్బర్‌సింగ్‌లాంటి గూండా చేస్తున్న అరాచక ప్రయత్నాన్ని ఆపడానికి సుందరి ఒక్కర్తే వెళ్లడం హాస్యాస్పదం. అంతే కాకుండా కార్మికులకు లీడర్‌గా ఉండడానికే అయిష్టత చూపిన రామ్మూర్తి తన అత్త చనిపోయినపుడు అంత భారీగా ఊరేగింపుకు అంగీకరించాడా? అన్నది కూడా సందేహాస్పదమే. అదేవిధంగా విషవాయువు ఊరంతా వ్యాపించి మనుష్యులను చంపేస్తుంటే రామ్మూర్తి ఊర్లోకి పరుగెత్తడం కూడా నమ్మశక్యంగా లేదు. ఇలాంటి కొన్ని లోపాల్ని మినహాయిస్తే నవల లక్ష్యంవైపు పయనించిందనే చెప్పాలి. నాంచారయ్యలాంటి స్వార్థపూరిత మోసగాళ్ల చేతుల్లో కార్మికుల్లాంటి అమాయకులే కాకుండా ముందు వెనుక ఆలోచించకుండా ప్రవర్తించే చదువుకున్న రమణిలాంటి వాళ్లు కూడా మోసపోతారని చాలా చక్కగా చెప్పారు.

రాజకీయాలలో శాశ్వత మిత్రులుకాని శాశ్వత శత్రువులు కాని ఉండరని గాంధీ, శివయ్యలు నిరూపించారు. తమ మనుగడ కోసం రాజకీయాధికారాలకోసం ఎంతటి రాజకీయ శత్రువులైనా ఎన్నికల సమయంలో మిత్రులుగా మారతారని చెప్పిన తీరు నేటి రాజకీయ నాయకుల ప్రవర్తనకు అద్దం పడుతుంది. రాజకీయాలలో చిన్న చేపలను పెద్ద చేపలు మింగి తమ బలాన్ని, స్థానాన్ని సుస్థిరం చేసుకుంటాయని శివయ్య అమరలింగాన్ని, గాంధీలను జైలుకు పంపించే ఏర్పాటులో రుజువు చేశాడు. రాజకీయాలలో మంచివాళ్లకి మనుగడలేదని, మంచి వాళ్లు రాజకీయాలలోనే ఉండాలంటే తప్పనిసరిగా చెడ్డవాళ్లుగా మారాలని గాంధీ పాత్ర చెపుతుంది.

ఈ కలియుగంలో ధర్మం ఒంటి పాదంమీద నడుస్తున్నదని ఈ కుంటి నడకతో అధర్మాన్ని జయించలేమని, ఇప్పుడున్న చెడును ప్రక్షాళన చేయడానికి రామ్మూర్తి, చైతన్య, వెంకటస్వామి లాంటి కొద్దిమంది సహాయ సహకారాలు చాలవని అది సమాజంలో వచ్చే అనుకూలమైన మార్పుతోనే సాధ్యమవుతుందని రచయిత చెప్పకనే చెప్పారు.

-యం.చినవెంకటరావు
మహాదేవపురం- 507203

## 'సినిమాటిక్'

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

అసహ్యకరమైన గొంగళిపురుగు రూపాంతరం చెంది రంగురంగుల సీతాకోకచిలుకగా మారి మనసుల్ని రంజింపచేస్తుంది. కానీ పాటిచేల గాలులతో, పాలపిట్ట పలుకులతో, పల్లెపడుచుల పాటలతో, మనోహరంగా చెంగుచెంగున దూకే లేగదూడలతో, ఆనందంగా ఊగేచెట్లతో, పచ్చికబయళ్లతో సీతాకోకచిలుకల్లా నయనానందకరంగా వించే పల్లెటూళ్లు రూపాంతరం చెంది గొంగళిపురుగుల్లా అన్పిస్తున్నాయన్న వైనాన్ని అతి సహజంగా అక్షరీకరించారు గోపరాజు నాగేశ్వరరావుగారు తమ నవల నరమేధంలో. చిన్న పల్లెటూరు పారిశ్రామిక నగరంగా ఎలా వృద్ధి చెందిందీ చక్కగా చిత్రీకరించారు. కార్మిక వర్గాలమధ్య సాగే నాయకత్వ పోరాటాలను, వాటికి అండగా నిలిచి సంకుచిత రాజకీయ లబ్ధికోసం, నిర్లజ్జగా ఏమాత్రం సంకోచంలేకుండా ఎంతకైనా దిగజారిపోగల

మనే రాజకీయ పార్టీల వైఖరిని యధాత ధంగా కళ్లకు కట్టినట్టు రాశారు.

అలాగని దీన్ని గొప్ప నవలగా చెప్పసా హసించనూలేము. పల్లెటూరి వాతావర ణంతో ఆహ్లాదకరంగా మొదలుపెట్టి అనేక సంఘటనల్ని అల్లిబిల్లిగా అల్లుకుంటూ చివరి కి యుద్ధ వాతావరణంలో భీతావహంగా ముగించబడిన ఈ నవలలోని ఏ పాత్రా పాఠకుల హృదయాలను కదలించి గు ర్తుంచుకోగలిగేట్లుగా లేదు. పాత్రల ప్రవేశం, నిర్గమనం అభ్యంతరకరంగా అన్పించ కుండా చక్కటి అవగాహనతో సాగించారు. అయితే సన్నివేశాలు, సంఘటనలు సినిమా టిక్‌గా ఉన్నాయే తప్ప నవలా భావన కల్గించవు. ఆయా పాత్రలకు సాధ్యపడని పనులను కూడా అతి సునాయాసంగా జరి పించడం హాస్యాస్పదంగా ఉంది. ఉదా: రమణి గూఢచారత్వం.

ముగింపుచూస్తే నవల పేరు నరమే ధంగా ముందే నిర్ణయించుకొని ఆ తర్వాత నవల రాయడం సాగించినట్టుగా అన్పి స్తుంది. కేవల స్వార్థ రాజకీయ రాక్షసులెంత కైనా తెగించగలరన్నది నిరూపించబడింది.

నవలను భావుకతతో ముగించాలన్న రచ యిత ఆలోచన సఫలీకృతం కాలేదు.

-వి.యస్.యన్.మూర్తి
తణుకు- 534211

## 'జరుగుతున్న చరిత్ర'

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ప్రశాంతమైన గ్రామంలోకి అత్యాసపరులు, స్వార్థ రాజకీయాలు ప్రవేశిస్తే ఎటువంటి విధ్వంసకర పరిణామాలు సంభవిస్తాయో, ప్రజల జీవితాలు ఎలా ఛిన్నాభిన్నమౌ తాయో వాస్తవంగా విపులీకరించింది నవంబరు నవల 'నరమేధం'

ఎంతో సచ్ఛీలుడైన మున్సబుగాంధీ అవి నీతి బాటలో పయనించడానికీ, నిస్వార్థపరు డైన అతను స్వార్థపరులతో చేరి తనూ అదే బాటలో నడవడానికీ సమకాలీన రాజకీయా లే కారణం. సుబ్బారావు లాంటి అవినీతి పరుడైన ఉద్యోగికి సరియైన గుణపాఠం నేర్పించారు, దారి తప్పిన అతనికుమార్తె రమణిద్వారా. కార్మిక వర్గాన్ని నమ్మించి దగా చేసే నాంచారయ్య వంటి సోకాల్డ్ కార్మిక నాయకులు, యూనియన్ ఎన్నికల్లో విజయం సాధించి, తమ స్వప్రయోజనాలను సాధించుకోవచ్చనే కుబుద్ధిగల శివయ్య వంటి పెద్దమనుషులు, అతని స్వార్థానికి ఉపయోగపడే శాయి, గబ్బర్, ఆంజనేయు లు వంటి గూండాలు ఇటువంటి పాత్రల ద్వారా సరిగానే హెచ్చరించారు రచయిత.

వీరందరికీ అతీతంగా రామ్మూర్తివంటి నిస్వార్థపరుడైన యువ నాయకుడు, అతని భార్య అనాకారి అయినా అందమైన మన స్సు గల సుందరి ఈ నవలలో ప్రధాన పాత్రధారులై, మంచితనానికి నిర్వచనం చె ప్పారు. తాగుబోతు గబ్బర్ చేసిన ఉన్మాద చర్యతో 'నరమేధం' జరిగి దుష్ట సంహా రంతోపాటు సుందరి వంటి మంచి మనిషి బలికావడం బాధాకరమైన విషయమే.

నవలలో సినిమాటిక్ సంఘటనలు, వ్యా ఖ్యానాలు అధికంగా ఉన్నప్పటికీ ఆసక్తిక రంగా చదివించడానికి కారణం ఇందులో ఎన్నో సహజ సన్నివేశాలు జరుగుతున్న చరిత్రకు దర్పణంగా ఉండటమే.

-పంతంగి రవీంద్రశ్రీనివాస్
సూర్యాపేట- 508213

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942, Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78